శ్రీరస్తు.

శ్రీమదఖిలభూమండలమండనాయమానులగు,

మనీషిబృందంబులచే,



నిఖిలకర్మాచరణానుకూలంబులని;

మిగులసంస్తూయమానంబులగు



# ముహూర్తదీపిక-ముహూర్తదర్పణంబులను

గ్రంథంబులు ప్రతిపదటీకతోఁగూర్చి

లేఖకప్రమాదాదిజనితదోష

విరహితముగా బరిష్కరింపంబడి



నేలటూరు - సుబ్రహ్మణ్యంగారి.

విద్యావిలాసముద్రాక్షరశాలయందు.

ముద్రింపబడియె.

౧౮౭౯ సం.



శ్రీరస్తు.

మహాతర్కదీపికా.



నక్షత్రనిఘంటు.

శ్లో॥ యఃకర్తాజగతాంభర్తాసంహర్తామహసాన్నిధిః।
ప్రణమామితమాదిత్యంబహిరంతస్తమోపహం॥ ..... ※

టీక॥ జగతాం-లోకములకు-భర్తా-ప్రభువైనటువంటినిన్ని-సంహర్తా లయకరుడైనటువంటినిన్ని-మహసాం-తేజస్సులకు-నిధిః-స్థానభూతమైనవాడు-యః-ఎవడో-అహం-నేను-బహిరంతః-లోపలవెలపలనుండినటువంటి-తమః-అజ్ఞానాంధకారమును-అపహం-పోగొట్టుచున్నటువంటి-తమాదిత్యం-ఆసూర్యునిగురించి-ప్రణమామి-నమస్కరించుచున్నాను॥ .. . .. ※

శ్లో॥ భవత్యశ్వినినక్షత్రం-అశ్వీదస్రస్తురంగమః-ఆద్యస్తురంగస్తురగః-అశ్వోవాజహయోహరిః॥ టీ॥ అశ్వీ-దస్రః-తురంగమః-ఆద్యః-తురంగః తురగః-అశ్వః-వాజీ-హయః-హరిః-ఈ-౧౦ న్ని అశ్వినీనక్షత్రముపేళ్లు॥ ※

శ్లో॥ భరణీస్యాద్యమోయామ్యస్త్వంతకోయమసంజ్ఞకః॥ టీ॥ యమః యామ్యః-అంతకః-యమసంజ్ఞకః-ఈ-౪-న్ను భరణినక్షత్రముపేళ్లు॥ ※

శ్లో॥ కృత్తికాబహులాజ్ఞేయాహుతభుగ్వహ్నిసంజ్ఞికా-వట్టారకోపావకశ్చానలోథజ్వలనస్తథా॥ టీ॥ కృత్తికా-బహులా-హుతభుక్-వంహ్ని సంజ్ఞికా-వట్టారకః-పావకః-అనలః-జ్వలనః-ఈ-౮-న్ని కృత్తికానక్షత్రముపేళ్లు॥ ... .. ... ... ... .. ... .. ... ... ... ... .. ※

శ్లో॥ రోహిణీచవిధిర్బ్రహ్మప్రాజాపత్యశ్చతుర్ముఖః-ప్రజాపతిః ప్రజేశశ్చవిధాతాపంకజాసనః-ఆత్మభూఃపద్మయోనిస్స్యాద్బ్రహ్మానామతతఃపరం॥ టీ॥ రోహిణీ-విధిః-బ్రహ్మ-ప్రాజాపత్యం-చతుర్ముఖః-ప్రజాపతిః-ప్రజేశః-విధాతా-పంకజాసనః-ఆత్మభూః-పద్మయోనిః-బ్రహ్మానామ-ఈ-౧౨ న్ను రోహిణీనక్షత్రముపేళ్లు॥ ... ... .. ... ... ... ... ※

శ్లో॥ మృగశీర్షేమృగశ్చంద్రఇందుర్హిమదీధితిః-స్యాచ్చంద్రశిశుభంసోమోనిశానాథోనిశాకరః॥ టీ॥ మృగః-చంద్రః-ఇందుః-హిమదీధితిః-

చంద్రః-శశభృం-సౌమ్యః-నిశానాథః నిశాకరః-ఈ-౮-న్ని మృగశీర్షే-మృగశి
రానక్షత్రమనువర్తించును॥ ... ... ... ... ... ... *

శ్లో॥ ఆర్ద్రారౌద్రే చపురజిద్భర్గస్థాణుశ్చ ప్రోహరః॥టీ॥ ఆర్ద్రా - పు
రజిత్ -భర్గః-స్థాణుః-భవః-హరః-ఈ-౬- ఆర్ద్రానక్షత్రమనువర్తించును॥

శ్లో॥పునర్వస్సు ర్దితి ర్దేవ-మాతా అదిత్యమేవచ॥టీ॥పునర్వసుః- అదితిః-
దేవమాతా-ఆదిత్యం-ఈ-౫-న్ని పునర్వసు పేర్లు॥ ... ... *

శ్లో॥ ఇజ్యార్చ్యౌతిష్యపుష్యశ్చ పూజితో గురునామకః- వాగీశశ్చామ
రేజ్యశ్చ - జీవోదేవపురోహితః॥టీ॥ ఇజ్యః-అర్చ్యః-తిష్యః- పుష్యః - పూజి
తః-గురునామకః-వాగీశః - అమరేజ్యః - జీవః-దేవపురోహితః - ఈ - ౧౦-
పుష్యమి పేర్లు॥ ... ... ... ... *

శ్లో॥ ఆశ్రేషోరగసార్పాహి-భుజంగవ్యాళసంజ్ఞికః॥టీ॥ ఆశ్రేషః - ఉ
రగః-సార్పః - అహిః-భుజంగః-వ్యాళసంజ్ఞికః-ఈ-౬-న్ని ఆశ్రేషకు పేర్లు॥

శ్లో॥ మఘాపితాచ పైత్ర్యశ్చ మేఖలాపిత్ర్యభం తథా॥టీ॥మఘా-పితా- పై
త్ర్యః-మేఖలా-పిత్ర్యభం-యీ-౫-న్ని మఘానక్షత్రము పేర్లు॥ ... *

శ్లో॥భాగ్యం పూర్వాఫల్గునీస్యాత్ - భగాఖ్యం భగసంజ్ఞికం॥టీ॥ భాగ్యం-
పూర్వాఫల్గునీ-భగాఖ్యం-భగసంజ్ఞికం-యీ-౪-న్ని పూర్వ- ఫల్గునీపుబ్బా
నక్షత్రము పేర్లు॥ ... ... ... *

శ్లో॥ అర్యమార్యమణం చైవ-అర్యమ్ణం చోత్తరం తథా॥టీ॥ అర్యమః- అర్య
మణం-అర్యమ్ణం-ఉత్తరం-యీ-౪-న్ని ఉత్తర ఫల్గునీ పేర్లు-ఉత్తరనక్షత్రము॥

శ్లో॥హస్తస్సవితృ సావిత్ర అర్క-సూర్యో దివాకరః॥టీ॥హస్తః-సవితా
సావితా- అర్కః- సూర్యః- దివాకరః-యీ-౬- న్ని హస్తనక్షత్రము పేర్లు॥

శ్లో॥చిత్తస్స్యాత్ త్వష్టృదేవత్యం త్వాష్ట్రింద్రే సువర్ధకం॥టీ॥ త్వష్టృ
దైవత్యం-త్వాష్ట్రం-ఇంద్రం - సువర్ధకం యీ-౪- న్ని- చిత్తాస్యాత్ -
చిత్తానక్షత్రము॥ ... ... ... *

శ్లో॥స్వాతీ సమీరణో వాయుః - పవనశ్చానిలోమరుత్॥టీ॥ సమీరణః-
వాయుః-పవనః - అనిలః-మరుత్ -యీ - ౫ న్ని- స్వాతీ-స్వాతీనక్షత్రము -
స్యాత్ - అగును॥ ... ... ... ... ... ... *

శ్లో॥విశాఖం పూర్వమింద్రాగ్నిం ద్విదైవత్యం విశాఖకం॥టీ॥విశాఖం-
పూర్వం- ఇంద్రాగ్నిం- ద్విదైవత్యం - ఈ - ౪ -న్ని విశాఖకం-విశాఖ
నక్షత్రము-స్యాత్ -అగును॥ ... ... ... ... ... ... *

శ్లో॥ మిత్రమైత్ర మనూరాధ - మనూరాధస్యసంజ్ఞికం॥టీ॥ మిత్రం-మైత్రం-అనూరాధం-యీ - ౩ - న్ను అనూరాధస్య - అనూరాధయొక్క-సంజ్ఞికం-పేళ్లు॥ ... . ... .. ... ... .. ... ... . ...*

శ్లో॥ జ్యేష్ఠేంద్రో పురుహూతశ్చ ఇంద్రశ్శతమఖస్తథా॥టీ॥ జ్యేష్ఠేంద్రః-పురుహూతః ఇంద్రః శతమఖః-యీ-౪-న్ను జ్యేష్ఠానక్షత్రము పేళ్లు॥

శ్లో॥ మూలంనిశాచరం ప్రోక్తమాసురంనిరృతింతథా-నక్తంచరం కోణపంచ రాక్షసంపిశితాశనం॥టీ॥ మూలం-నిశాచరం - అసురం-నిరృతిం-నక్తంచరం-కోణపం- రాక్షసం - పిశితాశనం-యీ- ౭ - న్ని మూలానక్షత్రము పేళ్లు॥ ... ... ... ... ... ... ... ... . ... ..*

శ్లో॥ పూర్వాషాఢాజలంతోయముదకంచాపఏవచ॥టీ॥ పూర్వాషాఢా-జలం-తోయం - ఉదకం - అపః-యీ ౫- న్ను పూర్వాషాఢ పేళ్లు॥ ..*

శ్లో॥ ఉత్తరాషాఢవిశ్వంచ అభిజిద్బ్రహ్మప్రకాశకం॥టీ॥ ఉత్తరాషాఢ - విశ్వం-యీ - ౨ - ఉత్తరాషాఢ పేళ్లు - అభిజిత్ - బ్రహ్మప్రకాశకం-యీ ౨-న్ను అభిజిత్తు పేళ్లు॥ .. ... .. ... ... ... .. . .. ... ...*

శ్లో॥ శ్రవణంవైష్ణవంశ్రీశంశ్రీకాంతముకజిద్ధరిం॥టీ॥ శ్రవణం - వైష్ణవం-శ్రీశం-శ్రీకాంతం-ముకజిత్-హరిం యీ- ౬ న్ను శ్రవణనక్షత్రము పేళ్లు॥

శ్లో॥ శ్రవిష్ఠాచధనిష్ఠాచవసుర్వాసవఏవచ॥టీ॥ శ్రవిష్ఠా-ధనిష్ఠా-వసుః-వాసవః-యీ-౪-న్ను ధనిష్ఠానక్షత్రము పేళ్లు॥ ... . ... . ... *

శ్లో॥ ప్రచేతసోజలంధిష్ణ్యశతతారశ్చవారుణః॥టీ॥ ప్రచేతసః-జలం-ధిష్ణ్య శతతారః-వారుణః-యీ-౪-న్ను శతభిషానక్షత్రము పేళ్లు॥ ... ... . *

శ్లో॥ అజైకపాత్ప్రోష్ఠపదాపూర్వాభాద్రాపదాతథా॥టీ॥ అజా-ఏకపాత్ - ప్రోష్ఠపదా-పూర్వాభాద్రా - పదా-యీ-౫-న్ను పూర్వాభాద్ర పేళ్లు॥ .. .. ... . . ... .. .. ... ... ... .. . *

శ్లో॥ ఉత్తరాభాద్రంచైవ-అహిర్బుధ్న్యనిశాముఖం॥టీ॥ ఉత్తరాభాద్రకం అహిర్బుధ్న్య - నిశాముఖం-యీ- ౩-న్ను ఉత్తరాభాద్రా నక్షత్రము పేళ్లు॥*

శ్లో॥ రేవతీపౌష్ణ ఇత్యాహురంత్యః పూషాతథైవచ॥టీ॥ రేవతీ-పౌష్ణః - అంత్యః-పూషా-యీ-౪- రేవతీనక్షత్రము పేళ్లు॥ ... ... ... ... ...*

నక్షత్రనిఘంటు-సంపూర్ణము.



# ముహూర్తదీపికా.

## రాశినిఘంటుప్రారంభః



శ్లో॥ అజాక్రియాఛాగశ్చ స్తాతూంబరావిశ్వభేషజీ - మేషహూడ్యాక్రి
యాంభ స్తాభాగీవాగీరయస్తథా॥టీక॥ అజా-క్రియా-ఛాగశ్చ స్తా-తూంబరా-
విశ్వభేషజీ-ఆద్యాక్రియాశ్చ స్తా-భాగీ-రాగీ-అయః-యీ-౧౦-న్ని మేషం-
మేషము స్యాత్-అవును॥ ... ... ... ... ... ... ... .. ... *

శ్లో॥వృషభస్తు ఉక్షగౌర్వృష ఉక్షాతథైవచ-అనడ్వాన్ సౌరభేయ
శ్చ తూరకశ్చాభిన్న షాహ్వయః॥టీ॥ వృషభః - ఉక్షః-గౌః-వృషః - ఉక్షా - అన
డ్వాన్-సౌరభేయః-తూరకశ్చ యీలాన్ని వృషాహ్వయః-వృషభరాశి పేళ్లు

శ్లో॥మిథునంయమళంయుగ్మంనృయుగ్మంచయుగంతథా॥టీక॥ మిథునం-
యమళం-యుగ్మం-నృయుగ్మం యుగం-ఈ ౫ న్ని మిథునరాశి పేళ్లు॥ ...*

శ్లో॥ కుళీరకర్కటకటకఃకర్కిణీచకుళీరఝుమాణ॥టీక॥కుళీ, -కర్కి-కటకః-
కర్కిణీ-కుచళీ-ఝుమాణ-యీ ౬ న్ని కటకరాశి పేళ్లు॥ ... ... .. . *

శ్లో॥సింహోమృగారిర్మృగరాట్ మృగేంద్రో మృగనాయకః- హరిః
పంచాననో రాజా లేయో కంఠీరవస్తథా॥టీక॥ సింహః-మృగారిః-మృగరాట్-
మృగేంద్రః-మృగనాయకః-హరిః-పంచాననః-రాజా-లేయః-కంఠీరవః-యీ
౧౦ న్ని సింహరాశికి పేళ్లు॥ . . ... ... .. ... .. ... ...*

శ్లో॥ అంగనాస్త్రీవధూకన్యా-పాథోనంకన్యకాబలా॥టీ॥ అంగనా-
స్త్రీః-వధూః-కన్యా-పాథోన-కన్యకా-అబలా-యీ ౭ న్ని కన్యారాశి పేళ్లు॥

శ్లో॥ తులాతౌళివణిక్ జూకః తులాభృద్ఘటసంజ్ఞకః॥టీ॥తులా-తౌళీ-వణిక్-
జూకః-తులాభృత్-ఘటః-యీ ౬ న్ని తులారాశి పేళ్లు॥ .. ... . *

శ్లో॥ అళిస్సరీసృపః కౌపిః-కీటోవృశ్చికవాచకః॥ టీ॥ అళిః-సరీసృపః-
కౌపిః-కీటః-వృశ్చికః-యీ-౫-న్ని వృశ్చికరాశి పేళ్లు॥ ... ... ... ...*

శ్లో॥శౌజంశరాసనంప్రోక్తంతౌక్షికంమార్గణాసనమ్॥ చాపంతూ
ణీరబాణంచధనుఃకోదండకార్ముకం॥టీ॥ శౌజం శరాసనంతౌక్షికంమార్గ
ణాసనం-చాపమ్-తూణీరం-బాణం-ధనుః-కోదండం-కార్ముకం-యీ - ౧౦ -
ధనూ రాశికి పేళ్లు॥ ... ... ... ... ... .. .. ... ... ... ... *

శ్లో॥మకరస్స్యాన్మృగోనక్రశ్చాకోకేకశ్చకథ్యతే॥టీ॥ మృగః-నక్రః-ఆకోకేకః యీా-౩-న్ను - మకరః-మకరము-స్యాత్ - అవును॥ ... ... ...*

శ్లో॥కుంభోఘటోజలధరోహృద్రోగ ఇతకీర్తితాః॥టీ॥ కుంభః-ఘటః-జలధరః-హృద్రోగః-యీా-౪-న్ను కుంభరాశికిపేళ్లు॥ .. ... *

శ్లో॥మీనాంత్యోనిమిషోమత్స్యోఝషశ్చావారిజోండజః॥౮॥జలజోపృథురోమాచమీనసంజ్ఞాః ప్రకీర్తితాః॥టీ॥మీనః-అంత్యః-అనిమిషః-మత్స్యః-ఝషః-వారిజః-అండజః-జలజః-పృథురోమా-యీా-౯-న్ను మీనరాశికిపేళ్లు॥

రాశినిఘంటుసంపూర్ణము.

---

ముహూర్తదీపికా.

గ్రహనిఘంటుప్రారంభః.

ఆదిత్యోర్కోరవిర్భానుర్భాస్కరశ్చదివాకరః-మార్తాండస్సవితాహేళిస్తీక్ష్ణాంశుర్మిహిరోరవేః॥టీ॥ ఆదిత్యః-అర్కః రవిః-భానుః-భాస్కరః-దివాకరః-మార్తాండః-సవితా-హేళీ-తీక్ష్ణాంశుః-మిహిరః-యీా-౧౧-న్ను సూర్యునికిపేళ్లు॥ ... ... ... ... ... ... ... .. .. ... ... *

శ్లో॥చంద్రశ్శశిశశాంకశ్చ విధుస్సోమోనిశాకరః-సీతాంశురుడునాథశ్చ ఇందుశ్చంద్రమసోవిదుః॥టీ॥ చంద్రః-శశీ-శశాంకః-విధుః-సోమః-నిశాకరః-సీతాంశుః-ఉడునాథః-ఇందుః-యీా-౯-న్నుచంద్రమసః-చంద్రునియొక్కపేళ్లు

శ్లో॥ఆరోవక్రో మహీజశ్చరుధిరోరక్తఏవచ-అంగారకఃకుజో భౌమోలోహితాంగోమహీసుతః॥టీ॥ఆరః-వక్రః-మహీజః-రుధిరః-రక్తః-అంగారకః-కుజః-భౌమః-లోహితాంగః-మహీసుతః-యీా-౧౦-న్ను అంగారకునిపేళ్లు॥

శ్లో॥ సౌమ్యోవిడ్జ్ఞోబుధో హేమస్సోమజోబోధనః క్రమాత్॥టీ॥ సౌమ్యః-విట్-జ్ఞః-బుధః-హేమః-సోమజః-బోధనః-యీా-౭-న్ను బుధునికిపేళ్లు॥

శ్లో॥జీవఅంగిరసోవాచస్పతిశ్చిత్రశిఖండిజః॥౮॥ ఆర్యోబృహస్పతిస్సూరిర్వాగీశోవచసాంపతిః॥టీ॥జీవః-అంగిరసః-వాచస్పతిః-చిత్రః-శిఖండిజః-ఆర్యః-బృహస్పతిః-సూరిః-వాగీశః-వచసాంపతిః-ఈ-౧౦-న్నిబృహస్పతిపేళ్లు॥

శ్లో॥శుక్రో భృగుర్భార్గవసుతస్త్వఘ్నుజశ్చసితశ్చసః॥౯॥ ఉశనాదైత్యపూజ్యశ్చకావ్యఃకవిరితిస్మృతః॥టీ॥ శుక్రః-భృగుః-భృగుసుతః-అఘ్నుజః-సితః-ఉశనాః-దైత్యపూజ్యః-కావ్యః-కవిః యీా-౯-న్ను శుక్రునిపేళ్లు॥

శ్లో॥ కోణో మందశ్శనిః కృష్ణస్సూర్యపుత్రో యమశ్చ సః॥౬॥ పంగుశ్శనైశ్చరస్సౌరిః కాలశ్ఛాయాసుతశ్చ సః॥ టీ॥ కోణః-మందః-శనిః-కృష్ణః - సూర్యపుత్రః- యమః-పంగుః-శనైశ్చరః-సౌరీ-కాలః-ఛాయాసుతః-యీ - ౧౧-న్నూ శనికి పేళ్లు॥ ... ... ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ రాహుస్తమస్సురోగశ్చ స్వర్భానుశ్చ విధుంతుదః ॥౭॥ పాతుశ్చ సైంహికేయశ్చ భుజగాఖ్యాభిధస్స్మృతః॥ టీ॥ రాహుః-తమః-సురోగః-స్వర్భానుః-విధుంతుదః-పాతుః - సైంహికేయః - భుజగాఖ్యః - యీ-౮- న్ని రాహువు పేళ్లు॥ ... ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ కేతుశ్శిఖీధ్వజో ధూమ్ర ఉత్పాతో బహురూపకృత్ ॥౮॥ శిరోహీనో ఘోరరూపశ్చిత్రవర్ణస్సకేతవః॥ టీ॥ కేతుః-శిఖీ-ధ్వజః ధూమ్రః- ఉత్పాతః-బహురూపకృత్- శిరోహీనః-ఘోరరూపః చిత్రవర్ణః-సకేతుః-యీ-౧౦-న్ని కేతువుకు పేళ్లు॥ ... ... ... ... ... ... ... ... *

గ్రహనిఘంటు-సంపూర్ణము.

---

## అథస్థాననిఘంటు ప్రారంభః.

శ్లో॥ క్షితీశోదయరాశిర్లగ్నం హోరోదయస్తనుః కల్యోవిలగ్నమాత్మా చ భావోయం ప్రథమో భవేత్ ॥టీ॥ క్షితీశః ఉదయః- రాశిః-లగ్నం-హోరోదయః-తనుః-కల్యః-విలగ్నం-ఆత్మా- యీ-౯-న్ని- అయంభావః యీభావముగలది - ప్రథమోభవేత్ - మొదటిదైన లగ్నమునకు పేళ్లు॥

శ్లో॥ ద్వితీయంధనవాగ్విత్తంకుటుంబంనేత్రసంజ్ఞకం॥ టీ॥ ద్వితీయం ధనం-వాక్-విత్తం- కుటుంబం-నేత్రసంజ్ఞకం-యీ ౬-న్ని అగ్నాది రెండవ యింటికి పేళ్లు॥ ... ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ తృతీయం విక్రమభ్రాతృదుశ్చిక్యంసహజస్తథా॥ టీ॥ తృతీయం-విక్రమః-భ్రాతా-దుశ్చిక్యం- సహజః యీ ౫ న్ని మూడవయింటికి పేళ్లు॥

శ్లో॥ చతుర్థంహిబుకంవేశ్మబంధుర్వృద్ధిసుఖంజలం-పాతాళంజననీమాతృ ఉదకంచపయోమృతం॥ టీ॥ చతుర్థం-హిబుకం-వేశ్మ- బంధుః-వృద్ధిః-సుఖం-జలం-పాతాళం-జననీ-మాతా- ఉదకం పయః - అమృతం - యీ ౧౩ న్నూ నాలవయింటికి పేళ్లు॥ ... ... ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ పంచమంతనయోమంత్రీ హ్యాత్మాచ సుతశ్చ్యతే॥ టి॥ పంచమం-తన
యః-మంత్రీ-ఆత్మా-సుతః-యీ ౫ న్ను-అయిదోయింటికి పేరు॥ ...... *
శ్లో॥ షష్ఠమంరిపు రిత్యాహుః క్షతఇత్యభిధీయతే॥ టి॥ షష్ఠమం-రిపుః-క్షతః
యీ౩న్ను-ఆరోయింటికి పేర్లు॥ ........ *
శ్లో॥ సప్తమంద్యూనమస్తంచ ద్యూతంచమదనఃస్మరః। కామోవివా
హోజామిత్రంభార్యేతి వినిగద్యతే॥ టి॥ సప్తమం-ద్యూనం-అస్తం-ద్యూ
తం-మదనః-స్మరః-కామః-వివాహః-జామిత్రం-భార్యా-ఈ ౧౦ న్ని-ఏడవ
యింటికి పేళ్లు॥ ........ *
శ్లో॥ అష్టమంనిధనంరంధ్రం పాపమాయుర్మృతిశ్శుచా॥ టి॥ అష్టమం-నిధనం
రంధ్రం-పాపం-ఆయుః-మృతిః-శుచా-యీ ౭ న్ను-ఎనిమిదవయింటికి పేళ్లు॥
శ్లో॥ నవమంచత్రికోణంచ సుకృతంగురుభాగ్యకం॥ పితృజ్ఞానోదయోభ
క్తిర్దేవతోపాసనస్తథా॥ టి॥ నవమం-త్రికోణం-సుకృతం-గురుః-భాగ్యకం-పి
తా-జ్ఞానోదయః-భక్తిః-దేవతోపాసనః-యీ ౯ న్ను-తొమ్మిదవయింటికి పేళ్లు॥
శ్లో॥ దశమోమానఆజ్ఞాపకర్మస్థానమితిస్మృతః॥ వృద్ధకర్మాభిధానం
చవజ్రీసంతుయతద్వ్యతే॥ టి॥ దశమః-మానః-ఆజ్ఞా-కర్మ-స్థానం-వృద్ధః-క
ర్మాభిధానం-వజ్రీ-సంతుయః-యీ ౯ న్ని-పదోయింటికి నామధేయములు॥
శ్లో॥ ఏకాదశో భవేల్లాభః ఆయుశ్చవిజయశ్శుభః॥ టి॥ ఏకాదశః-లాభః-
ఆయుః-విజయః-శుభః-యీ ౫ న్ను-పదునకొండవయింటికి పేళ్లు॥ ........ *
శ్లో॥ ద్వాదశంచవ్యయస్థానం పాపస్థానంప్రశస్యతే॥ టి॥ ద్వాదశం వ్య
యస్థానం-పాపస్థానం-యీ౩న్ను-పదిరెండవయింటికి పేళ్లు॥ ...... *

స్థాననిఘంటు-సంపూర్ణము.

అథ భావనిఘంటు ప్రారంభః.

శ్లో॥ లగ్నంస్యాదుదయోరాశిః కల్యం హోరోదయస్తనుః। ఆద్యోదే
హశ్శరీరంచ విలగ్నాధారమూర్తయః॥ ౧॥ స్వభావోజన్మ చాత్మా చభావో
యం ప్రథమస్స్మృతః॥ టీక॥ ఉదయః-రాశిః-కల్యం-హోరా-ఉదయః
తనుః-ఆద్యః-దేహః-శరీరం-విలగ్నం-ఆధారః మూర్తయః-స్వభావః-జన్మ-ఆ
త్మా-అనుంభాః-యీ ౧౬ భావములుగలది-లగ్నం-లగ్నము-స్యాత్-అవుచు

శ్లో॥ ద్వితీయం ద్రవిణం స్వార్థః కుటుంబో ధనవేశ్మకం॥ ౨॥ సత్యవాచి
కవాక్ స్థానే యుక్తం కోశో హిరణ్యకం। కర్ణః ప్రయాణ నేత్రం చ ముఖం దక్షి
ణనేత్రకం॥ ౩॥ లోహం ముక్తాఫలం స్వర్ణం విద్యా భుక్తిస్తు కంబళః। రత్నం
ధాతుశ్చ విత్తం చ భావోయం చ ద్వితీయకః॥ టీ॥ ద్వితీయం - ద్రవిణం - స్వం -
అర్థః - కుటుంబః - ధనవేశ్మకం - సత్యవాచికం - వాక్థానం - యుక్తం - కోశః - హి
రణ్యకం - కర్ణః - ప్రయాణం - నేత్రం - ముఖం - దక్షిణనేత్రం - లోహం - ముక్తాఫ
లం - స్వర్ణం - విద్యా - భుక్తిః - కంబళః - రత్నం - ధాతుః - విత్తం యీ౨౫న్ను -
ద్వితీయభావమునకు నామములు॥ ........................................ ✱

శ్లో॥ తృతీయం భగినీ భ్రాతా సహజశ్చాగ్రజోనుజః। సహభావస్త్ర
పా యోగః దాసీ దాస్యాదివర్గకం॥ ౪॥ సత్వం పరాక్రమః కోపః రౌద్రం
శాంతముపాయకం। కార్యసంధానమిత్రే చ స్వరో గళభూషణం॥ ౫॥ ఆహో
క్లిబం దరక్షేత్రం భావోయం చ తృతీయకం॥ టీ॥ తృతీయం - భగినీ - భ్రాతా - స
హజః - అగ్రజః - అనుజః - సహభావః - త్రపా - యోగః - దాసీ - దాస్యాదివర్గకం -
సత్వం - పరాక్రమః - కోపః - రౌద్రం - శాంతం - ఉపాయకం - కార్యసంధానం
మిత్రం - స్వరః - గళభూషణం - ఆహోక్లిబం దరక్షేత్రం యీ౨౧న్ని - తృ
తీయభావమునకు పేళ్లు॥ ........................................ ✱

శ్లో॥ చతుర్థం జలపాతాళే బంధుశ్చ హిబుకం సుఖం॥ ౬॥ వాపీకూపతటా
కాశ్చ ప్రవాహో ద్వార మేదినీ। పుస్తకం గృహశయ్యా చ పశుస్సస్యం చ
ధాన్యకం॥ ౭॥ విద్యావాహనకార్యే చ మాతృష్వౌషధమంత్రకం। వివాహసాక్షి
పౌరాణం భావోయం చ చతుర్థకం॥ టీ॥ చతుర్థం - జలం - పాతాళం - బంధుః -
హిబుకం - సుఖం - వాపీ - కూపః - తటాకః - ప్రవాహః - ద్వారం - మేదినీ - పుస్తకం -
గృహం - శయ్యా - పశుః - సస్యం - ధాన్యకం - విద్యావాహనకార్యం - మాతా - ఔ
షధం - మంత్రకం - వివాహసాక్షి - పౌరాణం. ఈ౨౪న్ను చతుర్థభావమునకు పేళ్లు

శ్లో॥ పంచమం మంత్రి పుత్రశ్చ తనయః ప్రతిభాత్మజః। పణాపరపి శక్తిశ్చ
భావోయం పంచమస్మృతః॥ టీ॥ పంచమం - మంత్రి - పుత్రః - తనయః - ప్ర
తిభా - ఆత్మజః - పణాపరః - శక్తిః - యీ౮న్ని - పంచమభావమునకు పేళ్లు॥

శ్లో॥ షష్ఠో వైరి రిపుశ్శత్రుః క్షతారీ రోగభీతిదం। జ్ఞాతిశస్త్రాపణం పాపం
భావోయం షష్ఠమస్మృతః॥ టీ॥ షష్ఠః - వైరిః - రిపు - శత్రుః - క్షతః - అరిః రోగః -
భీతిః - జ్ఞాతి - శస్త్రా - ఆపణం - పాపం. యీ౧౨ను - షష్ఠమభావమునకు పేళ్లు॥ ✱

శ్లో॥ జామిత్రం జూకమస్తం చ కామో భార్యేతి చస్మరః। కటకోద్యూతవాణిజ్యే క్రయవిక్రయసంగ్రహాః ॥ ౧౩ ॥ కళత్రం సౌఖ్యవైవాహం భోగస్థానం మనోహరం। అలంకృతిశ్చ సర్వేషాం భావోయం సప్తమస్స్మృతః॥ టి॥ జామిత్రం-జూకం-అస్తం-కామః-భార్యా-స్మరః కటకః- ద్యూతం - వాణిజ్యం - క్రయః. విక్రయసంగ్రహః-కళత్రం - సౌఖ్యం - వైవాహం - భోగస్థానం - మనోహరం - అలంకృతిః - యీ - ౧౮న్ను - సప్తమభావమునకు పేళ్లు॥

శ్లో॥ అష్టమం నిధనం రంధ్రం మృతిర్నాశశ్చ నైధనం। ఆయుష్యం జీవనోపాయం మోక్షో లయనివారణే ॥ ౧౪॥ భత్యభోజ్యాదినాశశ్చ భావోయం చాష్టమస్స్మృతః॥ టి॥ అష్టమం-నిధనం- రంధ్రం - మృతిః-నాశః - నైధనం- ఆయుష్యం-జీవనోపాయః- మోక్షః-లయః-నివారణం- భత్యభోజ్యాదినాశః యీ ౧౨న్ను - అష్టమభావమునకు పేళ్లు॥ ...... ...... ...... *

శ్లో॥ నవమం తపదీకం చ సుకృతం గురుభాగ్యకం॥ ౧౫॥ పితృజ్ఞానం దయాభక్తిర్దేవతోపాసనస్తథా। చిత్రానందదధాస్వామీ భావోయం నవమస్స్మృతః టి॥ నవమం-తపదీకం-సుకృతం-గురుః-భాగ్యకం-పితృజ్ఞానం-దయా-భక్తిః-దేవతోపాసనః చిత్రా-ఆనందః-స్వామీ యీ ౧౨న్ను-నవమభావమునకు పేళ్లు॥

శ్లో॥ దశమం మానసం కర్మ వ్యాపారోంబరమేవ చ। కార్యం చ వ్యోమమాకాశః అజాపుణ్యద రాజ్యకం॥ ౧౬॥ వీర్యస్థానం చ సత్కర్మ భావోయం దశమస్స్మృతః॥ టి॥ దశమం-మానసం కర్మ-వ్యాపారః-అంబరం-కార్యం-వ్యోమం-ఆకాశః-అజా-పుణ్యం - రాజ్యకం-వీర్యస్థానం-సత్కర్మ - యీ ౧౩న్ను దశమభావమునకు పేళ్లు॥ ...... ...... ...... *

శ్లో॥ ఏకాదశం భవేత్ప్రాయురర్ఘలాభో జయస్తథా॥ ౧౭॥ పృష్ఠం స్యాదధపృష్ఠం చ భావోచైకాదశస్స్మృతః॥ టి॥ ఏకాదశం-ఆయుః-అర్ఘలాభః-జయః-పృష్ఠం-అధోపృష్ఠం-యీ ౬న్ను ఏకాదశభావమునకు పేళ్లు॥...... *

శ్లో॥ ద్వాదశాంత్యో వ్యయో రిష్ఫః అపోక్లిబోపవర్గకౌ॥ ౧౮॥ లాతీణనరకోనాశో భావోయం ద్వాదశస్స్మృతః॥ టి॥ ద్వాదశః-అంత్యః-వ్యయః-రిష్ఫః ఆపోక్లిబః-అపవర్గకః-లాతీణః-నరకః-నాశః- ఈ౯న్ని ద్వాదశభావమునకు పేళ్లు॥

భావనిఘంటు - సంపూర్ణము.

---



## కారకనిఘంటు ప్రారంభః.

శ్లో॥ ఆత్మా ప్రభావో శక్తిశ్చ పితృచింతారవేఫలం॥ టీ॥ ఆత్మా-ప్రభావః-శక్తిః-యీ-౩-కారకత్వములు-రవే-సూర్యునికి-అస్తి-కలవు॥ ..... ........ *

శ్లో॥ మనోబుద్ధిప్రసాదంచ మాతృచింతాంచ చంద్రమాః॥ టీ॥ మనః-బుద్ధిః ప్రసాదం-మాతృచింతాం-యీనాలుగున్ను-చంద్రమాః చంద్రుడు కారకుడు॥

శ్లో॥ భ్రాతా భృత్యగణో భూమిర్భౌమేనైవ విచింతయేత్॥ టీ॥ భ్రాతా-భృత్యగణః భూమిః- యీమూడింటికిన్ని భౌమేనైవ - అంగారకుని చేతనే-విచింతయేత్ -కారకుడని తెలుసుకోవలసినది॥ ..... ........... .. ....... *

శ్లో॥ ప్రజ్ఞా చ కర్మ విజ్ఞానం బుధేనైవ విచింతయేత్॥ టీ॥ ప్రజ్ఞా-కర్మ-విజ్ఞానం-యీమూడున్ను బుధేనైవ-బుధుని చేతనే-విచింతయేత్ - కారకుడని తెలుసుకోవలసినది॥ ... ......... .... . ..... ......... ........ ... ... *

శ్లో॥ గురుణా దేహపుష్టిశ్చ బుద్ధిః పుత్రార్థసంపదః॥ టీ॥ దేహపుష్టిః బుద్ధిః-పుత్రః- అర్థసంపదః- యీ-౪-న్ను గురుణా గురువు చేత కారకత్వమని తెలుసుకోవలసినది॥ .............. ...... .. ............... ......... ...... *

శ్లో॥ శుక్రో వివాహం భాగ్యంచ భోగస్థానం వాహనం॥ టీ॥ వివాహం-భాగ్యం-భోగస్థానం-వాహనం యీనాలుగింటికిన్ని శుక్రః-శుక్రుడు కారకుడని తెలుసుకోవలసినది॥ ...... .. .. . ....... .. .. .......... . ... ... ... *

శ్లో॥ ఆయుష్యం జీవనోపాయం మరణంచ శనైశ్చరః॥ టీ॥ ఆయుష్యం-జీవనోపాయం- మరణం-యీమూడింటికిన్ని - శనైశ్చరః-శనైశ్చరుడు కారకుడని తెలుసుకోవలసినది॥ .. .. ...... . .. . . . .. ......... . *

శ్లో॥ తటాకారామవిశ్రామమార్గా రాహుర్మాతామహం వదేత్॥ టీ॥ తటాకః- ఆరామః-విశ్రామః మార్గ-మాతామహం-యీనాలుగింటికిన్ని- రాహుః- రాహువు-వదేత -కారకుడవును॥ ........................ ...... ...... *

శ్లో॥ కేతోః పితామహశ్చింతా బహుధానశ్చ మోక్షకః॥ టీ॥ పితామహః-చింతా-బహుధానః- మోక్షకః-యీనాలుగింటికిన్ని- కేతోః- కేతువువల్ల-భవేత్ -కలుగును॥ ..... .......... .. ..... . ................................ *

కారకనిఘంటు - సంపూర్ణము.



## సంజ్ఞానిఘంటుప్రారంభః.

శ్లో॥ శశీసోమశ్శశాంకశ్చ యిందుశ్చంద్రః కళానిధిః- రాజావిధుస్సుధాంశుశ్చ యమ ఏకజన స్తథా॥ టి॥ శశీ-సోమః - శశాంకః - యిందుః - చంద్రః-కళానిధిః-రాజా-విధుః-సుధాంశుః యమః - ఏకః - జనః-యీ-౧౨-న్ను ఒకయంకెకు పేళ్లు॥ ........ ... . ...... ...... ..... . .. ...... ...... .......*

శ్లో॥ అక్షి చక్షుకరం నేత్రం లోచనం బాహుకర్ణకాః- పక్షదృష్టిద్వయం యుగ్మం అంబకానయనేతు సే॥ టి॥ అక్షిః-చక్షుః-కరం- నేత్రం- లోచనం-బాహుః-కర్ణః పక్షః-దృష్టిః-ద్వయం-యుగ్మం-అంబకా-నయనే-యూతునే యీ-౧౪-న్ను రెండవయంకెకు పేళ్లు॥ ... .. ................. . ...... ...*

శ్లో॥ వహ్నీరామశ్శిఖీ చాగ్నిః పావకో దహనానలౌ। శంకరాక్షీపురీలోకాః త్రిణీ కాలాః త్రయోగుణాః॥ టి॥ వహ్నిః - రామః - శిఖి - అగ్నిః పావకః- దహనః-అనలః-శంకరాక్షీ-పురీ- లోకః - త్రిణీ-కాలః- త్రయః-గుణః-యీ-౧౪-న్ను మూడవయంకెకు పేళ్లు॥ ................ .. . ...... ........ . ...*

శ్లో॥ అబ్ధిసాగర చత్వారి వనరాశి ర్యుగోంబుధిః- చతుర్వార్ధిగతిశ్చాపి జలధీనీరధి స్తథా॥ టి॥ అబ్ధిః-సాగరః - చత్వారి-వనరాశిః - యుగః - అంబుధిః- చతుః- వారిః-గతిః-జలధిః-నీరధిః - యీ-౧౧-న్ను నాలవయంకెకు పేళ్లు॥*

శ్లో॥ ఇంద్రియాః పంచమం జ్ఞానమిషు ర్బాణశ్చమార్గణః। వ్రతోభూతం శరః పర్వా ప్రాణశ్చవిషయ స్తథా॥ టి॥ ఇంద్రియం-పంచమం - జ్ఞానం-ఇషుః- బాణః-మార్గణా-వ్రతః-భూతం-శరః- పర్వా-ప్రాణః- విషయః-యీ-౧౨-న్ను అయిదోయంకెకు పేళ్లు॥ ... . ... .... . . .. ......... .. . ..... *

శ్లో॥ శాస్త్రం పట్చరుచశ్చైవ కాలశ్చ ఋతుసంజ్ఞకం। రసద్రవ్యంచ కోశశ్చ షడ్దర్శనవదాగమా॥ టి॥ శాస్త్రం - పట్ - రుచిః - కాలః - ఋతుః- రసద్రవ్యం-కోశః-షడ్దర్శనః-వదాగమః-యీ-౧౦-న్ను ఆరవయంకెకు పేళ్లు॥

శ్లో॥ శైలోద్రిర్ద్వీపవాయుశ్చ మునిస్సప్తాచలోగిరిః। తురగాశ్వనగా గోత్రా మహీధ్ర ఋషి సంజ్ఞకః॥ టి॥ శైలః-అద్రిః-ద్వీపః- వాయుః-మునిః-సప్తా-అచలః గిరిః-తురగః-అశ్వః- నగః - గోత్రా - మహీధ్రః-ఋషిః-యీ-౧౪-న్ను ఏడవయంకెకు పేళ్లు॥ ................................ ......................*

శ్లో॥ అష్టమంగజకర్ణీచదిగ్గజోదంతిహస్తీచ। సామజోమత్తమాతంగః దిక్పాలవసువారణాః॥ టీ॥ అష్టమం-గజః-కర్ణీ-దిగ్గజః-దంతీ-హస్తీ-సమజః-మత్తమాతంగః-దిక్పాలః-వసుః-వారణః-యీ౧౧న్ను యెనిమిదోయంకెకు పేళ్లు॥

శ్లో॥ నవమంనవరత్నంచ బ్రహ్మాచకమలాసనః। నిధిగ్రహాశ్చఖండశ్చ రంధ్రభావశ్చలబ్ధకః॥ టీ॥ నవమం-నవరత్నం-బ్రహ్మా-కమలాసనః-నిధిః-గ్రహాః-ఖండః-రంధ్రః-భావః యీ౧౦ తొమ్మిదోయంకెకు పేళ్లు॥ ...... ...... ......*

శ్లో॥ ఆకాశంగగనంశూన్యం అంతరిక్షంమరుత్పథం॥ టీ॥ ఆకాశం గగనం-శూన్యం-అంతరిక్షం-మరుత్పథం-యీ-౫-న్ను అంకె శూన్యమునకు పేళ్లు॥

శ్లో॥ కాదిర్నవటాదినవ-పాదిపంచశ్చయాద్యష్టకః॥ టీ॥ కకారము మొదలు తొమ్మిది అక్షరముల పర్యంతమున్ను-టకారము మొదలు తొమ్మిది అక్షరముల పర్యంతమున్ను-పకారము మొదలు అయిదు అక్షరముల పర్యంతమున్ను యకారము మొదలు యెనిమిది అక్షరముల పర్యంతమున్ను అక్షరసంజ్ఞవర్గ అని తెలుసుకునేదియెట్లన్నను॥ ......................... ......... ........................*

క ౧ఖ ౨గ ౩ఘ ౪ఙ ౫చ ౬ఛ ౭జ ౮ఝ ౯ట ౧ఠ ౨డ ౩ఢ ౪ణ ౫త ౬థ

౭ద ౮ధ ౯ప ౧ఫ ౨బ ౩భ ౪మ ౫య ౧ర ౨ల ౩వ ౪శ ౫ష ౬స ౭హ ౮.

సంజ్ఞానిఘంటు-సంపూర్ణము.



రాశిరాశ్యధిపతులు.

శ్లో॥ క్రియతావురిజితుమకుళీరలేయపాథోనజూకకౌర్ప్యాఖ్యాః। తౌక్షిక ఆకోకేరోహృద్రోగశ్చాంత్యభంచేదం॥ కుజసితజ్ఞచంద్రరవిసౌమ్యసితావనిజాః। సురగురుమందసౌరిగురవశ్చగృహాంశపాః॥ టీ॥ మేషానకు అంగారకుడు-వృషభమునకు శుక్రుడు - మిథునమునకు బుధుడు-కటకమునకు చంద్రుడు-సింహమునకు సూర్యుడు-కన్యారాశికి బుధుడు - తులకు శుక్రుడు-వృశ్చికమునకు అంగారకుడు-ధనుస్సుకు గురువు -మకరమునకు శని-కుంభమునకు శని-మీనానకు గురువు-యీ క్రమముగా రాశ్యధిపతులను తెలుసుకొనేది॥*

శత్రుమిత్రత్వము.

సూత్రం - స్వస్వాంత్యధీధర్మస్వోచ్చాయుస్సుఖపాః॥ టీ॥ యీసూత్రార్థము॥ సూర్యునికి-శ-శు-శత్రువులు-బు-సముడు-చం-కు-గు-మిత్రులు॥౧॥

చంద్రునికి-ర-బు-మిత్రులు-కు-గు-శు-శ-సములు॥ ౪॥ కుజునికి-గు-చం-ర-మిత్రులు బు-శత్రువు శు-శ-సములు-౩-బుధునికి-ర-శు-మిత్రులు-చం-శత్రువు-కు-గు-శ-సములు-౪-బృహస్పతికి-బు-శు-శత్రువులు-శ-సముడు-ర-చం-కు-మిత్రులు-౫-శుక్రునికి-బు-శ-మిత్రులు-కు-గు-సములు-ర-చం-శత్రువులు॥ ౬॥ శనికి-శు-బు-మిత్రులు-గు-సముడు-కు-చం-రా-శత్రువులని తెలుసుకునేది॥ ... *

ఉచ్చనీచలు.

శ్లో॥ అజోక్షనక్రప్రమదాకర్కటమత్స్యతులా క్రమాత్ । రవ్యాదితుంగా నీచంతుతత్సప్తమమాచరేత్ ॥టీ॥ రవికి మేషం-చంద్రునికి వృషభం-కుజునికి మకరం-బుధునికి కన్యా-గురువునకు కటకం-శుక్రునికి మీనం-శనికి తుల-యీ ఉచ్చరాసులు-యీ రాసులకు యేడవ రాసులు నీచ రాసులని తెలుసుకునేది॥

గ్రహదృష్టి.

సూత్రము- నగ థామజఢ సేతూణం॥టీ॥ శనికి-౩-౭-౧౦-గురువుకు-౫-౯-౭-కుజునికి-౪-౮-౭-ర-చం-బు-శు-రా-కేతువులకు యేడవయిల్లుచూపు-శుభగ్రహములచూపులుమంచిది-పాపగ్రహచూపులు చెడ్డవి॥ ... .. *

షడ్వర్గం.

సూత్రము-ఓజయుగ్మరవిచంద్రౌ॥టీ॥ లగ్నము రెండుభాగములు చేసేది-బేసి రాశి మొదటిభాగము రవి హోర-రెండవభాగము చంద్ర హోర-సరి రాశికి మొదలు చంద్ర హోర-రెండవది సూర్య హోరని తెలుసుకునేది॥

సూత్రము-లగ్నత్రిభాగో ద్రేక్కాణః॥టీ॥ లగ్నము మూడు భాగములు చేసేది-చరరాశికి మొదటిభాగమునకు లగ్నము-రెండవభాగమునకు అయిదవయిల్లు-మూడవభాగమునకు తొమ్మిదవయిల్లు-స్థిరరాశికి మొదలు తొమ్మిదవయిల్లు-రెండవభాగమునకు మొదటియిల్లు-మూడవభాగమునకు అయిదవయిల్లు-ద్విస్వభావరాశికి మొదట అయిదవయిల్లు-రెండవభాగమునకు తొమ్మిదవయిల్లు-మూడవభాగమునకు లగ్నము యీ క్రమాన చూచుకునేది॥ ... ... *

సూ-నవాంశోనవకంశకః॥ అజమృగతౌలీచంద్రభవనాది॥టీ॥ నవాంశకు లగ్నము తొమ్మిదిభాగాలు చేసి యేనోవ భాగములో జననమో ఆ భాగము మేషసింహధనస్సులకు మేషాదిగా చూచుకొనేది-తులకుంభమిథునాలకు-తులాదిగా చూచుకునేది-కన్యామకరవృషభాలకు మకరాదిగా చూచుకునేది-మీనకర్కటకవృశ్చికాలకు కర్కటకము మొదలుగా ఆభాగమునకు యే రాశి అవునో ఆ రాశి నవాంశ రాశియని చూచుకునేది॥ ... .. .. *

సూ-రయభాగో ద్వాదశాంశః॥టీ॥ ద్వాదశాంశములగ్నము-౧౨-భాగములు చేయగా-యేభాగమందుకాలము నిలుచునోలగ్నాది ఆగాశ్యాధిపతి ద్వాదశాంశ నిదెలుసుకునేది॥ ... ... ... ... ... ... ... ... ✻

సూ- భౌమమందగురుజజ్ఞ క్రాః హూమాదాపామపక్రం॥౨॥ టీ॥లగ్నము-౩౦-భాగాలు జేసియీభాగాలనుకుజునికి-౫-శనికి౫-గురువుకు-౮-బుధునికి-౭-శుక్రునికి-౫- యీక్రమానయివ్వగా ముహూర్తకాలమునకుయే గ్రహభాగములో వుండునో వాడు త్రింశాంశాధిపతిఅని తెలుసుకునేది-యిది వేశిరాశిక్రమము- సమరాశికి శుక్రుని మొదలుకొని కుజునిగకువ్యుత్క్రమము చెప్పేది॥ ... ... ... ... ... ... ... ... ... ... ... ✻

రాహుకాలము.

సూ-విధుస్సౌరీ స్సృకు సుతజజీవభౌమాసూర్కాః॥౧॥ త్రిపాద శ్రీశవృద్ధిః॥టీ॥ సోమవారం-౩౹ శనివారం-౬౹ శుక్రవారం-౧౧॥-బుధవారం-౧౫ గురువారం-౧౮౹-మంగళవారం-౨౨౹- ఆదివారం-౨౬॥- యీవారములలో యీఘడియలమొదట రాహుకాలము॥ ... ... ... ... ... ... ✻

నక్షత్రత్యాజ్యము.

శ్లో॥ నైశంవీనలంనభోజయకగం నీలంనరంఘాలినా । గోదీగంహాయకారిశింబయభోపోనేకఘంతమః। వారంస్సీరనకంనకంహాయతపోవారంనగంగస్రతః। ఖోర్ధ్వాంవనాడికా అదఘయోలగ్నస్సృశోమ్యాత్యజాః॥టీ॥ ఆశ్వని-౫౦ భ-౨౪-కృ-౩౦-రో-౪౦-మృ-౧౪-ఆర్ద్ర-౨౧-పున-౩౦-పుష్య-౨౦-అశే-౩౨-మ-౩౦-పూఫ-౨౦-ఉఫ-౧ -హ-౨౧-చి-౨౦-స్వా-౧౪-వి-౧౪-అనూ-౧౦జ్యే-౧౪-మూ-౨౦-౫౬-పూషా-౨౪ ఉషా-౨౦-శ్ర-౧౦ధ-౧౦-శత-౧౮ పూభా-౧౬-ఉభా-౨౪రే-౩౦-యీనక్షత్రాలకుయీఘడియలమీదను త్యాజ్యము ౪-ఘడియలవరకువుండును-అప్పుడుశుభకార్యము లున్నూ చేయగూడదు॥ ... ... ... ... ... ... ... ✻

పక్షఛిద్రములు.

శ్లో॥అష్టమీ ద్వాదశీషష్ఠీచతుర్ధీచచతుర్దశీ। పక్షచ్ఛిద్రాశ్చతిథయశ్శుభకార్యేషునిందితాః॥టీ॥ శుక్లకృష్ణపక్షములందు ౮-౧౨-౬-౪-౧౪-యీతిథులుపక్షఛిద్రములు - అందుశుభకార్యములు చేయకూడదు॥ ...✻

పుంటేనుసఖము-స్త్రీరాశ్యాది-౪-పురుషరాశ్యాది-౧౦ ఉంటెనుశోకము స్త్రీరాశ్యాది-౧౦-పురుషరాశి౪-ఉంటేనుధనప్రాప్తి-స్త్రీరాశ్యాది-౫-పురుషరాశ్యాది-౯-ఉంటెను-శుభము-స్త్రీరాశ్యాది-౯-పురుషరాశ్యాది-౫ అశుభము-స్త్రీరాశ్యాది-౬-పురుషరాశ్యాది-౮-ఉంటెనుపుత్రనాశనము-స్త్రీరాశ్యాది-౮-పురుషరాశ్యాది-౬-ఉంటేనుపుత్రలాభము-స్త్రీరాశ్యాది-౭-పురుషరాశ్యాది-౭-ఉంటెనుమాంగల్యవృద్ధియని తెలుసుకునేది॥ *

రజ్జుకూటము.

శ్లో॥ అశ్వీసార్పమఖాజ్యేష్ఠామూలాంత్యం పాదరజ్జువః । యమార్యభాగ్యమైత్రాఖ్యం అహిర్బుధ్న్యైకటీరతా । ఆగ్నేయాదిత్యార్యమోశోపాంబవిశ్వప్రోష్ఠపదోదరే । బ్రహ్మారుద్రౌకరస్వాతీ శ్రవణంవారుణంతథా॥ కంఠదేశేఽజానీయాద్వహ్నిచిత్రేంమమస్తకం। ముఖేపతింగళేతస్యాంకటౌ సస్యాత్మజాన్నరేత్। దరిద్రతాథవేత్రాట్యాం పాదేనాభ్రిమణంతథా॥ టీ॥ అశ్విని-ఆశ్రేష-మఖ-జ్యేష్ఠ-మూల-రేవతి-యీ ౬-పాదరజ్జునక్షత్రములు-భరణి-పుష్యమి-పుబ్బ-అనూరాధ-పూర్వాషాఢ-ఉత్తరాభాద్ర-యీ ౬-న్ను కటిరజ్జునక్షత్రములు-కృత్తిక-పునర్వసు-వుత్తర-విశాఖ-వుత్తరాషాఢ పూర్వాభాద్ర-యీ ౬-న్ను-వుదరరజ్జునక్షత్రములు. రోహిణి-ఆర్ద్ర-హస్త-స్వాతి-శ్రవణం-శతభిషం-యీ ౭-న్ను కంఠరజ్జునక్షత్రములు-మృగశిర-చిత్త-ధనిష్ట-యీ ౩-న్ను శిరోరజ్జునక్షత్రములు-ఫలం-శిరోరజ్జువల్లనిజం పురు-కంఠరజ్జు స్త్రీనిజంబును-వుదరరజ్జు సస్యాదినాశనము చేయును-కటిరజ్జు దరిద్రము చేసును-పాదరజ్జు వ్యభిచారము చేసును॥ ... ... . ...*

నాడీపొంతనము.

శ్లో॥ అశ్విన్యార్ద్రాపునర్వస్వుత్తరాహస్తజ్యేష్ఠశతభిం-మూలం-వారుణతోయశ్చపార్శ్వనాడీనవ తథా॥ టీ॥ అశ్విని-ఆర్ద్ర-పునర్వసు-వుత్తర-హస్త-జ్యేష్ఠ-మూల-శతభిషం-పూర్వాభాద్ర-యీ-౯-ప్రథమపార్శ్వనాడీనక్షత్రములు॥ ... .. ... .. ... ... ... ... ... ... ... ...*

శ్లో॥ భరణీమృగశిరపుష్యాం చిత్రానూరాధపూర్వభం। శ్రవిష్ఠాచోత్తరాభాద్రి మధ్యనాడీనవ తథా॥ టీ॥ భరణి-మృగశిర-పుష్యమి పుబ్బ-చిత్త-అనూరాధ-పూర్వాషాఢ ధనిష్ఠ-వుత్తరాభాద్ర-యీ ౯-న్ను మధ్యేకనాడీ నక్షత్రములు॥ ... ... .. ... ... ... ... ... .. ... ... ...*

శ్లో॥ కృత్తికావిధిమూలశ్చైవపిత్ర్యస్వాతివిశాఖకం। ఉత్తరాషాఢ విష్ణ్వంశ్చ-అంత్యనాడీషుపార్శ్వకే॥ టీ॥ కృత్తిక-రోహిణి-ఆశ్లేష-మఖ-స్వాతి-విశాఖ ఉత్తరాషాఢ శ్రవణం రేవతి-యీ౯-ద్వితీయపార్శ్వనాడీనక్షత్రములుయింకనుపలం॥ ... ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ ఏకనాడీపతింహంతి పార్శ్వనాడీతుకన్యకాం॥ టీ॥ దంపతులనక్షత్రములుమధ్యైకనాడీనక్షత్రములలోనుండెనా పురుషునికి జంపును-పార్శ్వనాడిలోనుండెనా స్త్రీకిదోషము॥ ... ... ... ... ... ... ... ... *

వశ్యపొంతనము.

శ్లో॥ సింహాళికర్కటవశేజౌకన్యావృశ్చికకౌర్మకౌ। తులామీనయుగానత్రి కన్యాకర్కటకస్త్రిమిః। మేషకుంభావజోనక్ర మేషాదేర్వశ్యరాశయః॥ టీ॥ మేషరాశికి-సింహవృశ్చికములువశ్యములు-వృషభరాశికి-కర్కాటకతులలువశ్యములు-మిథునరాశికి-కన్యారాశివశ్యము-కటకరాశికి-వృశ్చికధనస్సులువశ్యములు-సింహారాశికి-తులవశ్యము-కన్యారాశికి-మీనమిథునములువశ్యములు-తులారాశికి-మకరకన్యలువశ్యములు-వృశ్చికరాశికికటకరాశివశ్యము-ధనూరాశికిమీనరాశి వశ్యము-మకరరాశికి-మేషకుంభములువశ్యములు-కుంభరాశికి-మేషరాశివశ్యము-మీనరాశికి-మకరరాశివశ్యము॥

వర్ణపొంతనము

శ్లో॥ కర్కటాంతేవృశ్చికేవిప్రా క్షత్రియాస్సింహధనుస్తులా। మేషయుగ్మఘటావైశ్యా శూద్రోవృషమృగాంగనాః॥ టీ॥ కర్కాటకము-మీనము-వృశ్చికము యీ౩-బ్రహ్మజాతి-సింహధనుస్తులలు-క్షత్రియజాతి-మేషమిథునకుంభనులు-వైశ్యజాతి వృషభమకరకన్యారాసులు-శూద్రజాతి-పైజాతి-పుత్తమము॥ ... ... ... ... ... ... ... ... *

యోనిపొంతనము.

శ్లో॥ అశ్వంగజమజంసర్పం సర్పశ్వానమార్జారీ। ఛాగమార్జాలమూషశ్చ-మూషికావృషమాహిషీ॥ వ్యాఘ్రశ్చమహిషోవ్యాఘ్రీ-మృగీమృగశ్వానఃకపిః-గోఖండోవానరీసింహోముంగీసింహగోగజీ॥ టీ॥ గుఱ్ఱము-ఏనుగ-మేక-సర్పము-ఆడసర్పము-శ్వానము-ఆడపిల్లి-ఆడమేక-మొగపిల్లి-మూషకము-ఆడమూషకము-వృషభము-ఎనుము-పులి-పోతు-ఆడపులి-ఆడజింక-మొగజింక-శ్వానము-కోతి-ముంగిస-ఆడకోతి-ఆడసింహము-ఆడగుఱ్ఱ

కారానిదినములు

శ్లో॥ మాసాంతే పంచదివసాః త్యజేద్రిక్తామమాష్టమీం। షష్ఠీం చ పరిఘస్యార్ధం వ్యతీపాతసవైధృతిం॥ టీ॥ మాసముకడపటి- అయిదు దినములున్ను రిక్తతిథులున్ను-అమావాస్య- అష్టమి-షష్ఠి. పరిఘయోగపూర్వభాగము-వ్యతీపాత-వైధృతివీట్లయందు-వివాహము చేయగూడదు॥ .. ... . *

శ్లో॥ జామిత్ర ద్వ్యేకవింశశ్చ మహాదోషాః వివర్జితం॥ టీ॥ సప్తమశుద్ధిలేని దోషమున్ను - ఏకవింశతిమహాదోషమున్ను వుండకూడదు॥ ... ...*

వధూగృహప్రవేశము.

శ్లో॥ వివాహమారభ్య వధూప్రవేశో యుగ్మే తిథౌ షోడశవాసరాంతే। పంచాంగశుద్ధిశ్చ దినం వినాపి తిథౌ న సద్గోచరగేపకార్యః॥ టీ॥ వివాహదివసము మొదలు పదియారుదినములపర్యంతము సమదినములందు- వధూగృహప్రవేశము జేయవచ్చును- ఈ- ౧౬- దినములలో అనేకదోషములతో గూడుకున్నతిథులైనప్పటికిన్ని దోషము లేదని మునులచేత జెప్పబడె. ఈ విషయము-ముహూర్తదర్పణమునందు విశదముచేసియున్నాము॥ .. ... .. *

రజస్వలానిర్ణయము-

శ్లో॥ కరాదిపంచోత్తరమూలపౌష్ణవిష్ణుత్రయాశ్వీజ్యవిధేంద్రభేషు। ఆద్యం రజస్సౌఖ్యసుతాయురర్థం సౌభాగ్యవృద్ధిం కురుతేంగనానాం॥ టీ॥ హస్త-చిత్త-స్వాతి-విశాఖ అనూరాధ-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-మూల-రేవతి-శ్రవణం-ధనిష్ఠ-శతభిషం-అశ్వినీ-పుష్యమి-రోహిణి-మృగశిర- ఈనక్షత్రములందు-రజస్వలైనట్లైతే సౌఖ్యమున్ను-సంతానమున్ను-ఆయుస్సున్ను అర్థలాభమున్ను - సౌభాగ్యమున్ను-యశస్సున్ను గలుగును॥ ... . *

శ్లో॥ అమారిక్తా చ షష్ఠీ చ ద్వాదశీ ప్రతిపత్తథా। పరిఘస్య చ పూర్వార్ధే వ్యతీపాతే చ వైధృతౌ। సంధ్యోపప్లవవేవిష్ట్యాం అశుభం ప్రథమార్తవం॥ టీ॥ ౧-౪- ౬-౯-౧౨ ౧౪-౧౫-౩౦- తిథులందున్ను - పరిఘయోగపూర్వార్ధమందున్ను. వ్యతీపాతవైధృతులందున్ను. భద్రాకరణమందున్ను - సంధ్యాకాలమందున్ను - సూర్యచంద్రగ్రహణ కాలమునందున్ను - ప్రథమరజస్వల-అశుభము॥ .. ... .. ... ... .. .. .. ... .. . *

శ్లో॥ బుధశుక్రేందుజీవానాం వారేషు శుభదం భవేత్। శుభానామంశకం శ్రేష్ఠమార్తవే ప్రథమే శుభం॥ టీ॥ బుధ-శుక్ర-చంద్ర-గురువారములున్ను వారియొక్క-రాశ్యంశములున్ను - ప్రథమార్తవమునకు శుభము॥ .. . *

నిషేకము.

శ్లో॥ విష్ణుః ప్రజేశరవిమిత్రసమీరపౌష్ణమూలోత్తరావరుణభాని నిషేకకార్యే। ప్రాజ్యాని పుష్యవసుశీతకరాశ్విచిత్రాదిత్యాశ్చ మధ్యమఫలాని ఫలాన్యగన్యే॥ టీ॥ శ్రవణం-రోహిణి-హస్త-అనూరాధా-స్వాతీ-రేవతీ-మూలా-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-శతభిషం-యీనక్షత్రములు-నిషేకమందు-ఉత్తమములు-పుష్యమి-ధనిష్ఠ-మృగశిర-అశ్వినీ-చిత్ర-పునర్వసు-యీనక్షత్రములు మధ్యమఫలములు-మిగిలిననక్షత్రములు తోవు॥ .. .. *

శ్లో॥ షష్ఠీం చాష్టమీం పంచదశీం చతుర్థీం చతుర్దశీముభయత్ర హిత్వా। శేషాశ్శుభాస్స్యుస్తిథయో నిషేకే వారాశ్శశాంకార్యసితేందుజానాం॥ టీ॥ ౬-౮-౧౪-౧౫-౩౦- యీతిథులు విడిచితక్కిన దినములయందున్ను చంద్ర-బుధ-గురు-శుక్రవారములందున్ను-నిషేకకార్యము శుభము॥ ... . .. *

శ్లో॥ వృషభమిథునకర్కిసింహకన్యాతులఘటచాపఝషాశ్శుభావహాస్స్యుః। యుతశుభఖలశాలీ మోహకేంద్రే నిధనవిశుద్ధియుతే నిషేకకార్యే॥ టీ॥ వృషభము-మిథునము-కర్కాటకము-సింహము-కన్యా-తులా-కుంభము-ధనుస్సు-మీనము యీరాసులు మంచిశుభగ్రహములు-కేంద్రస్థానములందున్ను వుంటే కూడియుండగానున్ను-అష్టమశుద్ధియుండగానున్ను నిషేకము జేయమంచిది॥ ... .. ... ... .. . ... .. ... ... .. .. *

పుంసవనము.

శ్లో॥ కార్యం పుంసవనం ప్రసిద్ధవిషయే మాసే తృతీయేథవా ప్రాపత్యేక్షస్పష్టతే నాతు పాంకిరణే పుష్యేథవా వైష్ణవే। హిత్వా కర్కటకస్య యుగ్మమఖిలేష్వన్యేష్వనేకేంద్రాశుద్ధే నైధనధామ్ని శుక్రశశభృద్విష్ణ్యాంత్రికాం వానరే॥ టీ॥ పుంసవనము ప్రసిద్ధమైన తృతీయమాసమునందు చేయదగినది-అటుగానక గర్భము స్పష్టముగా తెలిసినట్లైతే-నైనా చేయదగినది-మృగశిరానక్షత్రము-పుష్యమినక్షత్రము-హస్తనక్షత్రములందున్ను-అటుగాకపోయినట్లాయెనా। శ్రవణనక్షత్రమునందు జేయవచ్చును-కర్కాటకకన్యమిథునరాసులున్ను-రిక్తతిథులున్ను విడిచి అష్టమశుద్ధియందున్ను శుక్ర-సోమ-బుధ-గురు-వారములందు-పుంసవనము చేయుమంచిది॥ .. ... ... ... .. *

సీమంతకము.

శ్లో॥ చతుర్థషష్ఠాష్టమమాసి భాజి సా చేద్గర్భిణీ ప్రథమం విధేయం। సీ

వారమునందు-౫౦-ఘడియలవరకు-పశ్చిమదిక్కునందున్ను మంగళవారము రాత్రి శేషించిన-౧౦-ఘడియలున్ను-బుధవారముపగలు-౩౦-ఘడియలవరకు-వాయువ్యదిక్కునందున్ను-బుధవారము రాత్రి-౩౦-ఘడియలున్ను-బృహస్పతివారమునందు-౫౦-ఘడియలవరకు-ఉత్తరదిక్కునందును-గురువారము రాత్రి శేషించిన-౧౦-ఘడియలున్ను-శుక్రవారమునందు-౬౦-ఘడియలవరకుయీశాన్యదిక్కునను-యీయాత్రాగాదిదిక్కులందు-సూర్యాద్యష్టగ్రహములు-రాజులైయుందురు-ఆరాజాదిక్కు మొదలుకొని-నక్షయెక్కువలుకుమ్ములు-పశువులకుమ్ములు-యీమొకలైనవి ఏదిక్కునందుగనుబడునో-ఆదిక్కువరకున్ను-పైనిజెప్పబోయ్యే ఫలములను-క్రమముగాజెలుసుకొనేది-రాజుదిక్కుయందు-హాని-వాటికిరెండవదిక్కునందు-విశ్వాసఫలము-మూడవదిక్కునందు శత్రుక్షయము-నాల్గవదిక్కునందు బంధులాభము-ఐదవదిక్కునందు స్వర్ణలాభము-ఆరవదిక్కునందు భోజనసౌఖ్యము-ఏడవదిక్కునందు శోకము-ఎనిమిదవదిక్కునందు పీడాకరములనియీక్రమముగాదెలుసుకొనేది॥

సటీకముహూర్తదీపిక సంపూర్ణము.



## శ్రీరస్తు.

## ముహూర్తదర్పణము.



శ్లో॥ యశ్శేషస్సతతం సహస్రఫణవానేకేన మూర్ధ్నా వహన్। బ్రహ్మాండాఖిలహారపంకజదళప్రాయేణ విభ్రాజితే। తం శేషం దధతం స్వవామచరణేనాసావుత్తాఖ్యముదా। తార్క్ష్యోపరి సంస్థితం సురయుతం శ్రీవేంకటేశం భజే॥ ... ... ... ... ... ✱

శ్లో॥ త్రిమూర్తిరూపిణం దేవం త్రయీవేద్యం శుభావహం। త్రిగుణాతీతమవ్యక్తం వందే సూర్యం సదాశివం। నారదేన కృతం యచ్చ ముహూర్తాఖ్యాయదర్పణం। తట్టీకాం ప్రారభే బాలబోధాయ సుమనోహరాం॥ ... ✱



### ఆదౌ నామనక్షత్రవివేకః.

శ్లో॥ చూచేచోలా స్త్వశ్విన్యాః - లీలూలేలో భరణ్యాపి - ఆఈఊఏ కృత్తికాచ - ఓవావీవూ చ రోహిణీ - వేవోకాకీ మృగశిరః - కూఘఙఛా చ రౌద్రకం - కేకోహాహీ పునర్వస్వోః హూహేహోడా చ పుష్యభం - డీడూడేడో చ ఆశ్లేషా - మామీమూమే మఖా తథా - మోటాటీటూ పూర్వభం చ - టేటోపాపీ తు చార్యభం - పూషంణాఠా చ హస్తశ్చ - పేపోరారీ చ చిత్తభం - రూరేరోతా వాయుభం స్మృతం - తీతూతేతో విశాఖభం - నానీనూనే చ మిత్రర్క్షే - నోయాయీయూ తు చైంద్రభం - యేయోబాబీ చ మూలర్క్షే - బూధాభాఢా చ తోయభం - బేబోజాజీ చ విశ్వర్క్షే - జూజేజోఖా చ విష్ణుభం - గాగీగూగే వాసవే చ - గోసాసీసూ చ వారుణం - సేసోదాదీ ప్రోష్ఠభే చ - దూథాఝాఞా హి బుధ్న్యర్క్షే దేదోచాచీ చ పౌష్ణే చ ఇత్యేతా నామతారకాః॥ టీ॥ సర్వజననామంబులనను సరించిన నక్షత్రములను దెలుపు నవే వివరమెట్టువలెనంటే - నామధేయాద్యక్షరము-చూచేచోలా అశ్విని యనే అశ్విన్యాదియిరువదేడు నక్షత్రముల అక్షరములలో నేదైయున్నదో - ఆయక్షరముల యొక్క నక్షత్రములను దెలుసుకొనేది-వాక్యముల యొక్క - మొదటి యక్షరము మొదటి పాదము-రెండ

ణా-సూర్యేణ చేతను-ముక్తా-విడువబడిననక్షత్రమున్న- స్థితా - ఆసూర్యుడు న్ననక్షత్రమున్న- గమ్య పొంగసాధ్యోనక్షత్రమున్న - తారాః యాః-౩ నక్షత్రములున్న - యెంచుకొనతగ్గియట్లన్నను-సూర్యుడు- భరణీనక్షత్రము౦డగా - వెనకటిదైన - అశ్వినీ-నక్షత్రము మొదలుకొని-యెంచుకోవడమనెడి తాత్పర్యము- ఆవిడువబడిననక్షత్రము మొదలు-త్రిప్రః-౩- నక్షత్రములు-మృతాః-మృతస్వభావముగలనక్షత్రములు-తర్వాత సప్తతు- ౭- నక్షత్రములు-అర్ధజీవాః-సగముజీవముగలనక్షత్రములు-తర్వాత-ఏకః-౧-నక్షత్రము-మృతః-నిర్జీవస్వభావముగలనక్షత్రము తర్వాత అష్టౌ-౮-నక్షత్రములు-సుపూర్ణజీవాః- సంపూర్ణజీవముగలనక్షత్రములు - తర్వాత - ఏకః-౧- నక్షత్రము-మృతః-నిర్జీవస్వభావముగలనక్షత్రము-తర్వాత-సప్త-౭-నక్షత్రములు-పాదజీవాః - పాదజీవముగలనక్షత్రములని తెలుసుకొనేది॥

నక్షత్రత్యాజ్యఘటికాప్రమాణము లు.

శ్లో॥ బాణౌ జినా వ్యోమగుణాః ఖవేదాశ్చక్రాః ఖసప్తాః ఖగుణా నఖాశ్చ-
దంతాః ఖరామాశ్చ నఖాః పురాణా భూబాహవో వ్యోమకరాస్తు శక్రాః॥
ఇంద్రాశ్చ శోదశ్చ వనోరసా బాణౌ జీవా నఖాబ్ధిగశ నాగచంద్రాః। నృపాశ్చ
సిద్ధాః ఖగుణా విషాఖ్యా నాడ్యశ్చతస్రస్తు పర్యఘుస్యాత్॥

టీ॥ అశ్విన్యాః అశ్వినీనక్షత్రమునకు-బాణౌ-౫౦-ఘడియలమీదట త్యాజ్యప్రవేశము-భరణ్యాః-భరణీనక్షత్రమునకు-జినాః - ౨౪ - ఘడియలమీదనున్న-కృత్తికాయాః-కృత్తికానక్షత్రమునకు-వ్యోమగుణాః-౩౦-ఘడియలమీదను-రోహిణ్యాః-రోహిణీనక్షత్రమునకు-ఖవేదాః-౪౦-ఘడియమీదను-మృగశీర్షస్య మృగశిరానక్షత్రమునకు- శక్రః-౧౪-ఘడియలమీదను- ఆర్ద్రాయాః-ఆర్ద్రానక్షత్రమునకు-రుద్రాః-౨౧-ఘడియలమీదను-పునర్వస్వాః-పునర్వసూనక్షత్రమునకు-ఖగుణాః-౩౦- ఘడియలమీదను-పుష్యస్య-పుష్యమినక్షత్రమునకు-నఖాః-౨౦ఘడియలమీదను-ఆశ్లేషాయాః- ఆశ్లేషానక్షత్రమునకు-దంతాః- ౩౨- ఘడియలమీదను-మఖాయాః-మఖానక్షత్రమునకు-ఖరామాః-౩౦-ఘడియలమీదను- పూర్వఫల్గున్యాః-పుబ్బనక్షత్రమునకు- నఖాః-౨౦-ఘడియలమీదను-ఉత్తరఫల్గున్యాః-ఉత్తరానక్షత్రమునకు-పురాణాః-౧౮-ఘడియలమీదను-హస్తస్య-హస్తానక్షత్రమునకు-భూబాహవః-౨౧ఘడియలమీదను-చిత్రాయాః-చిత్రానక్షత్రమునకు- వ్యోమకరాః-౨౦వ ఘడి

యలమీదను-స్వాత్యాః-స్వాతీనక్షత్రమునకు-శక్రాః-పదునాలుగుఘడియ లమీదను-విశాఖాయాః-విశాఖానక్షత్రమునకు-ఇంద్రాః-పదునాలుగుఘడి యలమీదను-అనూరాధాయాః-అనూరాధానక్షత్రమునకు-దశ-పదిఘడియ లమీదను-జ్యేష్ఠాయాః-జ్యేష్ఠానక్షత్రమునకు-విశ్వవసః-పదునాలుగు-ఘడియ లమీదను-మూలస్య-మూలానక్షత్రమునకు-నగాః-౫౬-ఘడియలమీద ను-పూర్వాషాఢాయాః-పూర్వాషాఢానక్షత్రమునకు-జనాః-౨౪-ఘడియ లమీదను-ఉత్తరాషాఢాయాః-ఉత్తరాషాఢానక్షత్రమునకు-నఖాః-౨౦-ఘ డియలమీదను-శ్రవణస్య-శ్రవణనక్షత్రమునకు-దిక్-౧౦-ఘడియలమీదను-ధనిష్ఠాయాః-ధనిష్ఠానక్షత్రమునకు-దశ-౧౦-ఘడియలమీదను-శతభిషజః-శత భిషానక్షత్రమునకు-నాగచంద్రాః-౧౮-ఘడియలమీదను-పూర్వాభాద్ర యాః-పూర్వాభాద్రానక్షత్రమునకు-నృపాః-౧౬-ఘడియలమీదను-ఉత్త రాభాద్రాయాః-ఉత్తరాభాద్రానక్షత్రమునకు-సిద్ధాః-౨౪-ఘడియల మీదను-రేవత్యాః-రేవతీనక్షత్రమునకు-ఖగుణాః-౩౦-ఘడియలమీదనున్న-త్రి నాత్-పదునగాను-విషాఖ్యాః-విషఘడియలు-నాడ్యశ్చతస్ర-నాలుగుఘ డియలపర్యంతము-స్యాత్-ఉండును-గ్రంథాంతరమునందు-మూలానక్షత్ర మునకు-విశేషముగా-౨౦-ఘడియలమీదనున్న-త్యాజ్యము చెప్పియున్నది-అనగా-మూలకు రెండు త్యాజ్యములనెడి తాత్పర్యము॥ .. ... ... .. *

శ్లో॥మూలా వింశతిఛప్పన్నాడ్యా ఇతి వాసిష్ఠే॥

## నక్షత్రాంశలరాశిస్వరూపము.

శ్లో॥సప్తవింశతిభం జ్యోతిశ్చక్రం తిమిరవాయుజం। తదుష్ణాంశోర్భవే ద్రాశిర్నవర్క్షచరణాంకితః॥టీ॥తిమిరవాయుజం-తిమిర-గోళాంధకారగ మందు-వాయు-వాయువువల్ల-జం-పుట్టినది-సప్తవింశతిభం-ఇరువదేడునక్ష త్రములుగలిగిన-జ్యోతిశ్చక్రం-శింశుమారచక్రము-తత్-ఆచక్రము-నవర్క్ష చరణాంకితః-నవ తొమ్మిదైన-ఋక్ష చరణ-నక్షత్ర పాదములచేతను-అంకితః-గురుతుగలిగి-ఉష్ణాంశోః-సూర్యునికి-రాశిః-మేషాదిరాశిగాను-భ వేత్-అగుచున్నది-అనగా అశ్విన్యాది-౨౭-నక్షత్రములకు-౧౦౮-పాదము లుగను కరాశి యొకటికి-తొమ్మిదిపాదములచొప్పున మేషరాశి మొదలుమీన రాశిపర్యంతము క్రమముగా జూచుకొతగినది-యెట్లన్నను అశ్విని నాలుగుపా దములు-భరణి నాలుగుపాదములు-కృత్తికలో నొకపాదమువరకు మేషరాశి

లుండు నక్షత్రాంతక్రమమునకు దాహరణము - అశ్వినీభరణీకృత్తికాపాదం
మేషం-కృత్తికాత్రయః పాదాః రోహిణీమృగశీర్షార్ధం వృషభం-మృగశీ
ర్షార్ధం-ఆర్ద్రాపునర్వసుత్రయోర్మిథునం-పునర్వసుపాదంపుష్యమి
ఆశ్లేషాంత్యంకర్కాటకం- మఖపుబ్బఉత్తరాపాదంసింహం - ఉత్తరా
త్రయోః-పాదంహస్తచిత్రార్ధంకన్యా - చిత్రార్ధంస్వాతీవిశాఖత్రయా
స్తులా-విశాఖపాదంఅనూరాధాజ్యేష్ఠాంత్యంవృశ్చికంమూలపూర్వాషాఢ
ఉత్తరాషాఢపాదంధనుః - ఉత్తరాషాఢత్రయఃపాదాః శ్రవణధనిష్ఠార్ధం
మకరం ధనిష్ఠార్ధంశతభిషపూర్వాభాద్రాత్రయఃకుంభం-పూర్వాభాద్ర
పాదంఉత్తరాభాద్రరేవత్యంతంమీనం- ఈక్రమాననే తెలుసుకొనేది: అందు
అంశలక్రమము-ఇరువదేడునక్షత్రములకు-౧౦౮-పాదములుగనుక తొమ్మి
దావర్తనాలు మేషాదిరాసులకు చున్నవి-ఉదాహరణము - అశ్వినీ మొదటిపా
దమునకు మేషాంశము-రెండవపాదమునకువృషభాంశము - మూడవపాదము
నకుమిథునాంశము- నాలుగవపాదమునకుకర్కటకాంశము - భరణి మొదటిపా
దమునకు- సింహాంశము- యీక్రమముగా - ౧౦౮ - పాదములకు తొమ్మిది
ఆవర్తనాలుజూచుకునేది॥ ... .. ... .. ... ... ... ... .. ౯

## మేషాదిరాశులు.

శ్లో॥మేషోగౌర్మిథునంకర్కిఃసింహఃకన్యావణిక్తతః । కార్పిర్ధన్వీనక్రకుం
భామీనోమేషాదితోభవేత్ ॥టీ॥మేషః- మేషము-గౌః - వృషభము. మిథునః
మిథునము-కర్కిః-కర్కాటకము-సింహః-సింహము-కన్యా- కన్య-వణిక్-తుల-
అలిః-వృశ్చికము-ధనుఃధనుస్సు-మకరః-మకరము-కుంభః కుంభము - అంత్యః-
మీనము-మేషాతః-మేష-మేషమే-ఆదిః- మొదలుకొని-భవేత్ - అగును॥

## రాశ్యధిపతులు.

శ్లో॥సింహస్యాధిపతిస్సూర్యఃకర్కటస్యనిశాకరః । మేషవృశ్చికయో
ర్భౌమఃకన్యామిథునయోర్బుధః। కోదండమీనయోర్మంత్రీతులావృష
భయోర్భృగుః । నక్రస్యకుంభరాశేశ్చ నాయకస్సూర్యనందనః॥టీ॥సింహ
స్య- సింహమునకు-సూర్యః-సూర్యుడు-అధిపతిః- ప్రభువు-కర్కటస్య - క
ర్కాటకమునకు-నిశాకరః-చంద్రుడు-అధిపతిః-ప్రభువు-మేషవృశ్చికయోః-
మేష- మేషమునకును-వృశ్చికయోః-వృశ్చికమునకును-భౌమః - అంగార
కుడు-అధిపతిః - ప్రభువు కన్యామిథునయోః-కన్యా - కన్యారాశికిని- మి

థునరాశేః-మిథునరాశికిన్ని - బుధః-బుధుడు-అధిపతిః - ప్రభువు:-కోదండ-ధనుస్సుకున్ను-మీనరాశేః-మీనరాశికిన్ని-మంత్రీ- బృహస్పతి-అధిపతిః - ప్రభువు-తులావృషభరాశేః-తులా-తులకున్ను - వృషభరాశేః-వృషభమునకున్ను-భృగుః-శుక్రుడు- అధిపతిః-ప్రభువు-నక్రస్య- మకరరాశిన్ని - కుంభరాశేశ్చ- కుంభరాశికిన్ని - సూర్యనందనః- శనైశ్చరుడు-నాయకః - ప్రభువు- యీ మేషాదిరాసులకు- క్రమముగా యీ అధిపతులను జూచుకొనేది॥

మేషాదిరాశిఘటికాప్రమాణములు.

టీ॥ ప్రతిదేశములయందున్నఘటికాప్రమాణములు వేరువేరులైయున్నవియెట్లన్నను - భూమి నిమ్నోన్నతమైనందున ఆయాప్రాంత్యములయందు మేషతులాదుల ప్రవేశములకు మధ్యాహ్నకాలసూర్యచ్ఛాయయుండగానపుడు సూర్యసిద్ధాంతప్రకారముద్వాదశాంగుళప్రమాణమైనశంకు నేర్పాటుచేసి-గణితముచేయగా- ఆయాదేశములకు విషువచ్ఛాయబుట్టును- ఆయావిషువచ్ఛాయవలన - ఆయాదేశములకు - మేషాదిఘటికాప్రమాణములు- వేరువేరైయున్నవి - యీకల్యాణనగరమునందు విషువచ్ఛాయాప్రమాణము-౨-౪-౫-నఖమన్నవిషుచ్ఛాయా - అనేశాస్త్రరీత్యా- విషువచ్ఛాయనువుంచిగణితముచేసిచూడగా - ఈదేశములకునిశ్చయమైనమేషాదిఘటికాప్రమాణములు॥ ... ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥వస్వబ్ధిత ప్రాఃశరశైలపక్షాగుణేందు రామాఃగుణదైవతాని । కృశానుదంతాపనుఖాగ్నయస్స్యుర్మేషాదిషట్వ్యత్క్రమతఃపరేష్యుః॥ అనే ప్రమాణముచే॥టీ॥ మేషరాశికి -౪- ౮-వృషభరాశికి ౪-౩౫-మిథునరాశికి ౫-౧౩-కటకరాశికి-౫-౩౩- సింహరాశికి ౫-౨౨-కన్యారాశికి-౫-౮-తులారాశికి-౬-౭-వృశ్చికరాశికి-౫-౨౨-ధనూరాశి-౫-౩౩-మకరరాశికి-౫-౧౩ కుంభరాశికి-౪-౩౫- మీనరాశికి-౪-౮- అనియీరీతిగానే మేషాదిలగ్నప్రమాణములను తెలియతగ్గది॥ ... ... ... ... ... ... ... ... ... *

కొందరు.

శ్లో॥మీనమేషౌ చతుర్దండీగోకుంభౌ చతుగర్ధకం।పంచపాదోయుగ్మమృగౌపంచార్ధంచాపకీటౌ కర్కిసింహౌ వంశార్ధం పంచపాదస్తులాంగనే మేషాదీనాంతులగ్నానాంమానమేవంవిధుర్బుధాః॥ టీ॥ మీనమేషములు-౪-ఘటికలుగలవి-గోకుంభౌ-వృషభకుంభములు- ౪-౩౦- ఘటియ

లుగలవి-యుగ్మన్యగా-మిథునమకరములు-౫-౧౫-ఘడియలుగలవి చాపకర్క
శౌధయుక్కలకములు-౫-౩౦-ఘడియలుగలవి-కాన్పిసింహాచ-వృశ్చిక-సింహ
ములున్ను-౫ ౩౦- ఘడియలు-తులాంగనే-తులాకన్యాలగ్నములు-౫-౧౫
ఘడియలుగలవి- అని- ఈప్రకారముగా మేషాదిలగ్న ప్రమాణమును తెలియ
దగు-ఇదిదేశాంతరవిషయము॥ ... ... ... ... ... ... ... ... *

## చరస్థిరద్విస్వభావ రాసులు.

శ్లో॥ చరస్థిరద్విస్వభావా మేషాదిః క్రమశో భవేత్॥ టీ॥ మేషాదిః-మేషము
మొదలైనలగ్నములు- క్రమశః-వరసగాను-చరద్విస్వభావః-చర-చరమును-
స్థిర-స్థిరమును-ద్విస్వభావః-ద్విస్వభావమును సేయుగలవి-భవేత్-అగును-అవ
గా-మేషము-చరము-వృషభము స్థిరము-మిథునము-ద్విస్వభావము-ఈవిధము
గా-మేషము మొదలు- మీనపర్యంతము మూడు మూడు రాసులుగణన చేయ
గా చరస్థిరద్విస్వభావ రాసులసంజ్ఞ దెలియుచున్నది॥ ... ... ... ... *

## లగ్నముల త్యాజ్యములు.

శ్లో॥ అజవృషభధనుఃకన్యకాదౌ భుజంగః ఝషమకరకుళీరే వృశ్చికాంతే చ రాహుః-మిథునఘటతులానాం సింహమధ్యే తు గృధ్రస్సకలమునిమతం స్యాత్సర్వకార్యేషు వర్జ్యం॥ టీ॥ అజవృషభధనుఃకన్యకాదౌ- మేష-వృషభ-
ధనుః-కన్యాలగ్నములకు-ఆదౌ-లగ్నముదయించినది మొదలగగడియవరకు భుజంగః-భుజంగమనెడివర్జ్యము-ఝషమకరకుళీరేవృశ్చికాంతే- మీనమకరక
ర్కాటవృశ్చికరాసులకు-అంతే-కడపటనరగడియకలదనగా-రాహుః-రాహు
త్యాజ్యము - మిథునఘటతులానాం-మిథునకుంభతులాలగ్నములకు- సింహ
మధ్యే-సింహః-సింహామునకు-మధ్యే- ఈ రాసులుదయించినసగభాగమునకు-
గృధ్రః-గృధ్రమనెడిత్యాజ్యము-సర్వకార్యేషు-సకలపనులయందు-వర్జ్యం
త్యాజ్యము-సకలమునిమతం అందరిఋషీశ్వరులమతము- స్యాత్-అగును॥

## ఉచ్చనీచరాసులున్ను పరమోచ్చపరమనీచభాగలున్ను.

శ్లో॥ అజవృషభమృగాంగనాకుళీరాః ఝషవణిజౌ చ దివాకరాదితుంగాః దశశిఖిమనుయుక్తిథీంద్రియాంశైస్త్రినవకవింశతిభిశ్చ తేస్తనీచాః॥ టీ॥ అజ-
మేషము-వృషభ-వృషభము-మృగ-మకరము-అంగనా-కన్యా- కుళీరాః-కర్కా
టకము ఝష-మీనము-వణిక్-తుల-ఈఏడు రాసులు-దివాకర-సూర్యుడే- ఆది
మొదలుగాగలిగిన-చంద్ర-కుజ-బుధ-గురు-శుక్ర- శనులకు- తుంగాః- ఉచ్చ

స్థానములు-దశ-మేషమునందు-౧౦- భాగములు-సూర్యునికి - ఉచ్చములు-అందు పదోభాగము-పరమోచ్చభాగము-తక్కిన- ౨౦- భాగములు మిత్రభాగములు-వృషభమందు-చంద్రునికి-శశి- మూడుభాగములు - ఉచ్చభాగములు-అందు-మూడవభాగము-పరమోచ్చభాగము-తక్కిన - ౨౭ - భాగములు మూలత్రికోణభాగములు - మకరమునందు కుజునికి-మనుయుక్ - ౨౮ - భాగములు-ఉచ్చభాగములు-అందు - ౨౮ - దోభాగము-పరమోచ్చభాగము-తక్కిన రెండుభాగములు-మిత్రభాగములు-బుధునికి-కన్యారాశిలో-తిథి-౧౫-భాగములు-ఉచ్చభాగములు-అందు పదునైదవభాగము-పరమోచ్చభాగము-తర్వాత ౫- భాగములు మూలత్రికోణభాగములు-తర్వాత - ౧౦ - భాగములు-స్వక్షేత్ర భాగములు-బృహస్పతికి కటకరాశియందు-యింద్రియ-౫- భాగములు-ఉచ్చభాగములు- అందు - అయిదవభాగము-పరమోచ్చభాగము-తక్కిన-౨౫- భాగములు-మిత్ర భాగములు- శుక్రునికి మీనరాశియందు-౨౭-భాగములు-ఉచ్చభాగములు-అందిరువైయేడోభాగము- పరమోచ్చభాగము-తక్కినమూడుభాగములు-మిత్రభాగములు-శనైశ్చరునికి- తులారాశియందు-౨౦- భాగములు - ఉచ్చభాగములు - అందిరువదోభాగము పరమోచ్చభాగము-తక్కిన-౧౦-భాగములు-మిత్రభాగములని క్రమముగా తెలుసుకొనేది-తర్వాత-తత్-ఆజెప్పిన - ఏడురాసుల యొక్క- అస్త - పడవస్థానము - నీచాః - సూర్యాదిగ్రహములకు-నీచస్థానములు - అందుదశాదిభాగములు-పరమనీచభాగములు-యెట్లన్నను-సూర్యునికి-తులారాశియందు-౧౦ భాగములు-నీచభాగములు-అందు పదోభాగము - పరమనీచభాగము-తక్కిన-౨౦- భాగములు-శత్రుభాగములు - చంద్రునికి-వృశ్చికరాశియందు- ౩- భాగములు-నీచభాగములు - అందు మూడవభాగము పరమనీచభాగము-తక్కిన-౨౭- భాగములు-శత్రుభాగములు-కుజునికి కటక-రాశియందు - ౨౮ - భాగములు-నీచభాగములు - అందిరువైయెనిమిదోభాగము- పరమనీచభాగము-తక్కిన-౨-భాగములు-శత్రుభాగములు-బుధునికి-మీనరాశియందు-౧౫ భాగములు-నీచభాగములు - అందు పదునైదవభాగము-పరమనీచభాగము-తక్కిన - ౧౫ - భాగములు-శత్రుభాగములు-బృహస్పతికి మకర రాశియందు-౫-భాగములు-నీచభాగములు- అందు అయిదవభాగము పరమనీచము తక్కిన-౨౫- శత్రుభాగములు- శుక్రునికి కన్యారాశియందు - ౨౭ - భాగములు నీచ

ములు - అందు - యిరువైయేడో భాగము - పరమనీచము - తక్కిన మూడు - శత్రు
భాగములు - శనైశ్చరునికి మేషరాశియందు - ౨౦ - భాగములు - నీచములు - అం
దు యిరువదో భాగము - పరమనీచము - తక్కిన - ౧౦ - భాగములు శత్రు భాగము
లని దెలుసుకొనేది॥ . ... . .. ... ... ... ... ... ... ... *

## మూలత్రికోణరాశులు.

శ్లో॥ సింహాగోమేషపార్థోనధనుస్తౌలిఘటేషుచ। రవ్యాదేర్నఖబాహుష్వం
చరవిశ్వాణోడశస్తథా। త్రిపంచదంశతిస్సంఖ్యా భాగో మూలత్రికోణగః॥
టీ॥ రవేః - సూర్యునికి - సింహ - సింహమందు - నఖ - ౨౦ - భాగములు - మూల
త్రికోణములు - తక్కిన - ౧౦ - స్వక్షేత్ర భాగములు - చంద్రునికి - గో - వృషభ
ము౦దు - ముందుజెప్పిన - ౩ - భాగములు - ఉచ్చములు - తర్వాత - ౨౭ - భాగములు -
మూలత్రికోణములు - కుజస్య - కుజునికి - మేష - మేషమందు - రవిః - ౧౨ - భాగ
ములు - మూలత్రికోణములు - తర్వాత - ౧౮ - భాగములు - స్వక్షేత్రములు - బు
ధస్య - బుధునికి - పార్థోన - కన్యారాశియందు - ముందుజెప్పిన - ౧౫ - భాగములు -
ఉచ్చములు - తర్వాత - ౫ - భాగములు - మూలత్రికోణములు - తర్వాత - ౧౦ -
భాగములు - స్వక్షేత్రములు - గురోః - బృహస్పతికి - ధనుః - ధనూరాశియందు
దిశః - ౧౦ భాగములు - మూల త్రికోణములు - తర్వాత - ౨౦ - భాగములు -
స్వక్షేత్రములు - శుక్రస్య - శుక్రునకు - తౌళి - తులాయాం - త్రిపంచ - ౧౫ -
భాగములు - మూలత్రికోణములు - తక్కిన - ౧౫ - భాగములు - స్వక్షేత్రములు -
శనేః - శనైశ్చరునికి - ఘట - కుంభరాశియందు - వింశతిః - ౨౦ - భాగములు - మూ
లత్రికోణములు - తక్కిన - ౧౦ - భాగములు - స్వక్షేత్రభాగములని - యీక్ర
మముగా - విదుః - తెలియుదురు॥ ... ... .. ... ... ... ... ... .. *

## మిత్రశత్రుసమగ్రహములు.

శ్లో॥ శత్రూ మందసితౌ సమశ్శశిసుతో మిత్రాణి శేషా రవేస్తీక్ష్ణాంశుర్హి
మరశ్మిజశ్చ సుహృదౌ శేషాస్సమాశ్శీతగోః। జీవేందూష్ణకరాః కుజస్య సుహృ
దో జ్ఞోరిస్సితార్కీ సమౌ మిత్రే సూర్యసితౌ బుధస్య హిమగుశ్శత్రుస్సమా
శ్చాపరే॥ టీ॥ రవేః సూర్యునికి మందసితౌ - శని శుక్రులు శత్రువులు - శశిసుతః -
బుధుడు - సమః - సముడు - శేషాః - మిగిలిన - చంద్రకుజగురువులు - మిత్రాణి - మి
త్రులు - శీతగోః - చంద్రునికి - తీక్ష్ణాంశుః - సూర్యుడు - హిమరశ్మిజః - బుధుడు - సు
హృదౌ - స్నేహితులు - శేషాః - మిగిలిన - కుజగురుశుక్రశనులు - సమాః సములు

కుజస్య-కుజునికి-జీవేందూష్ణకరాః-జీవ-బృహస్పతిన్ని-ఇందు-చంద్రున్ని-ఉష్ణకరాః-సూర్యునిన్ని-సుహృదః-స్నేహితులు జ్ఞః-బుధుడు-అరిః-శత్రువు-సితార్కి-శుక్రశనులు-సమౌ-సములు-బుధస్య-బుధునికి-సూర్యసితౌ-సూర్య-శుక్రులు-మిత్రే-మిత్రులు-హిమగుః-చంద్రుడు-శత్రుః-శత్రువు-అపరే-మిగిలిన-కుజ-గురు-శనులు-సమాః-సములు॥ . . ... ...*

శ్లో॥ సూరేస్సౌమ్యసితావరీరవిసుతో మధ్యః పరేత్వన్యథా సౌమ్యార్కీ సుహృదౌ సమౌ కుజగురూ శుక్రస్య శేషావరీ శుక్రజ్ఞౌ సుహృదౌ సమస్సురగురుస్సౌరస్య చాన్యేరయో యే ప్రోక్తాస్సుహృదస్త్రికోణ భవనాత్తే మీమయా కీర్తితాః॥ టీ॥ సూరేః-బృహస్పతికి-సౌమ్యసితౌ-బుధ-శుక్రులు-అరీ-శత్రువులు-రవిసుతః-శనైశ్చరుడు-మధ్యః-సముడు-పరేతు-మిగిలిన-రవి-చంద్ర-కుజులు-అన్యథా-మిత్రులు-శుక్రస్య-శుక్రునికి-సౌమ్యార్కీ-బుధ-శనులు-సుహృదౌ-స్నేహితులు-కుజగురూ-కుజ-గురువులు-సమౌ-సములు-శేషా మిగిలిన-రవి-చంద్రులు-అరీ-శత్రువులు సౌరస్య-శనైశ్చరునికి-శుక్రజ్ఞౌ-శుక్రబుధులు-సుహృదౌ-స్నేహితులు-సురగురుః-బృహస్పతి-సమః-సముడు-అన్యే-మిగిలిన-రవిచంద్రకుజులు-అరయః-శత్రువులు. ఇతి-ఇట్లని-త్రికోణభవనాత్-త్రికోణరాసులవల్లనుంచి-అపి-ఈ-సుహృదః మిత్రులని-యే ప్రోక్తాః-యేగ్రహములు పెద్దలచే చెప్పబడ్డవో-తే-ఆమిత్రాది గ్రహములు-మయా-నాచేతను-కీర్తితాః జెప్పబడ్డవి॥ ... ... ... .. ... ...*

### క్రూరసౌమ్యపురుషస్త్రీనపుంసకజాతిభేదాది గ్రహములు.

శ్లో॥ కాలామృతే-క్రూరాభానుతమశ్శనిధ్వజకుజాశ్శుక్రార్యసౌమ్యేందవస్సౌమ్యాస్తేపురుషాః కుజార్కిగురవః రాహ్విందుశుక్రాస్త్రియః-తచ్ఛేషాసునపుంసకాశ్శురుబుధ్రిగూవిప్రౌకుజార్కౌన్నృపౌ వైశ్యౌచంద్రబుధౌ తదన్యకులజో మందస్తువర్ణేశ్వరః॥ టీ॥ భానుతమశ్శనిధ్వజకుజాః-సూర్యరాహుశనికేత్వంగారకులు-క్రూరాః-పాపగ్రహములు-క్రూరస్వభావముగల గ్రహముల నెడితాత్పర్యము-శుక్రార్యసౌమ్యేందవః-శుక్రగురుచంద్రులు-సౌమ్యాః సౌమ్యగ్రహములు-యీ-3-న్నుశుభగ్రహములనియెడితాత్పర్యము-కొందరిమతమునందు బుధునికి పాపగ్రహముతో చేరినప్పుడు-శుభత్వమున్ను క్షీణచంద్రునికి పాపిత్వమున్ను-పూర్ణచంద్రునికి-శుభత్వ

మున్న - జెప్పబడియున్నది యింకను బాలబోధిని యనెడి గ్రంథమునందు దాహరణము॥ .. ... ... .. . .. ... . . ... . . *

శ్లో॥ బుధశ్శపాపయుతశ్శౌరిః క్షీణచంద్రస్తథైవచ॥టీ॥కుజార్కగురవః-కుజరవిగురువులు-పురుషాః-పురుషగ్రహములు- రాహ్వింద్వోశ్శుక్రాః-రాహుచంద్రశుక్రులు స్త్రియః- స్త్రీస్వభావముగలవారు-తచ్ఛేషాః-తక్కిన బుధశనికేతువులు-నపుంసకాః-నపుంసకస్వభావముగలవారు-॥ గుర్వ్భృగూ-గురుశుక్రౌ-విప్రౌ- బ్రాహ్మణగ్రహములు-కుజార్కౌ - రవి కుజులు-నృపౌ-క్షత్రియజాత్యధిపతులు -చంద్రబుధౌ-చంద్రబుధులు-వైశ్యౌ-వైశ్యజాత్యధిపతులు మందస్తు శనైశ్చరుడైతేను-తదన్యకులజః-తత్ -ఆబ్రాహ్మణక్షత్రియవైశ్యకులములకంటె అన్యమైనకులమందుబుట్టిన-వర్ణాశ్వరః-శూద్రవర్ణాధిపతి - శూద్రవర్ణాధిపతి - అనగా శూద్ర కులాధిపతి యనెడి తాత్పర్యము॥ .. .. .. ... ... . . . . . ... . *

నవగ్రహములయొక్క ధాత్వాదివర్ణములు.

శ్లో॥బృహజ్జాతకే॥రక్తశ్యామో భాస్కరో గౌరఇందుర్నాత్యుచ్చాంగో రక్తగౌరశ్చ వక్రః।దూర్వాశ్యామో జ్ఞో గురుర్గౌరగాత్రః। శ్వేతశ్శుక్రో భాస్కరిః కృష్ణదేహః॥టీ॥ భాస్కరః-సూర్యుడు-రక్తశ్యామలవర్ణమైనపూటలపువ్వువర్ణముగలవాడు - ఇందుః-చంద్రుడు-గౌరః-శ్వేతవర్ణముగలవాడు-వక్రః-అంగారకుడు-నాత్యుచ్చాంగః-అతిపొడుగైనవాడు గాక-రక్తగౌరః-పద్మపత్రంవంటిచాయగలవాడు-జ్ఞః-బుధుడు -దూర్వాశ్యామః-దూర్వాశ్యామలవర్ణముగలవాడు-॥ గురుః-బృహస్పతి-గౌరగాత్రః-పసుపుఛాయగలవాడు-శుక్రః-శుక్రుడు- శ్వేతః- తెలుపువర్ణముగలవాడు-భాస్కరిః॥ శనైశ్చరుడు-కృష్ణదేహః-నలుపువర్ణమైనదేహముగలవాడు॥ ... *

శ్లో॥ రాహుస్తుధూమ్రవర్ణశ్చ - చిత్రవర్ణో ధ్వజస్మృతః॥టీ॥ రాహుస్తు-రాహువైతేను-ధూమ్రవర్ణః-ధూమ్రవర్ణము - ధ్వజః-కేతువు-చిత్రవర్ణః-మంచిచిత్రవర్ణముగలవాడు ॥ ... .. ... ... . *

శ్లో॥ త్రిదశత్రికోణచతురస్రసప్తమాన్యవలోకయంతి చరణాభివృద్ధితః-రవిజామరేజ్యరుధిరాః పరేచయే - క్రమశోభవంతి సకలేక్షణాధికాః॥టీ॥ రవిజ-శనైశ్చరుడు - త్రిదశ-తానున్నరాశి-తృతీయదశమములయందున్న ఇంకా న్న గ్రహములను - చరణాభివృద్ధితః పాదవృద్ధిచేత చూచుచుండును. అవెట్లనె

యుంటి-జూచును-అనగా-శనైశ్చరుడు-మూడవ ఇంటినిన్ని పదో-యింటినిన్ని పాదదృష్టిచేత విశేషముగా జూచునని తాత్పర్యము-అమరేజ్యః- బృహస్పతి- త్రికోణ-తానున్న రాశికి పంచమనవమ రాసులనున్న - అందున్న గ్రహములనున్న అర్ధదృష్టిచేతను విశేషముగా- అవలోకయంతి-జూచును-అనగా-గురువు అయిదవ - ఇంటినిన్ని తొమ్మిదవ- ఇంటినిన్ని - అర్ధదృష్టిచేత-జూచునని తాత్పర్యము-రుధిరః-అంగారకుడు-చతురశ్రము-నాలవ రాశినిన్ని - అష్టమ రాశినిన్ని - అందున్న గ్రహములనున్న త్రిపాదదృష్టిచేత విశేషముగా-అవలోకయంతి-జూచును-అనగా- అంగారకుడు నాలవ రాశినిన్ని - యెనిమిదవ రాశినిన్ని విశేషముగా త్రిపాదదృష్టిచేత జూచునని తక్కిన గ్రహములు పూర్ణదృష్టి గ్రహములున్న తాముండే రాశికి యేడవ రాశినిన్ని అందున్న - గ్రహములనున్న చూచురని తాత్పర్యము॥ ... ... ... ...*

## అంధకబధిరపంగురాసులు.

శ్లో॥ మేషాదిచాంధకం షట్కం చత్వారో బధిరాస్తథా। ద్వౌచ పంగూ సవిజ్ఞేయా। తద్భేదాః పరికీర్తితాః॥ టీ॥ మేషాది- మేషము మొదలు షట్కం - ఆరు రాసులు-అంధకం-గుడ్డి రాసులు-తథా- అటుతర్వాత-చత్వారః-నాలుగు రాసులు-బధిరాః-చెవిటి రాసులు-తథా-అటుతర్వాత-ద్వౌచ- రెండు రాసులున్ను - పంగూ-కుంటి రాసులని-విజ్ఞేయా-తెలియదగినవి-తద్భేదాః - ఈ రాసుల భేదములు-పరికీర్తితాః- చెప్పబడినవి॥ .. ... . .. . ... *

తాత్పర్యము-మేషము మొదలు కన్యా రాశివరకు- గుడ్డి రాసులు పిమ్మట తులా వృశ్చిక ధనుర్మకర రాసులు చెవిటి రాసులు- పిమ్మట కుంభ మీనములు కుంటి రాసులు ఈ రాసుల భేదములు తెలియజేయుచున్నాము.

శ్లో॥ అజోవృషో మృగేంద్రశ్చ అర్ధరాత్రే మహాంధకాః- యుగ్మాంగనా కుళీరాశ్చ మధ్యాహ్నే చాంధకాస్స్మృతాః - ఇత్యేవం కాలభేదేన శుభదాశ్చ ప్రకీర్తితాః॥ టీ॥ అజః- మేషము వృషః-వృషభము -మృగేంద్రశ్చ-సింహమును-మధ్యరాత్రే-అర్ధరాత్రియందు-మహాంధకాః- మిక్కిలి గుడ్డిరాసులు-యుగ్మాంగనా కుళీరాః-మిథునకన్యాకర్కాటకములు-మధ్యాహ్నేచ- మధ్యాహ్నకాలమందున్న - అంధకాః- గుడ్డిరాసులని స్మృతాః- చెప్పబడినవి-ఇతి-ఇట్లు-ఏవం- ఈ కాలభేదేన-కాలభేదము చేతను-శుభఫలము నిచ్చువిగా- ప్రకీర్తితాః-చెప్పబడినవి॥ ... ... ... ... ... ... ... .. ... ... *

శ్లో॥ తులాచవృశ్చికశ్చైవ బధిరౌ చాపరాహ్ణకే। రాత్రౌ చ బధిరౌ ప్రోక్తౌ మకరశ్చ ధనుర్గృహం ఉభయోస్సంధ్యయోః పంగూ। కుంభమీనౌ ప్రకీర్తితౌ॥ టీ॥ తులా చ-తులయును-వృశ్చికశ్చ-వృశ్చికమును-అపరాహ్ణకే-పట్టపగటియందు-బధిరౌ-చెవిటిరాసులుగా-ప్రోక్తౌ-చెప్పబడినవి-మకరశ్చ-మకరము-ధనుర్గృహం-ధనుస్సును రాత్రౌ చ-రాత్రియందున్ను-బధిరౌ చెవిటిరాసులుగా-ప్రోక్తౌ-చెప్పబడినవి-కుంభమీనౌ-కుంభమీనరాసులు-ఉభయోస్సంధ్యయోః-ప్రాతస్సాయంసంధ్యలయందు పంగూ-కుంటివియైనవి-ప్రకీర్తితౌ-చెప్పబడినవి॥ .. ... ... . ... .. ... .. ...

## షడ్వర్గలక్షణమ్.

శ్లో॥ త్రింశద్భాగాత్మకం లగ్నం హోరా తస్యార్ధముచ్యతే। రాశిత్రిభాగో ద్రేక్కాణః నవాంశో నవభాగకః॥ ద్వాదశాంశో ద్వాదశాంశస్త్రింశాంశ స్త్రింశదంశకః। షడ్వర్గలక్షణం ప్రోక్తం సర్వలగ్నేష్వయం క్రమః॥ టీ॥ లగ్నం-లగ్నము-త్రింశద్భాగాత్మకం-30 భాగములుగలది-హోరా-హోర-తస్య-ఆలగ్నమునకు-అర్ధః-సగముగా-ఉచ్యతే-చెప్పబడుచున్నది-ద్రేక్కాణః-ద్రేక్కాణమనునది-రాశిత్రిభాగః-రాశి-లగ్నము-యొక్క-త్రిభాగః-మూడవభాగమైనది-నవాంశః-నవాంశమనునది-నవభాగకః-తొమ్మిదవభాగమైనది-ద్వాదశాంశః-ద్వాదశాంశమనునది-ద్వాదశాంశః-పదిరెండవభాగమైనది-త్రింశాంశః-త్రింశాంశమనునది-త్రింశదంశకః-ముప్పదవభాగమైనది-షడ్వర్గలక్షణం-షడ్వర్గలక్షణము-సర్వలగ్నేషు-సర్వలగ్నములయందు ప్రోక్తం-చెప్పబడినది సర్వలగ్నేషు-సర్వలగ్నములయందు-అయం-ఈ-క్రమః-క్రమము॥ .. ... ... ... ... .. ... ... .. . ... *

## హోరాద్రేక్కాణములు.

శ్లో॥ హోరార్కచంద్రయోరోజే యుగ్మభే చంద్రసూర్యయోః। లగ్నపంచనవత్రి-నాథా ద్రేక్కాణపాః క్రమాత్ ॥ టీ॥ ఓజే-ఓజరాశియందు-అర్కచంద్రయోః-సూర్యచంద్రులయొక్క-హోరా-హోర-యుగ్మభే-యుగ్మరాశియందు-చంద్రసూర్యయోః-చంద్రసూర్యులయొక్క-హోరా-హోర-అనగా లగ్నము రెండుభాగములుచేసి-బేసిరాశికి మొదటిభాగము సూర్యహోర-రెండవభాగము-చంద్రహోర-సమరాశికి మొదటిభాగము చంద్రహోర-రెండవభాగము సూర్యహోర యనితాత్పర్యము॥

లగ్నపంచనవపుత్రనాథాః- లగ్నపంచమనవమాధిపతులు - క్రమాత్ - వరుసగాను - ద్రేక్కాణాధిపాః - ద్రేక్కాణాధిపతులు-స్యుః-అగుదురు॥

శ్లో॥ చరేస్వపుత్రనవపాః-స్థిరేధర్మస్వపుత్రపాః-పుత్రధర్మస్వపాద్విస్వే- ద్రేక్కాణస్యప్రకీర్తితాః॥ టీ॥ చరే-చరరాశియందు - స్వపుత్రనవపాః-లగ్నపంచమనవమాధిపతులు ద్రేక్కాణాధిపతులు-స్థిరే స్థిరరాశియందు-ధర్మస్వపుత్రపాః - నవమలగ్నపంచమాధిపతులు ద్రేక్కాణాధిపతులు-ద్విస్వే - ద్విస్వభావరాశియందు-పుత్రధర్మస్వపాః-పంచమనవమలగ్నాధిపతులు ద్రేక్కాణాధిపతులని-ప్రకీర్తితాః-చెప్పబడ్డవి॥ ... .. ... .. *

తాత్పర్యము - లగ్నమును మూడుభాగములు చేసి - చరస్థిరద్విస్వభావరాసులను దెలుసుకొని - అందు-చరరాశి- మొదటిభాగమునకు - స్వరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి రెండవభాగమునకు- తనరాశికి-పంచమరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి-స్థిరరాశికి- మొదటిభాగమునకు-తనరాశికి తొమ్మిదవరాశ్యధిపతి-ద్రేక్కాణాధిపతి- రెండవభాగమునకు తనరాశ్యధిపతి - ద్రేక్కాణాధిపతి మూడవభాగమునకు-తనరాశికి అయిదోరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి- ద్విస్వభావరాశికి - మొదటిభాగమునకు తనరాశికి అయిదవరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి-రెండో భాగమునకు-తనరాశికి తొమ్మిదోరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి-మూడో భాగమునకు- తనరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతియని క్రమముగా- పన్నెండురాసులకు - ద్రేక్కాణాధిపతులను దెలుసుకొనేది- యిదే సిద్ధాంతవచనము యింకాకొందరిమతమును జెప్పుచున్నాము॥ . .. *

శ్లో॥ కేచిత్తు ప్రాహూరాం ప్రథమాం భవస్య-వాంఛం లాభాధిపతిర్ద్వితీయాం ద్రేక్కాణసంజ్ఞామపివర్ణయంతి। స్వద్వాదశైకాదశరాశిపానాం॥ టీ॥ ఈయర్థము- కాలామృతగ్రంథమునందు-విశదము చేయబోవుచున్నాము యిది పూర్వపక్షవచనము॥ . . . ... ... .. . *

## నవాంశక్రమము.

శ్లో॥ మేషసింహధనుషిత్వజాదయః స్త్రౌళికుంభమిధునేతులాదయః। కన్యకామృగవృషేమృగాదయః మీనకర్కటకవృశ్చికే కర్కటాదయః॥ టీ॥ మేషసింహధనుషి- మేషసింహధనుస్సులయందు - అజాదయః-మేషము మొదలుకొని నవాంశములు-త్రౌళికుంభమిధునే- తులాకుంభమిధునములయందు-తులాదయః-తుల మొదలుకొని నవాంశలు- కన్యకామృగవృషే-కన్యామకరవృ

షభములయందు-మృగాద్యాః-మకరము మొదలుకొనినవాంశలు-మీనకర్కా లిమ్న-మీనకటకవృశ్చికములయందు-కర్కటాద్యాః-కర్కాటకము మొదలు కొనినవాంశలు-అనగాలగ్నముతొమ్మిదిభాగములు చేసి- ముహూర్తకాలఘు డియలకుయేనవాంశకాలమగునో అనవాంశను మేషసింహధనువులైన- త్రికోణరాసులకు మేషము మొదలుకొని ఆసంఖ్యానవాంశయనిదెలుసుకొనవ నది - అందుతులాకుంభమిథునములైనత్రికోణరాసులకు- తులారాశినవాం శ మొదలుకొనిచూచుకొనవలసినది- కన్యామకరవృషభములైన త్రికోణరా సులకు మకరనవాంశ మొదలుకొని చూచుకోవలెను - మీనకటకవృశ్చికము లైనత్రికోణరాసులకు-కర్కాటకము మొదలుకొని చూచుకొవలసినదియని తాత్పర్యము॥ ... ... ... ... ... . . . . .. ... ... .. *

ద్వాదశాంశక్రమము.

శ్లో॥లగ్నాదిషు ద్వాదశాంశభవనాద్వాదశాంశపాః॥టీ॥ లగ్నాదిషు లగ్నాదిద్వాదశరాసులయందును-ద్వాదశాంశపాః- ఆద్వాదశాంశాధిప తులయినగ్రహమ్ములు- ద్వాదశాంశభవనాః-ద్వాదశాంశ రాసులుగలవారు భవంతి- అగుచున్నారు - అనగాలగ్నముపన్నెండుభాగములు చేసి నిశ్చయ మైనముహూర్తకాలమునకయీభాగములలోయేభాగముండునో అదిల గ్నాదిఆసంఖ్యాద్వాదశాంశయనిన్ని ఆద్వాదశాంశాధిపతియనిన్ని తెలు సుకొనేది- మేషరాశి మొదలుకొనిమీనరాశిపర్యంతమున్ను - వృషభరాశి మొదలుకొనిమేషరాశివరకున్ను- మిథునరాశి మొదలుకొని వృషభరాశివ రకున్ను - ఈక్రమముగా తక్కిన రాసులకున్ను చూచుకొనునది యని తాత్పర్యము॥ ... ... ... .. ... ... .. ... ... ... ... .. *

త్రింశాంశలక్షణము.

శ్లో॥ కుజరవిజగురుజ్ఞశుక్రభాగాః పవనసమీరణకౌర్పిజూకలేయాః। అయుజియుజితు-తేవిపర్యయస్థాశ్శశిభవనాళిఝషాంత్యఋక్షసంధిః॥టీ॥ కుజరవిజగురుజ్ఞశుక్రభాగాః-కుజశనిగురుబుధశుక్రుల యొక్కభాగములు - పవన సమీరణకౌర్పిజూకలేయాః-౫-౫-౮-౭-౫-అయుజి-బేసిరాశియందు-క్రమ స్థాః-క్రమముగానుండును-తే- ఆగ్రహభాగములు-యుజితు-సమరాశియం దైతేను విపర్యాసముగానుండునవి - శశిభవనాళిఝషాంత్య ఋక్షసం ధిః-కర్కాటకవృశ్చికమీనరాసుల యొక్క అంత్యకాలము రాశిసంధియనిన్ని

నక్షత్రసంధియనిన్ని అనబడును - అనగాలగ్నముమువ్వదిభాగములుచేసి-ఆభాగములనుకుజునికి-౫-భాగములు-శనైశ్చరునికి-౫-భాగములుబృహస్పతికి-౮-భాగములు-బుధునికి-౭-భాగములు-శుక్రునికి-౫-భాగములు-యీప్రకారముపంచగా-ముహూర్తఘటికలెవని భాగములోయుండునో ఆగ్రహాము ను-లగ్నముబేసి రాశియైనట్లయితే- కుజునిభాగము మొదలుకొని క్రమముగానాభాగములుగలవారు త్రింశాంశాధిపతియని తెలుసుకోనది - ఆలగ్నముసమరాశియైనట్లయితే శుక్రునిభాగము మొదలుకొని వ్యుత్క్రమముగానా భాగముగలవారు - త్రింశాంశాధిపతియని తెలుసుకోదగినది-భావము-కటకరాశ్యంత్యభాగమున్ను - సింహరాశిపూర్వభాగమున్ను - వృశ్చికరాశ్యంత్యభాగమున్ను - ధనూరాశిపూర్వభాగమున్ను - మీనరాశ్యంత్యభాగమున్ను - మేషరాశిపూర్వభాగమున్ను - రాశిసంధులనిన్ని - నక్షత్రసంధులనిన్ని తెలుసుకోనేది - నక్షత్రసంధులకుదాహరణము ॥ శ్లో॥ ఆశ్లేషాంత్యంమఘాత్వాగ్రం జ్యేష్ఠాంత్యంమూలపూర్వకం। రేవత్యాశ్వినయోర్మధ్యే గండదోషాఃప్రకీర్తితాః ॥ ఇందుకుతాత్పర్యముకాలామృతగ్రంథమునందువిశదముగా జెప్పియున్నది॥ ... ... ... ... ... ... ... ... ... .. *

## పక్షచ్ఛిద్రములు.

శ్లో॥ అష్టమీద్వాదశీషష్ఠీచతుర్థీచచతుర్దశీ।పక్షచ్ఛిద్రాశ్చతిథయఃశుభకార్యేషునిందితాః॥ టీ॥ అష్టమీ- అష్టమీయు-ద్వాదశీ-ద్వాదశియు-షష్ఠీ-షష్ఠియు-చతుర్థీ - చతుర్థియు- పక్షచ్ఛిద్రాః - పక్షచ్ఛిద్రములుః తిథయః- ఆతిథులు-శుభకార్యేషు- శుభకార్యములయందు - నిందితాః-నిందితములు - అనగానీతిథులుపక్షచ్ఛిద్రములనిపేళ్లుగలవిన్ని శుభకార్యములయందుకొరగానివిన్ని అమట॥ ... ... ... ... .. .. ... ... ... .. .. ... *

## పంచపర్వములు.

శ్లో॥ కృష్ణాష్టమీచతుర్దశ్యప్యమావాస్యాచపూర్ణిమా।సంక్రాంతిఃపర్వతిథయోమునిభిఃపరికీర్తితాః॥ టీ॥ కృష్ణాష్టమి కృష్ణపక్షాష్టమియు - చతుర్దశ్యపి-కృష్ణపక్షచతుర్దశియు- అమావాస్యాచ - అమవసయును- పూర్ణిమా- పున్నమయు-సంక్రాంతిః-సంక్రమణప్రవేశతిథియును - పర్వతిథయః-పంచపర్వతిథులని-మునిభిః-ఋషీశ్వరులచేతను-పరికీర్తితాః- చెప్పబడినది॥ ...*

## ఘటికాప్రమాణజ్ఞానము.

శ్లో॥ యావత్యశ్చరణప్రభాః ప్రతిదినం మేషాదిషట్సు క్రమాదోజ్యాశ్చైవ తులాదిషట్సు జలధిత్రిద్వ్యక్షిరామాబ్ధయః। అర్ధీకృత్య దినప్రమాణఘటికాస్సప్తాహతా నాడికాస్తావత్యః పరపూర్వయోః స్థితగతా యత్పూర్వసంఖ్యాభిధాః॥ టీ॥ ప్రతిదినం-ప్రత్యహమున్న - చరణప్రభాః - పాదచ్ఛాయలు-యావత్యః - ఎన్నియడుగులో-తాను - ఆయడుగులయందు-మేషాదిషట్సు-మేషమాసము మొదలుగాగల ఆఱుమాసములయందు- క్రమాత్ - వరుసగాను-జలధిత్రిద్వ్యక్షిరామాబ్ధయః-౪-౩-౨-౨-౩-౪-ఈ- సంఖ్యలను-యోజ్యాః - కూర్చదగినవి-తులాదిషట్సుచ - తులామాసము మొదలుగాగల-౬-మాసములయందును-క్రమాత్ -వరుసగాను-యోజ్యాః - పైన చెప్పిన ప్రకారము కూర్చదగినది-తాః - ఆవేరువేరుగా కూర్పబడినసంఖ్యలను తీసుకొని- దినప్రమాణఘటికాః - అహఃప్రమాణ ఘటికలను - అర్ధీకృత్య - సగము జేసి-సప్తాహతాః-౭- చేతగుణించి- యత్పూర్వసంఖ్యాభిధాః-యే పూర్వధ్రువముల చేత కూర్పబడినపాదచ్ఛాయాసంఖ్యలుగలవో వాట్లచేతనుపంచగావచ్చిన-నాడికాః-గడియలు-యావత్యః - ఏయెన్ని సంఖ్యలవచ్చునవో-తావత్యః - అన్నిగడియలు-పర-పూర్వయోః - దినము యొక్క-పూర్వాపరాహ్ణములయందు- స్థితగతాః- స్థితః- ఉండినవనిన్ని - గతాః-గతించినవనిన్ని - ఉక్తాః చెప్పబడినవి॥ ... . ... .. ... ... ... ... ...*

తాత్పర్యము॥ సూర్యునివెనకనుంచుకొని పాదచ్ఛాయలు వేసి - అవియెన్నియడుగులగుచున్నవో ఆయడుగులలో మేషమాసమునకు నాలుగు - వృషభమాసమునకు మూడు-మిథునమాసమునకు రెండు - కటకమాసమునకు రెండు-సింహమాసమునకు మూడు - కన్యామాసమునకు నాలుగు - తులామాసమునకు నాలుగు - వృశ్చికమాసమునకు మూడు - ధనుర్మాసమునకు రెండు మకరమాసమునకు రెండు- కుంభమాసమునకు మూడు - మీనమాసమునకు నాలుగు - యీక్రమముగా నాయామాసధ్రువములను జేర్చి యొకస్థలమునందుంచుకొనేది - తర్వాత సర్వకాలల అహఃప్రమాణము రెండువంతులు చేసి అందులో నొకపాలును యేడింటిచేత గుణించి యుంచి యుంచిన ధ్రువసమూహము చేత పంచగా వచ్చిన లబ్ధము గడియలగును- ఆగడియలు ప్రొద్దు తిరుగుటకు పిమ్మట చెల్లిన దినగడియలనిన్ని తెలుసుకోవలసినది - యీఘటికాప్రమాణము

నకుగణితములేకనత్యంతసులభముగ తెలుసుటకు - వరరుచియనువారుకొన్ని వాక్యములను జెప్పియున్నారు - ఎట్లన్నను-మే షేగిరిపు-వృష ఘటసట - మిథు నేకరలి-కటకేకరుబ - సింహేకయ - కన్యాకరుబ తులాలనశ - వృశ్చికమా తాస-ధనుషిసిజల-మకరేంరదాసి- కుంభెసితశ- మీనేశుభగ- యీ - ౧౨- వాక్యములకున్న తాత్పర్యము - మేషమాసమందు మొదటపదితేదులవరకు తానువుంచినపాదచ్ఛాయఅంగులలోఅర అంగులతీసివేసిమిగిలిన అంగు లలోమేషమాసవాక్యమందున్న మొదటియక్షరమునకుగలప్రమాణముతీసి వేసిమిగిలినప్రమాణమునుంచుకొనునది - మేషమాసమునందు రెండోపదితే దులకు రెండో అక్షరప్రమాణముతీసివేసేది - మూడోపదితేదులలోనుమూడో అక్షరప్రమాణముతీసివేసేది - వృషభమాసమునందు వృషభమాసమునం దున్న మూడక్షరములును-పదితేదులకొక యక్షరముచొప్పున నక్షరమునకు గలప్రమాణమునుతీసివేసితక్కిన యంగులకుగలఘడిప్రమాణములు - ముం దుజెప్పబోయెడిప్రకారమునిశ్చయముచేసుకోనేది-యీక్రమముగాపది రెం డుమాసములకున్న జూచుకొనేయక్షర ప్రమాణమనగా - సాంకేతనిఘం టువందు చెప్పనప్రకారము-అక్షరమునకుయేసంఖ్యవచ్చునో ఆసంఖ్యపరక లనుతీసివేసేది - ఎట్లన్నను-గియనే అక్షరమునకుమూడుసంఖ్య - అందుమూ డుపరకలు పోతికాపరకి యీక్రమముగా తెలుసుకోనేది॥ ... ... ... *

పాదచ్ఛాయఅంగులకుగడియలుచూచేక్రమము.

శ్లో॥ సప్తత్యష్టపదాదేకానాడికాతత్రకథ్యతే। పంచాశచ్చత్వారింశద్ద్వే అష్టావింశత్త్రయస్తథా॥ ఏకోనవింశచ్చత్వారిచతుర్దశ్యాంతుపంచకం। దశా ర్ధేనాడికాషట్చ అష్టకేసప్తనాడికాః। షట్పదేచాష్టకంవింద్యాచ్చతురర్ధేనవ మ్తకం। త్రికార్ధేదశకంవింద్యాద్వ్యర్ధేఏకాదశస్తథా। ఏకత్రిపాదోద్వాదశ కంపాదమేకంత్రయోదశ। చతుర్థాంశౌపాదేచతుర్దశ్యే పంచదశస్మృతాః

టీక॥ తాత్పర్యము ౭౮-అంగులకునొకగడియ-౪౫- అంగులకు రెండు గడియలు-౨౮-అంగులకుమూడుగడియలు-౧౯-అంగులకు నాలుగుగడియ లు-౧౪-అంగులకు అయిదుగడియలు-౧౦-అంగులకు ఆరుగడియల ౮-అ ంగులకుయేడుగడియలు-౬-అంగులకుఎనిమిదిగడియలు-౪౪-అంగులకు తొ మ్మిదిగడియలు-౩౪-అంగులకు-పదిగడియలు-౨౪ అంగులకుపదకొండుగ డియలు-౧౪-అంగులకుపన్నెండుగడియలు - ౧ - అంగులకు పదమూడు గడి

యలు-౪-అను గుణపడు నాలుగు గడియలు-శూన్యచ్ఛాయ అయితేను పదునైదు గడియలని దెలుసుకోనేది॥... ... ... ... .. .. ... ... ... ...*

ఈ వరరుచిమతము-యీ గ్రంథకర్తమతమునకు కొంచె మెచ్చుతక్కువగా వున్నందునమున్ను - గణిత బాహుళ్యము లేక పోవుటవలనను న్ను యిక్కడ నుదాహరించడమైనది॥ రాత్రియందు ఘటికా ప్రమాణకాలములను దెలుసుటకై నక్షత్ర స్వరూపములను జెప్పుచున్నాము॥ ... ... ... ... .. *

వరరుచివాక్యములు.

తురగముఖాశ్వినీ త్రీణి - భరణీ యోని త్రీణి - కృత్తికా క్షురావట్టం శకటం పంచ రోహిణీ - మృగశిరా శీర్షనక్షత్రయం - ఆర్ద్రా ప్రవాళమేకం - పునర్వసు కులాలచక్రం పంచ - శరటా పుష్యా త్రీణి - అశ్లేషా సర్పాకారేణ షట్ - మఖాందోళికా పంచ - పుబ్బ ఉత్తర నేత్రద్వయోః - హస్తా పాణినా పంచ - చిత్రా మౌక్తికమేకం - స్వాతీ మాణిక్యమేకం - విశాఖా కులాలచక్రం పంచ - అనూరాధా జ్యేష్ఠాం ఘుశ ఛత్రాకార త్రయం - మూలా కుప్పతేంగ సరీపంచ - పూర్వాషాఢా ఉత్తరాషాఢ ద్వే ద్వే చాకం - శ్రవణే మచ్ఛాకార త్రయం - ధనిష్ఠా శీర్షత్రయం - శతభిషచ్ఛతతారయోః - పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ద్వే ద్వే ఖట్వాం - రేవతీ మత్స్యాకార త్రయం - ఈ-వి ఇన్న నక్షత్ర స్వరూపములు యెట్లున్నను - అశ్వినీనక్షత్రము - అశ్వముఖమువలెనె మూడుసొట్టి నక్షత్రములు గలదై యుండును - భరణీనక్షత్రము యోనిరూపమువలె మూడు నక్షత్రములు గలదై యుండును - కృత్తికనక్షత్రము మంగలకత్తివలె నారు నక్షత్రములు గలదై యుండును - రోహిణినక్షత్రము బండివలె అయిదు నక్షత్రములు గలదై యుండును - మృగశిరానక్షత్రము - శిరస్సువలె మూడు నక్షత్రములు గలదై యుండును - ఆర్ద్రానక్షత్రము - పగడపువన్నెను లిగిన నొక నక్షత్రము గొప్పదై యుండును - పునర్వసు నక్షత్రము - కుమ్మరసానవలె అయిదు నక్షత్రములు గలదై యుండును పుష్యమినక్షత్రము - తొండరూపమువలె మూడు నక్షత్రములు గలదై యుండును - ఆశ్లేషానక్షత్రము సర్పాకారమువలె నారు నక్షత్రములు గలదై యుండును - మఖానక్షత్రము పాలకివలె అయిదు నక్షత్రములు గలదై యుండును - పుబ్బనక్షత్రము నేత్రములవలె రెండు నక్షత్రములు గలదై యుండును - ఉత్తరనక్షత్రము నేత్రములవలె రెండు నక్షత్రములు గలదై యుండును - హస్తనక్షత్రము చేతివేళ్లవలె అయిదు నక్షత్రములు గలదై యుండును - చిత్రాన

క్షత్రము-ముత్యమువలెనొకనక్షత్రముగలదై యుండును-స్వాతినక్షత్రము మాణిక్యమువలెనొకనక్షత్రముగలదై యుండును- విశాఖనక్షత్రము- కుంమ్మరసారెవలె అయిదునక్షత్రములుగలదై యుండును - అనూరాధజ్యేష్ఠలు అంకుశములవలెఛత్రాకారమైమూడునక్షత్రములుగలదై యుండును మూలానక్షత్రముగొంగసింహమువలె అయిదునక్షత్రములు గలదై యుండును- పూర్వాషాఢఉత్తరాషాఢలు రెండున్ను రెండు రెండు నక్షత్రములు ఒకచాకమువలెయుండును - శ్రవణనక్షత్రము-మత్స్యాకారమువలె - మూడునక్షత్రములుగలదై యుండును - ధనిష్ఠానక్షత్రము- శిరస్సువలెమూడునక్షత్రములుగలదై యుండును - శతభిషనక్షత్రము నూరునక్షత్రములు నొకపుష్పమువలెనుండును-పూర్వాభాద్ర ఉత్తరాభాద్రలు రెండున్ను రెండు రెండు నక్షత్రములుగలిగిమంచపుకోళ్లవలె యుండును - రేవతీనక్షత్రము-మత్స్యకారమువలె-మూడునక్షత్రములుగలదై యుండును॥ .. . ... . *

ఈక్రమాన నక్షత్రముల స్వరూపములనుకనిపెట్టి ఉచ్చనక్షత్రములను దెలుసుకొనేది॥ ... ... .. ... ... ... ... ...*

శ్లో॥ జ్యేష్ఠాదీనామతిక్రమ్య పౌష్ణాదీనామనాగమే । ఆర్ద్రాదీనాంసమంతర్యాన్నైః షట్ద్వాదశ క్రమాత్ ॥టీ॥ నవ-తొమ్మిదయయిన - జ్యేష్ఠాదీనాం- జ్యేష్ఠ మొదలుగాగల-నక్షత్రములకు- ఉచ్చం- ఉచ్చమును. అతిక్రమ్య-దాటినపిమ్మట-ఉచ్చ-ఉచ్చము-షట్- ఆరైన-పౌష్ణాదీనాం- రేవతీ మొదలుగాగలనక్షత్రములకు-ఉచ్చం-ఉచ్చమును కూర్చి-అనాగమే- రాహోర్యేకాలమందు- ఉచ్చ-ఉచ్చము-ద్వాదశ-పదిరెండు అయిన-ఆర్ద్రాదీనాం- ఆర్ద్ర మొదలుగాగలనక్షత్రములకు ఉచ్చం - ఉచ్చము-సమంపొందియుండగా- ఉచ్చ-ఉచ్చము-అనగా జ్యేష్ఠ మొదలు తొమ్మిదినక్షత్రములును - ఉచ్చము దాటినపిమ్మట ఉచ్చము రేవతినక్షత్రము మొదలు ఆరునక్షత్రములువుచ్చసామీప్యమునుకూర్చివచ్చుచుండగానుచ్చము - ఆర్ద్రానక్షత్రము మొదలు పదిరెండునక్షత్రములువుచ్చయిందువుండేటప్పుడువుచ్చము-వుచ్చయనగా - తాను ఆకాశమును జూచేటప్పుడు తనముక్కుకుసూటిగల ప్రదేశము వుచ్చమని క్రమముగా తెలుసుకోవడమని తాత్పర్యము॥ ... ... ... ... . .. *

ఉచ్చనక్షత్రములను కనిపెట్టి మేషాదిరాసుల ప్రమాణముల లోచెల్లినగడియలను దెలుసుకొనే వివరము॥ ... ... ... ... *

యచెల్లును - పుష్యస్తులారామః - పుష్యమినక్షత్రము ఉచ్చయందుండేను తులాలగ్నమునందు - రెండున్నరావరకుగడియ చెల్లును - అశ్లేషాతులాభోగి - ఆశ్లేషానక్షత్రము - ఉచ్చయందుండేను - తులాలగ్నమునందు - నాలుగుంపాతికావరకు గడియ చెల్లును - మఖావృశ్చికకల-మఖానక్షత్రము-వుచ్చయందుండేను-వృశ్చికలగ్నమునందు - ఒకటింపాతికావరకుగడియ చెల్లును. ఫల్గునీవృశ్చికలతా-పుబ్బానక్షత్రము వుచ్చయందుండేను వృశ్చికలగ్నమునందు - మూడుంముక్కాలుగడియ చెల్లును - ఉత్తరాధనునాగమ-వుత్తరానక్షత్రము-వుచ్చయందుండేను - ధనుర్లగ్నమునందు - అరావరకుగడియ చెల్లును-హస్తాధనుష్యాలా-హస్తనక్షత్రము-వుచ్చయందుండేను-ధనుర్లగ్నమునందు - మూడుంపాతికావరకుగడియ చెల్లును-చిత్రాధనుశ్శరైః - చిత్తానక్షత్రము - ఉచ్చయందుండేను - ధనుర్లగ్నమునందు అయిదుంకాలుగడియ చెల్లును-స్వాతీనకరే కామ-స్వాతీనక్షత్రము-వుచ్చయందుండేను మకరలగ్నమునందు - ఒకటింన్నరావరకుగడియ చెల్లును - విశాఖామకరేవనం-విశాఖానక్షత్రము-వుచ్చయందుండేను - మకరలగ్నమునందు నాలుగు గడియలు చెల్లును-అనూరాధాకుంభేనాభిః-అనూరాధానక్షత్రమువుచ్చయందుండేకుంభలగ్నమందరావరకుగడియ చెల్లును-జ్యేష్ఠాకుంభేకధా-జ్యేష్ఠానక్షత్రమువుచ్చయందుండేకుంభలగ్నమందు ఒకటింముప్పాతికావరకుగడియ చెల్లును-మూలాకుంభేగచ్ఛ-మూలానక్షత్రము ఉచ్చయందుండేను-కుంభలగ్నమునందు మూడుంముప్పాతికావరకుగడియ చెల్లును - పూర్వాషాఢామీనేకవిః-పూర్వాషాఢానక్షత్రము-వుచ్చయందుండేను - మీనలగ్నమునందు-ఒకటింనరగడియ చెల్లును-ఉత్తరాషాఢామీనేగాధా-వుత్తరాషాఢానక్షత్రమువుచ్చయందుండేనుమీనలగ్నమునందు-మూడుంముప్పాతికావరకు గడియ చెల్లును-యీక్రమముగా దెలుసుకొనునది - యీవాక్యములయందు అంత్యానక్షరములైన రెంటిలోను- మొదటియక్షరమునకుగడియలున్ను రెండవయక్షరమునకు పరకలున్ను అని తెలుసుకొనునది॥ ... ... ... ... ...*

సంజ్ఞాప్రకరణము.

సంపూర్ణము.



శ్రీరస్తు.

## జాతకర్మాదిముహూర్తప్రకరణము,



### అంమజాతకర్మప్రకరణము,



శ్లో॥ ముఖావలోకేనసుతస్యజీవతఃపితాఋముచ్యేతయత స్తదర్ణతః।
తతఃక్షణాదీన్విగణయ్యతత్క్షణంవిధీయ్యతే జన్మవిధిస్సుతోదయే॥

టీక॥ జీవతః-జీవించుచున్న - సుతస్య-కొమారునియొక్క - ముఖావలోకేన- మోము చూచుటచేతను - పితా-తండ్రి - తదర్ణతః పితృఋణమువలననుంచి యతః-ఏకారణమువలన విముచ్యేత-విడువబడునో-తతః-అదిమొదలుకొని-క్షణాదీన్- క్షణాదికాలములను - విగణయ్య - ఎంచి-తత్ క్షణం - అదేపుడు-సుతోదయే-కొమారుడుబుట్టుటయందు-జన్మవిధిః-జాతకర్మ -విధీయ్యతే-విధింపబడుచున్నది - అనగా తండ్రి పుట్టినకొమారునిముఖముజూచుటవలన తనపితృఋణముక్తుడెటువలెనగుచున్నాడో అటువలెనేయెప్పుడు క్షణాదికాలములనుయెంచియున్నారో - అప్పుడేతానుజాతకర్మము చేయతగినదని తాత్పర్యము॥ ... ... ... ... ... ... ... ... ... ... ... ...*

శ్లో॥ పుత్రజన్మనియజ్ఞేచతథాసంక్రమణేరవేః। రాహూః ప్రదర్శనే స్నానంప్రశస్తంనాన్యథానిశి॥ టీ॥ పుత్రజన్మని-పుత్రోత్పత్తియందున్నుయజ్ఞే-యజ్ఞమందున్ను-తథా- ఆప్రకారము రవేః-సూర్యునియొక్క - సంక్రమణేచ-సంక్రమణపుణ్యకాలములయందున్ను- రాహోః ప్రదర్శనే- గ్రహణములయందున్ను-స్నానం-రాత్రిస్నానము- ప్రశస్తం- ప్రశస్తము-అన్యథా-తక్కిన నిశి-రాత్రియందు-స్నానం-స్నానము-న- ప్రశస్తముకాదు- అనగా కొమారుడుకొమార్తెబుట్టినకాలములయందున్నుయజ్ఞాంతకాలములయందున్ను సంక్రమణప్రవేశపుణ్యకాలములయందున్ను సూర్యచంద్రగ్రహణములయందున్న స్నానముముఖ్యము-యివి రాత్రియందు ప్రాప్తమైతేనప్పుడే స్నానము జేయుటము ముఖ్యమని తాత్పర్యము॥ ... ... ... ... ... *

శ్లో॥ గ్రహణోద్వాహసంక్రాన్తియాత్రాసు ప్రసవేషు చ। దానం నైమిత్తికం జ్ఞేయం రాత్రావపి నదూష్యతి॥ టీ॥ గ్రహణోద్వాహసంక్రాంతియాత్రాసు ప్రసవేషు-గ్రహణ-గ్రహణకాలములయందున్ను - ఉద్వాహ-వివాహములయందున్ను-సంక్రాంతి-మేషాదిసంక్రమణకాలములయందున్ను-యాత్రాసు-యాత్రలయందున్ను ప్రసవేషు-పుత్రపుత్రికోత్పత్తికాలములయందున్ను-నైమిత్తకం-నిమిత్తమువల్లవచ్చినదని-జ్ఞేయం-తెలియదగినది-రాత్రావపి-రాత్రియందున్ను - నైమిత్తికం దానం - నిమిత్తమువల్ల వచ్చినదానము-నదూష్యతి-దూషింపదగినదికాదు అనగా నైమిత్తికదానములకు రాత్రియందు దోషము లేదని తాత్పర్యము॥ ... .. ... ... .. ... ... ... ...*

శ్లో॥ యావన్నచ్ఛిద్యతే నాళం తావన్నాప్నోతి సూతకమ్। ఛిన్నేనాళే తతః పశ్చాత్సూతకం తు విధీయతే॥ టీ॥ నాళం-బొడ్డుతీగె - యావన్నచ్ఛిద్యతే-ఎంతకాలముకోయరో-తావత్-అంతపర్యంతము సూతకం- జాతాశౌచము-నాప్నోతి-లేదు-తతః - అటుతర్వాత- నాళేచ్ఛిన్నేసతి బొడ్డుతీగె కోయబడుచుండగా- పశ్చాత్ - అటుతర్వాత - సూతకం తు - జాతాశౌచమున్ను - విధీయతే-విధింపబడినది - అనగా శిశువు పుట్టినపిమ్మట యెంతపర్యంతము బొడ్డుతీగె కోయరో అంతపర్యంతము పురుడు లేదని తాత్పర్యము॥ ..*

శ్లో॥ దృష్ట్వా తతశ్చ విధివత్సచేలస్నానమాచరేత్। దత్త్వా గోభూహిరణ్యాది పశ్చాల్లగ్నం నిరీక్షయేత్॥ టీ॥ తతః - అటుతర్వాత-దృష్ట్వా - శిశువును చూచి-విధివత్ - యథాశాస్త్రముగాను - సచేలస్నానం-వస్త్రముతోటి స్నానమును-ఆచరేత్ - చేయదగినది- గోభూహిరణ్యాది - గోదానభూదాన బంగారు మొదలయిన దానములను-దత్త్వా- ఇచ్చి- పశ్చాత్ -పిమ్మట-లగ్నం జనించిన కాలలగ్నమును-నిరీక్షయేత్ చూడతగినది - అనగా శిశువు బుట్టినపిమ్మట- కట్టువస్త్రములతో స్నానము చేసి గోదానము మొదలయిన దానములు చేసి పిమ్మట జాతకుని యొక్క-భావఫలములు జూడవలసినదని తాత్పర్యము॥ః

శ్లో॥ తస్మిన్ జన్మముహూర్తేపి సూతకాన్తేథవా శిశోః। జాతకర్మ చ కర్తవ్యం పితృపూజనతత్పరైః॥ టీ॥ తస్మిన్ - ఆ ప్రసిద్ధమయిన-జన్మముహూర్తేపి-జననకాలముహూర్తమందైన - అథవా - అటుగాకపోయినట్టయితే-శిశోః-శిశువు యొక్క - సూతకాంతే-పురుడు తీరినకాలమందైన -పితృపూజనతత్పరైః- మాతృపితృపూజాసక్తులైనవారిచేత జాతకర్మ-జాతకర్మము-కర్తవ్యా*

చేయదగినది-అనగా శిశువు పుట్టినప్పుడైనా పురుడుతీసినపిమ్మటనైనా నామకరణకాలమందైనా జాతకర్మము చేయవచ్చునని తాత్పర్యము॥ ... ... *

## నామకరణము.

శ్లో॥ నామకర్మ దశమేథవాహని ద్వాదశేథ శుచిషు వాథియతే। స్వోచ్చమిత్రభవనేషు సద్గ్రహైః సాధ్యమేతదపి లోకితాశ్శుభాః॥ టీ॥ దశమేహని - దశమదివసమునందైనా - అథవా - అటుగాక - ద్వాదశేహని - పదిరెండవదివసమునందైనా - శుచిషువా - శుభదివసములయందైనా - శుభాః - శుభఫలప్రదములైన - సద్గ్రహాః - శుభగ్రహములు - స్వోచ్చమిత్రభవనేషు - తమతమ స్వోచ్చమిత్రక్షేత్రములయందు - తాదృశైః - ఇటువంటి శుభగ్రహముల చేతను - విలోకితా యది - చూడబడినట్లాయెనా - నామకర్మ - నామకరణము - విధీయతే - చేయదగినది - అనగా నామకరణము దశమదివసమందైనను పదిరెండవదివసమందైనను జేయుటమంచిది - అటుగాకున్న శుభదినములయందు సూర్యాది గ్రహములు తమతమ స్వోచ్చమిత్ర స్వక్షేత్ర కేంద్రకోణములలో గూడియున్న కాలములయందు నామకరణము జేయుట మంచిదని తాత్పర్యము ఈ శ్లోకార్థమందు నామకరణము దశమదివసమందైనా ద్వాదశదివసమందైనా జేయుట మంచిదని చెప్పియున్నదిగదా యీయర్థమితర గ్రంథకర్తలకు విరుద్ధమై యున్నందున యీవచనమును పూర్వపక్షవచనముగ నిర్ణయము చేసి సిద్ధాంతవచనము వ్రాయుచున్నాము॥ ... . .. ... ... ... ... .. ... *

## కాలామృతే.

శ్లో॥ జాతానంతరమేవ నామకరణం శస్తం ద్వాదశేహ్ని స్ఫుటం వ్రస్యైపసమాత్సరంతు యువతేః కార్యంతతోప్యత్రయం। శుద్ధిర్జాతకవచ్చ నామ్ని సకలే తద్వాదశే షోడశే ద్వావింశే త్వథత్రింశకేహ్ని విహితం జాతివ్యవస్థాం వినా॥ ఈ॥ శ్లోకమునకు తాత్పర్యమిక్కడ సూచనగా తెలియజేయుచున్నాము

పదకొండవదివసమునందు - బ్రాహ్మణులకున్ను - పదిరెండవ దివసమునందు క్షత్రియులకున్ను - పదునారవదివసమునందు - వైశ్యులకున్ను - యిరువదిరెండవదివసమునందు - శూద్రులకున్ను - యీక్రమముగ - నామకరణము జేయుటమంచిది - అటుగాన - యిరువదవదివసమునందు - బ్రహ్మ - క్షత్రియ - వైశ్య - శూద్రులకు జాతివ్యవస్థనిమిత్తము లేక నామకరణము జేయుట మంచిదని భావము॥ ... ... .. ... ... ... ... .. ... ... .. *

శ్లో॥ మిత్రాదిత్యమఖోత్తరాశతభిషక్స్వాతీధనిష్ఠాచ్యుతప్రాజేశాశ్విశశాంకపౌష్ణదినకృత్పుష్యేషు రాశౌస్థిరే ॥ భిత్రాన్పంచదశీంవిహాయనవమీంశుద్ధేష్టమేభార్గవజ్ఞాచార్యామృతపారవారధివసేనామానికుర్యాచ్ఛిశోః॥ టీ॥ మిత్రాదిత్యమఖోత్తరాశతభిషక్స్వాతీధనిష్ఠాచ్యుతప్రాజేశాశ్విశశాంకపౌష్ణదినకృత్పుష్యేషు-మిత్ర-అనూరాధ - ఆదిత్య - పునర్వసు-మఖ-మఖ-ఉత్తర-ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలు-శతభిషక్-శతభిషము-స్వాతీ-స్వాతీ-ధనిష్ఠా-ధనిష్ఠ-అచ్యుత-శ్రవణము-ప్రాజేశ-రోహిణీ అశ్వి-అశ్వినీ-శశాంక-మృగశీర్ష-పౌష్ణ-రేవతి-దినకృత్-హస్త-పుష్య-పుష్యమి-ఈనక్షత్రములయందున్న-స్థిరే-స్థిరమైన-రాశౌ-రాశియందున్న-భిత్రాన్-పక్షఛిద్రతిథులనున్న-పంచదశీం పౌర్ణమాస్యమున్న-నవమీ-నవమినిన్ని-విహాయ-విడిచిపెట్టి-అష్టమే-ఎనిమిదవస్థానము-శుద్ధేసతి-గ్రహవర్జితమగుచుండగానున్న-భార్గవజ్ఞాచార్యామృతపారవారదివసే-శుక్రబుధగురుసోమకుజవారములయందున్నపితాతండ్రి-శిశోః-శిశువునకు-నామాని-మాసనామనక్షత్రనామవ్యవహారనామములను-కుర్యాత్ చేయవలసినది॥ *

శ్లో॥ దైవపూర్వంనరాఖ్యంహిశర్మవర్మానుభావకః॥ సుశ్రీయుతంనామపూర్వంరేఖాంతంపునరోష్ఠకైః॥ టీ॥ దైవపూర్వందేవతావాచకశబ్దముపూర్వమందుగలిగినట్టిన్నిపూర్వం-వ్యవహారనామంబునకాదియందు-సుశ్రీయుతం శుభకరమైనశ్రీకారముతోగూడినట్టి-నామ-నామధేయము-సువర్ణోష్ఠకైః-సంస్కృతభాషావర్ణములచేత-రేఖాంతం-పర్యంతముగలదనుక-శర్మవర్మానుభావాః-బ్రాహ్మణక్షత్రజాతులకువిహితంబులైనశర్మవర్మగుప్తదాసంబులనుండి-కరాఖ్యంహి-హస్తముచేతవ్రాయవలసినదియనుట॥ ... ... .. *

శ్లో॥ కృష్ణోనంతోచ్యుతశ్చక్రీవైకుంఠోథజనార్దనః॥ ఉపేంద్రోయజ్ఞపురుషోవాసుదేవస్తథాహరిః॥ గోవిందఃపుండరీకాక్షోమాసనామాన్యనుక్రమాత్। కేచిన్నక్షత్రనామానికుర్వంతివిదితాగమాః॥ టీ॥ కృష్ణః-కృష్ణుడు - అనంతః అనంతుడు-అచ్యుతః-అచ్యుతుడు-చక్రీ-చక్రి-వైకుంఠ-వైకుంఠుడు-జనార్దనః-జనార్దనుడు-ఉపేంద్రః-ఉపేంద్రుడు-యజ్ఞపురుషః-యజ్ఞపురుషుడు-వాసుదేవః వాసుదేవుడు-హరిః హరి-గోవిందః-గోవిందుడు-పుండరీకాక్షః పుండరీకాక్షుడు-యీపదిరెండున్ను అనుక్రమాత్-వరుసగాను-మాసనామాని చైత్రాదిద్వాదశమాసనామంబులగుచున్నవియెఱుంగవలయు-కేచిత్-కొందరైన

విదితాగమాః-శాస్త్రవేత్తలు-నక్షత్రనామాని- నక్షత్రనామంబులను- కుర్వంతి-చేయుచున్నారు- అనగా తండ్రి కుమారునికి నామకరణము సేయునపుడు ముందుగా నిందు చెప్పియున్న కృష్ణుడు మొదలయిన పదిరెండు నామధేయములను తెలుసుకొని చైత్రాదిమాసంబులలో నేమాసంబందునో ఆమాసమును వ్రాయవలసినది-యీప్రకారముగా నే నక్షత్రనామవ్యవహారనామంబులను వ్రాయవలసినదనుట॥ .. .. ... .. . ... .. .. .. *

స్త్రీణాంతు.

శ్లో॥ మార్గశీర్షే చ వాగ్దేవీ పుష్యే పద్మావతీ భవేత్। శ్రీదేవీ చైవ సావిత్రీ భూమిః కల్యాణికా స్మృతా। సత్యభామా పుణ్యవతీ రూపిణీ చేందుమత్యపి। చంద్రావతీ చ లక్ష్మీశ్చ స్త్రీనామకరణే విదుః॥ టీ॥ మార్గశీర్షే- మార్గశీర్షమాసమునందు-వాగ్దేవీ-వాగ్దేవి-పుష్యే-పుష్యమాసమునందు- పద్మావతీ-పద్మావతి- శ్రీదేవీ- మాఘమాసమునందు శ్రీదేవి-సావిత్రీ-ఫాల్గుణమాసమునందు-సావిత్రి- భూమిః-చైత్రమాసమునందు-భూదేవి- కల్యాణీ-వైశాఖమాసమునందు-కల్యాణి-సత్యభామా-జ్యేష్ఠమాసమునందు-సత్యభామ-పుణ్యవతీ-ఆషాఢమాసమునందు-పుణ్యవతి-రూపిణీ-శ్రావణమాసమునందు-రూపిణి- ఇందుమతీ-భాద్రపదమాసమునందు-ఇందుమతి- చంద్రావతీ-ఆశ్వయుజమాసమునందు చంద్రావతి-లక్ష్మీః-కార్తికమాసమునందు లక్ష్మి-ఏతాని-స్త్రీనామకరణే- స్త్రీల యొక్క నామకరణమందు- మాసనామానీతి-మాసనామంబులని- విదుః- పెద్దలు తెలుసుకొనుచున్నారు॥ .. .. ... .. .. . .. *

శ్లో॥ కుమారస్యాభివృద్ధ్యర్థం కుర్యాద్బ్రాహ్మణభోజనం। టీ॥ కుమారస్య - కుమారునకు-అభివృద్ధ్యర్థం - ఉత్తరోత్తరాభివృద్ధిగలుగుటకొరకు- బ్రాహ్మణభోజనం-బ్రాహ్మణులకు భోజనంబు పెట్టుటను-పితా-తండ్రి-కుర్యాత్ చేయవలయు॥ ... . ... ... ... ... ... .. ... . *

శ్లో॥ ద్వ్యక్షరం వా చతురక్షరం వా విసర్గితో వాంత్యలకారరేఫమ్। తన్నామనామాదికమేకచిత్తస్స్ఫుటం వదేద్దక్షిణకర్ణరంధ్రే। టీ॥ తండ్రి యగువాడు-ఏకచిత్తః-నిశ్చలచిత్తుండై- విసర్గితో వా- అంత్యలకారరేఫం-వ్యవహారనామము యొక్క-అంతమాటుగ ముదకు పూర్వమునందు విధింపబడిన లకారరేఫము గలిగినట్టియు ద్వ్యక్షరం వా రెండు వర్ణములు గలదిగానైనను - చతురక్షరం వా నాలుగు వర్ణములు గలదియైనను-వ్యవహారనామమును- తన్నామనామాదికం॥ ఆ

శిశువుయొక్క-నామ-సనక్షత్ర నామపూర్వకంబుగా- దక్షిణకర్ణరంధ్రే - శిశువుయొక్క కుడిచెవిరంధ్రమున - స్ఫుటం- వ్యక్తముగునట్లు-వదేత్ - చెప్పవలయుననుట॥ .. ... . . . .. . .. ... ... ... *

శ్లో॥ అష్టమస్థా గ్రహాస్సర్వే నేష్టాస్తే నామకర్మణి।ధనపుత్రసుహృద్భాతృనవమేనశుభశ్శశీ।పాపాస్త్రిషష్టలాభస్థాఃనామకర్మణిపూజితాః॥ ద్వాదశేహానికర్తవ్యమ్ శిశోర్నిష్క్రమణంగృహాత్ ॥ టీ॥ నామకర్మణి నామకరణమందు- సర్వేగ్రహాః-సూర్యాదినవగ్రహములు- అష్టమస్థాః- అష్టమస్థానమందున్న వారలైనచున్న నేష్టాఃఇష్టఫలంబులనిచ్చువారుగారు-సశుభః-శుభగ్రహయుక్తుడై ధనపుత్రసుహృద్భ్రాతృనవమేద్వితీయపంచమచతుర్థ-తృతీయనవమస్థానములందు-స్థితః-ఉన్న-శశీ-చంద్రుడును-త్రిషష్టలాభస్థాః-తృతీయషష్ఠలాభస్థానములందున్న-పాపాః-పక్షంగాదకశనిరాహుకేతువులున్ననామకర్మణినామకరణమందు-పూజితాః పూజింపబడినవారు-అనగా శుభఫలంబులనిచ్చువారనుట॥ ... ... .. .. . . ... ... ... *

ద్వాదశేహని-పదిరెండవదివసమునందు-గృహాత్ -సూతికాగృహమువలననుండి - శిశోః చిన్నవానియొక్క-నిష్క్రమణం-బయలువెడలించుట-కర్తవ్యం- చేయదగినది॥ .. ... ... ... ... . ... ... ... *

## అథకంచుకధారణం.

శ్లో॥అశ్వినీత్వష్ట్రపౌష్ణేజ్యమిత్రోత్తరకరానిలే। సితసౌమ్యేజ్యవారేషు చంద్రతారాబలాన్వితే।శుభేముహూర్తేపూర్వాహ్ణే జయేపూర్ణదినే తథా।కేంద్రత్రికోణగాస్సౌమ్యాః పాపాస్త్ర్యాయారిరాశిగాః । శిశూనాంధారయేత్తత్ర కంచుకంచిత్రవర్ణకమ్॥ టీ॥ అశ్వినీ-త్వష్ట్రపౌష్ణేజ్యమిత్రోత్తరకరానిలే - అశ్విని-చిత్ర- రేవతి-పుష్యమ్యనూరాధోత్తరోత్తరాషాఢోత్తరాభాద్రాహస్తస్వాతులయందునిసౌతమ్యేజ్యవారేషు- శుక్రబుధగురువారములయందు-చంద్రతారాబలాన్వితే-చంద్రతారాబలములతోగూడినట్టిశుభేముహూర్తేశుభముహూర్తమునందుపూర్వాహ్ణేపగటిమొదటిభాగమునందు-జయే-జయతిథులయందు- పూర్ణదినే సంపూర్ణదినములందు సౌమ్యాః-శుభగ్రహములుకేంద్రత్రికోణగాస్సంతః - కేంద్రత్రికోణస్థానములనుబొందియుండగాను-పాపాః-పాపగ్రహములు- త్ర్యాయారిరాశిగాస్సంతః-తృతీయైకాదశషష్ఠస్థానములనుబొందియుండగానున్న శిశూనాం

బాలురకు - చిత్రవర్ణకం-నానావిచిత్రవర్ణములుగల-కంచుకం-చొక్కాయను-ధారయేత్-తొడిగింపవలయు॥ ... ... .. ... ... ... .. .. *

## డోలారోహణమ్.

శ్లో॥ తృతీయేపంచమేమాసితస్మాత్సేనాశుభదినే। ధాతృమూలోత్తరత్రీణితిర్యగ్భేషుద్విదైవభే॥ చంద్రతారాబలయుతే చాష్టమేశుద్ధిసంయుతే। డోలామారోపయేద్బాలంద్విజపుణ్యాంగనాదిభిః॥ టీ॥ తృతీయే మూడవమాసమునందైనను- పంచమేమాసి - ఐదవమాసమునందైనను-తస్మాత్సేవా- ఆశిశువుజనించినమాసమునందైనను-శుభదినే శుభదినమునందు - ధాతృమూలోత్తరత్రీణితిర్యగ్భేషు-రోహిణిమూలోత్తరోత్తరాషాఢోత్తరాభాద్ర తిర్యఙ్ముఖనక్షత్రములయందును-తిర్యఙ్ముఖనక్షత్రంబులనగా-రేవతి-పునర్వసు-హస్త-చిత్త-స్వాతి-అశ్వని-మృగశీర్షానూరాధా జ్యేష్ఠలనుట- ద్విదైవభే-విశాఖానక్షత్రమునందును-చంద్రతారాబలయుతే- చంద్రతారాబలసంపన్నంబైనశుభముహూర్తంబునందును-అష్టమే- ఎనిమిదవస్థానము-శుద్ధిసంయుతేసతి-గ్రహవర్జితంబగుచుండగానున్న - ద్విజపుణ్యాంగనాదిభిః- బ్రాహ్మణుతైదువలు మొదలగువారిచేత- బాలం-శిశువును-డోలాం- ఉయ్యాలను-ఆరోపయేత్- ఎక్కింపవలయుననగా-శిశువును-ఉయ్యాలమీద-గూర్చుండబెట్టియూచవలయుననుట॥ ... ... ... .. .. ... ... ... *

## అథాన్నప్రాశనం.

శ్లో॥ షష్ఠేష్టమేవాదశమేచమాసి సంవత్సరేవాదివసేప్రవృద్ధే। పక్షేసితే వ్యోమ్నివిశుద్ధిభాజి- బాలాన్నభుక్తిర్విహితామునీంద్రైః॥ టీ॥ షష్ఠే- ఆరవమాసమందైనను - అష్టమేవా- ఎనిమిదవమాసమందైనను- దశమేచమాసి-పదవమాసమందైనను-సంవత్సరేవా-సంవత్సరాంతమునందైనను-దివసే-పగటియందును-ప్రవృద్ధే పక్షే-శుక్లపక్షమునందును-సితే శుక్రుడు-వ్యోమ్ని-ఆకాశమునందు-విశుద్ధిభాజిసతి-మిక్కిలి పరిశుద్ధుండై ప్రకాశించుచుండగాను-బాలాన్నభుక్తిః- బాలురకునన్నప్రాశనము-మునీంద్రైః - ఋషీశ్వరులచేత-విహితా చెప్పబడినది॥ ...... ... .. ...... ...... *

శ్లో॥ దేవతాపురతస్తస్య ధాత్ర్యుత్సంగగతస్యచ। అలంకృతస్యభూషాభిఃస్వర్ణపాత్రేచవాంఛితే। మధ్వాజ్యకనకోపేతే ప్రాశయేత్పాయసంశుభం॥ టీ॥ దేవతాపురతః- దేవునెదుట- ధాత్ర్యుత్సంగగతస్యచ-అన్నప్రాశనము-సే

యువానితొడ యందు గూర్చుండబెట్టియు-భూషాభిః-ఆభరణములచేత-అలం కృతస్య-అలంకరింపబడిన-తస్య - ఆశిశువునకు-మధ్వాజ్యకనకోపేతే-తేనె నెయ్యి-బంగారులతోగూడిన-వాంఛితే-ప్రియమైన- అన్నపాత్రే-సువర్ణరజితాదివికారంబైనభోజనపాత్రంబునందు-స్థితం - ఉంచిన శుభంకరమైన-పాయసంతీరాన్నము ప్రాశయేత్ -భక్షింపజేయవలయును - అనగాబాలురకన్నప్రాశనము సేయునెడల మేనమామ మొదలగువారు శిశువునుదమతొడమీదగూర్చుండబెట్టుకొని సువర్ణాదివికారంబైనపాత్రంబునందు పాయసంబునుంచి దానియందు నెయ్యి-తేనెయునుమిశ్రనుముచేసి అట్టిపాయసంబునుసువర్ణాభరణాదులచేత దేవునెదుటనాశిశువునకునూతనాన్నప్రాశనము సేయవలయునని తాత్పర్యము॥ ... ... ... *

శ్లో॥ ఆదిత్యసౌమ్యవసుతిష్యకరానిలాశ్విమిత్రాఖ్యవిష్ణువరుణోత్తరభానిచిత్రా। బాలాన్నభోజనవిధౌదశమేచశుద్ధే। భిద్రాన్విహాయనవమీంతిథయశ్శుభాస్స్యుః॥ టీ॥ ఆదిత్య- సౌమ్య- వసుతిష్యకరానిలాశ్విమిత్రాఖ్య-విష్ణువరుణోత్తరభాని-ఆదిత్య-పునర్వసు-సౌమ్య-మృగశీర్ష-వసు-ధనిష్ఠ-తిష్య-పుష్యమి-కరహస్త- అనిలస్వాతి- అశ్వి - అశ్విని-మిత్రాఖ్య-అనూరాధ-విష్ణుశ్రవణమువరుణశతభిషము - ఉత్తరభాని - ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలున్న-చిత్రా చిత్తానక్షత్రమును దశమేచ- అన్నప్రాశనలగ్నమునకుబదియవదియగుస్థానము-శుద్ధేసతి- గ్రహరహితంబగుచును దగానున్న- భిద్రా-భిద్రతిథులనున్నవవమీంచ-నవమినిన్నివిహాయ-విడిచి- తిథయః మిగిలినతిథులును-బాలాన్నభోజనవిధౌ-బాల-బాలురయొక్క అన్నభోజనవిధౌ అన్నప్రాశనవిధియందు-శుభాశ్శుభఫలంబులనిచ్చునవి-స్యుః-అగుచున్నవి॥

శ్లో॥ వారాశ్శుభాశ్చగురుచంద్రసితేందుజానాం। మేషాదిమీనరహితా విహితాసిభాని భుక్తౌశిశోశ్శుభకరాః పరిహృత్యసౌమ్యం- భౌమంసితంనవమనైధనసప్తమేషు॥ టీ॥ శిశోః శిశువుయొక్క- భుక్తౌ- అన్నప్రాశనవిధియందు-గురుచంద్రసితేందుజానాం గురుసోమ-శుక్రబుధులయొక్క వారాశ్చ వారములును శుభాః-శుభకరములైనవి- మేషాలీ-మీనరహితాని-మేషవృశ్చికమీనరాసులచేత - వర్జితములైనభాని-రాసులును హితాని - ఇష్టఫలములనిచ్చునవి నవమనైధనసప్తమేషు నవమాష్టమసప్తమస్థానములయందు సౌమ్యం బుధుని- భౌమం అంగారకుని సితం శుక్రుని - క్రమముగాపరిహృత్య

విడిచిపెట్టియితరస్థానములయందున్న సూర్యాదినవగ్రహములనుశుభక
రాః- శుభములను జేయువారనుట - ఇతరములైనకాలామృతాదిగ్రంథముల
యందైన-నన్న(ప్రా)శనలగ్నంబునందు పాపగ్రహంబులుండినను విశేష
దోషంబనియును - శుభగ్రహంబులుండినను విశేషశుభఫలంబనియును ప్రతి
పాదింపబడియున్నదిగాననిచ్చటనట్టివిషయమును దెలియజేయనికతంబున
కాలామృతశ్లోకంబిచ్చటవ్రాయబడుచున్నది॥ .. ... .. ... .. *

శ్లో॥ పుష్టిలగ్నగతేవాతనుకే చంద్రే సదాభియుకః పూర్ణేందౌబ
హుసత్రకోవనిసుతేప త్రాణనోజ్ఞానవాన్ - సౌజీవేబహుభోగవాన్భృగు
సుతే దీర్ఘాయురర్కాత్మజే - వాతాంగితమసిధ్వజేప్య నశనీబాలాన్న
భోక్త్రాభవేత్॥ ... ... .. .. .. .. ... ... .. .. ... ...*

ఈశ్లోకార్థము కాలామృతవ్యాఖ్యయందు విశేషముగా వివరింపఁ
బడియున్నదిగనుకనిచ్చటసూక్ష్మముగా దెలియజేయబడెను॥ • *

## నవవస్త్రధారణమ్

శ్లో॥ హస్తోత్తరావాయు పునర్వసుతిష్యమిత్రత్వష్టృద్విదైవవిధివారు
ణపౌష్ణభేషు-రిక్తాః క్రియాళి హరిచాపఝషార్కభౌమవారాన్విహాయనవ
వస్త్రముశంతిధార్యం॥ టీ॥ హస్తోత్తరావాయుపునర్వసుతిష్యమిత్రత్వష్ట్ర
ద్విదైవవిధివారుణపౌష్ణభేషు-హస్త హస్త-యందును ఉత్తరా ఉత్తరోత్తరా
షాఢోత్తరాభాద్రలయందును-వాయు-స్వాతియందును-పునర్వసు-పునర్వసు
నక్షత్రమందును-తిష్యపుష్యమియందును మిత్ర అనూరాధయందును-త్వష్ట్ర
చిత్తయందును-ద్విదైవవిశాఖయందును-విధి-రోహిణియందున-వారుణ-శత
భిషయందును పౌష్ణభేషు- రేవతియందును-రిక్తాః-రిక్తతిథులందున - క్రియాళిహ
రిచాపఝషార్కభౌమవారాన్- క్రియ- మేషమునను-అళివృశ్చికమునను- హ
రిసింహమునను- చాపధనుస్సునను-ఝష మీనమునను-అర్క-ఆదివారమును భౌ
మవారాన్ అంగారకవారమునను విహాయ విడిచిపెట్టి మిగిలినతిథిరాశివా
రములయందునవవస్త్రం నూతనవస్త్రము ధార్యం-ధరింపదగినదియని శంతి
పెద్దలుచెప్పుచున్నారనుట॥ ... ... ... .. .. ... .. ... ...

## కేశఖండనమ్

శ్లో॥ అశ్వీపుష్యపునర్వసూమృగశిరస్స్వాత్యంతవిష్ణుత్రయం చంద్ర
జ్ఞామరపూజ్యశుక్రదినాహితాః పూర్ణాజయాఖ్యాశ్శుభాః పూర్వాహ్ణేశుభల

గ్న హోరాదివసే యుగ్మే చ మాసే శిశోః కేశచ్ఛేదనమిష్టదం మునివరైరు
క్తం వరాహాదిభిః॥ టీ॥ అశ్వి-అశ్వినియు-పుష్య పునర్వసూ-పుష్య పునర్వసు నక్ష
త్రములును-మృగశిరస్స్వాత్యంత ధనిష్ఠాత్రయం మృగశీర్ష-స్వాతి-రేవతి శ్ర
వణ ధనిష్ఠ శతభిషములును-చంద్రజ్ఞామరపూజ్య శుక్ర సహితాః చంద్ర బుధ గు
రు శుక్ర వారములతో గూడిన-పూర్ణాః-పూర్ణతిథులును-జయాఖ్యాః జయతిథులు
ను శుభాః కేశఖండనమునందు శుభకరములైనవియునుం గాక పూర్వాహ్నే
పగటి పూర్వభాగమునందును శుభలగ్న హోరాదివసే శుభగ్రహాధిపత్యము
గల-లగ్న-లగ్నమునందును హోర-హోరయందును దివసే-దినమునందును
యుగ్మే మాసే చ సమ మాసమునందు శిశోః-శిశువునకు-కేశచ్ఛేదనం-కేశఖం
డనము-ఇష్టదం-శుభప్రదంబని-వరాహాదిభిః వరాహమిహిరులు మొదలుగా
గల-మునివరైః ఋషిశ్రేష్ఠులచేత-ఉక్తం చెప్పఁబడినదియనుట॥ ... ... *

అథ కర్ణవేధః.

శ్లో॥ మాసే షష్ఠే సప్తమే వాష్టమే వా వేధ్యౌ కర్ణౌ ద్వాదశే షోడశేహ్ని-మ
ధ్యే వాహ్నః పూర్వభాగే న రాత్రౌ-నక్షత్రే ద్వే ద్వే తిథీ వర్జయిత్వా॥ టీ॥
ద్వాదశే-శిశువు బుట్టిన దినమునకు పండ్రెండవ దివసమునందైనను - షోడశే
హ్ని-పదియారవ దివసమందైనను-అథవా అటుగాకపోయిన-షష్ఠే మాసే-
ఆరవ మాసమందైనను-సప్తమే వా-ఏడవ మాసమునందైనను-అష్టమే వా-ఎ
నిమిదవ మాసమునందైనను మధ్యే వా-మధ్యాహ్నకాలమందైనను-అహ్నః
పూర్వభాగే-అహ్నః-పగటియొక్క-పూర్వభాగే-పూర్వభాగమునందైన
ను-ద్వే నక్షత్రే రెండు నక్షత్రములను - ద్వే తిథీ-రెండు తిథులను - వర్జయి
త్వా విడిచిపెట్టి-అనఁగా [illegible] నక్షత్ర [illegible] మును-శిశోః-శిశువు
యొక్క-కర్ణౌ-చెవులు వేధ్యౌ-కుటవవలెను [illegible] రాత్రౌ-రాత్రి కాలమునందు
నకర్ణవేధనము కూడదనుట॥ ... .. .. .. . .. .. *

శ్లో॥ హరిహరకరచిత్రా సౌమ్య పౌష్ణోత్తరాశ్వి [illegible] ఘటాలీ
సింహలగ్నే వివర్జ్యే- శశిబుధగురుశుక్రాశ్చైవ [illegible]
శుద్ధే నైధనే కర్ణవేధః॥ టీ॥ హరిహరకరచిత్రా సౌమ్య పౌష్ణోత్తరాశ్వి ఇతి
వసుఘ శ్రవణ [illegible] హస్త చిత్రా మృగశీర్ష రేవత్యుత్తరోత్తరాషాఢో
త్తరాభాద్రా పుష్య పునర్వసు ధనిష్ఠా యం [illegible] - ఘటాలీ సింహలగ్నైః
కుంభవృశ్చికసింహ లగ్నములచేత - వివర్జిత విడువఁబడిన యితరలగ్నము

లయందు-శశిబుధగురుశుక్రవారే-సోమబుధగురుశుక్రవారములయందు పర్వరిక్తారహితతిథిషు-పర్వ - పంచపర్వములచేతను రిక్తతిథులచేతను రహిత - వర్జితములైన-తిథిషు ఇతరతిథులయందు నైధనే-కర్ణవేధలగ్నంబునకెనిమిదవస్థానము-శుచేసత్రిగ్రహవర్జితంబగుచుండగానుకర్ణవేధః- కర్ణవేధము-కార్యః చేయదగినది యనుట॥ ... ... ... .. ... .. *

శ్లో॥కర్ణవేధనలగ్నస్య నేష్టాస్సర్వేష్టమేస్థితాః - ఉక్తేనైవవిధానేనకుర్యాత్కర్ణస్యవేధనం- అనుక్తమపికుర్యాచ్చేత్కర్ణచ్ఛేదోభవిష్యతి॥టీ॥కర్ణవేదనలగ్నస్య-కర్ణవేధనలగ్నమునకు-అష్టమే-ఎనిమిదవస్థానమునందు-స్థితాః ఉన్న- సర్వే- సర్వగ్రహములును-నేష్టాఃఇష్టప ములనిచ్చువారుగారు-ఉక్తేనైవవిధానేన-ఈవెనుకజెప్పబడినవిధిచేతనె-కర్ణస్యవేధనం-కర్ణవేధనంబను-కర్మమును-కుర్యాత్ చేయవలయును-అనుక్తమ్-ఈచెప్పబడినవిధికంటె వ్యతిరిక్తముగాను-కుర్యాచ్చేత్ - చేసినను-కర్ణచ్ఛేదః కర్ణ-చెవులయొక్క చ్ఛేదః- తెగిపోవుట-భవిష్యతి-కాగలదనుట॥ ... ... ... ... ... ...*

## చౌలవిధిః

శ్లో॥తృతీయవర్షేవ్యథపంచమేబ్దేగతత్రిభాగే ప్రవదంతిచౌలమ్। ఉదగ్గతేర్కేగురుశుక్రతేజః - ప్రకాశితంవ్యోమ్నిచశుక్లపక్షే॥టీ॥ తృతీయవర్షేపి-మూడవసంవత్సరమునందైనను- అథ- అటుగాకపోయిన పంచమేబ్దే ఐదవసంవత్సరమునందైనను-గతత్రిభాగే త-గడచినట్టి-త్రిభాగే-మూడుభాగములుగలిగిన-పంచమ-సంవత్సరమునందున-అర్కే-సూర్యుడు-ఉదగ్గతేసతి ఉత్తరాయణమును బొందియుండగాను - వ్యోమ్ని- ఆకాశమునందు-గురుశుక్రతేజఃగురుశుక్రులతేజస్సు - ప్రకాశితంసత్ -ప్రకాశించుచునుండగాను - శుక్లపక్షేచశుక్లపక్షమునందు-చౌలమ్ - చౌలకర్మము-కార్యమ్-చేయదగినదియని-ప్రవదంతి చెప్పుచున్నారు॥ ... ... .. ... ... .. ...*

శ్లో॥ఆదిత్యసౌమ్యవసువైష్ణవపౌష్ణతిష్య - త్వాష్ట్రాశ్విచండకిరణేషుదివాప్రశస్తమ్-స్వాతివిధాతృవరుణోత్తరభాంశుమధ్యా - న్యాహుర్నిశాస్వపిన చతుష్కకర్మకార్యమ్॥టీ॥ ఆదిత్యసౌమ్యవసువైష్ణవపౌష్ణతిష్య త్వాష్ట్రాశ్విచండకిరణేషు- ఆదిత్యపునర్వసుయందును-సౌమ్యమృగశిరయందును-వసు-ధనిష్ఠయందును- వైష్ణవ- శ్రవణనక్షత్రమునందును-పౌష్ణ - రేవతియందును-తిష్యపుష్యమియందును-త్వాష్ట్ర-చిత్తయందును-అశ్వి-అశ్వినియందును-చండకిర

శేషు-హస్తయం మృగశిరా వగటియను-చౌలమ్-చౌలము-ప్రశస్తమ్-ప్రశస్తంబైనవి-యానియును-స్వాతీ ధాతృవ శ్రోత్రభాని-స్వాతీరోహిణీశతభిషక్ ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలును ధ్యా చూడాకర్మంబునందు నక్షమనక్షత్రంబులనియు-నిశాస్వపి-రాత్రియందును-చూడాకర్మ చౌలకర్మ మనకార్యమ్-చేయదగినది గాదనియును - ఆహుః పెద్దలు చెప్పిరటను॥ ... *

శ్లో॥ షష్ఠ్యష్టమీప్రతిపద స్తిథయశ్చరిక్తావర్జ్యాశ్చ శశాంకగురుసోమజభార్గవాణాంవారాంశకోదయవిలోకనమిష్టమాహుః చౌరే కర్మణిశుభం నవిశంతిచాన్యే॥ టీ॥ చౌరే చూడాకర్మణి చౌలకర్మమునందైన-షష్ఠ్యష్టమీ ప్రతిపదః-షష్ఠ్యష్టమీప్రతిపత్తులనెడు-తిథయశ్చ-తిథులును-రిక్తాః-రిక్తతిథులును వర్జ్యాః విడువందగినవి-శశాంకగురుసోమజభార్గవాణాం చంద్ర గురు బుధ శుక్రులయొక్క-వారాంశకోదయవిలోకనం-వారవారములును-అంశకఅంశలనన్న ఉదయలగ్నములనన్నవిలోకనమ్ దృష్టులనన్న ఇష్టం అభీష్టఫలంబులనిచ్చువాటినిగా ఆహుః-చెప్పుదురు అన్యే ఇతరములైనపాపగ్రహములయొక్క- వారాంశలగ్నదృష్టులైనశుభమ్ శుభఫలము నవిశంతి ఇవ్వవనియర్థంబనుట॥ ... ... ... . ... . . *

శ్లో॥ కర్కటాంగనామిథునమీనతులోక్షనక్రాః పూజ్యాః క్రియాళిహరిచాపఘటాజఘన్యాః - తేపిస్వవీర్యశుభఖేటయుతా విధేయాచవులేఘటో శుభయుతోపినిషిద్ధ ఏవ॥ టీ॥ చౌలేచూడాకర్మమునందు కర్కట్యంగనామిథునమీనతులోక్షనక్రాః-కర్కాటకకన్యా - మిథునమీనతులావృషభ మకరరాసులుపూజ్యాః - ఉత్తమంబులు - క్రియాళిహరిచాపఘటాః-మేషవృశ్చికసింహధనుః-కుంభరాసులుజఘన్యాః అధమములు తేపి - ఆయధమములైన మేషవృశ్చికసింహధనుఃకుంభ రాసులును-స్వవీర్య - శుభఖేటయుతాశ్చేత్ స్వవీర్యతనయొక్కబలములతోటిన్ని శుభఖేటశుభగ్రహములతోటిన్నియుతాశ్చేత్ గూడుకొనియున్నట్టయితె విధేయా- చేయదగినవి-అయినప్పటికిన్ని ఘట కుంభరాశిశుభయుతోపి-శుభగ్రహసహితంబైనప్పటికిన్ని- నిషిద్ధఏవ చూడాకర్మంబునందు నిషేధింపబడినదియనుట॥ ... . ... ... .. *

శ్లో॥ త్రికోణకేంద్రాయగతేషుసౌమ్యే-ష్వాయారిదుశ్చిక్యచమాత్రితేషుపాపేషునషష్టమకే శిశూనాం చౌలం ప్రశస్తంమునిభిః ప్రదిష్టమ్॥ టీ॥ సౌమ్యేషు సౌమ్యగ్రహములు త్రికోణకేంద్రాయగతేషు సత్సు త్రికో

నాశాంత్యా ఆబృహస్పతిః వయస్యైన పహోమాదిశాంతిచేత- ప్రతిబం
ధకర్మ-ఉపనయన వ్రతము-ప్రశస్తమ్-ప్రసిద్ధంబగును-అనుక్తపక్షే-చెప్ప
బడని-సంవత్సరమునందు సః- ఆబృహస్పతి-బలప్రతోపి బలయుక్తుండైనను-
నైవ-సమర్థుండు గాడు-తయోః-ఆసంవత్సర-బృహస్పతి-బలంబులలోపల అ
బ్దబలం-సంవత్సర-బలము బలీయః-బలవత్తరమైనదియని తెలియవలయుననుట॥

శ్లో॥ జన్మాంత నిధనస్థోపి పూజయా శుభదో గురుః-ఉక్తాబ్దే చేతను క్తేతు న
శుభో బలవానపి॥ టీ॥ ఉక్తాబ్దే - ఉక్తసంవత్సరంబునందు -గురుః-బృహస్పతి-
జన్మాంత్య నిధనస్థోపి వటువుకు జన్మద్వాదశాష్టమ స్థానములయందుండినను
పూజయా-జప హోమ దానాది పూజచేత శుభదః శుభప్రదుండు-భవతి- అ
గుచున్నాడు- అనుక్తే తు-చెప్పంబడని సంవత్సరమునందైన సః ఆబృహస్ప
తి-బలవానపి బలవంతుడైనను- నశుభః - శుభప్రదుడు గాడని తెలియవల
యుననుట॥ .. .. ... ... .. ... . .. ... ... *

శ్లో॥ కోదండకర్కటమీనేష్వస్థితోపి శుభదో గురుః - తద్రాశి భాగసంస్థో
పి శుభదః ప్రోచ్యతే స్వయం॥ టీ॥ గురుః-బృహస్పతి- కోదండకర్కటమీనేషు-ధ
నుః కటకమీన రాసులయందు-స్థితోపి-ఉన్నవాడై చున్న శుభదః-శుభప్రదుం
డు-భవతి-అగుచున్నాడు-సః-ఆబృహస్పతి-స్వయంతాను తద్రాశి భాగసం
స్థోపి-ఆధనుః కటకమీనరాసులయొక్క - అంశలయందున్నవాడైన అశుభదః -
అశుభప్రదుండని ప్రోచ్యతే-చెప్పబడుచున్నాడనుట॥ ... ... ... ...*

శ్లో॥ స్వోచ్చే స్వమిత్రే స్వగృహే త్రికోణే జీవో యద్యుపనీతకాలే-
శిశోశ్చతుర్థే నిధనే త్రిత్యే వ్యోకర్మాంత్యసంస్థోపి శుభప్రదస్స్యాత్॥ టీ॥ ఉప
నీతకాలే ఉపనయనకాలమునందు-జీవః-బృహస్పతి-శిశోః-శిశువుయొక్క-
జన్మరాశికి-చతుర్థే-నాలుగవయింటను-నిధనే - ఎనిమిదయింటను త్రిత్యే-
మూడవయింటను-కర్మాంత్యసంస్థోపి-కర్మ-పదియింటను-అంత్య- పండ్రెండింట
నును-సంస్థోపి-ఉన్నవాడైనను-స్వోచ్చే తన ఉచ్చయందైనను-స్వమిత్రే-త
నమిత్రక్షేత్రమందైనను స్వగృహే-తన-యింటనైనను - త్రికోణే-తనమూ
లత్రికోణమునందైనను-గతోయది-పొందియుండినట్లాయెనా-శుభదః శుభఫ
లంబులనిచ్చువాడు-స్యాత్-అగును॥ ...... ...... ..... *

శ్లో॥ ద్వితీయాచ తృతీయాచ పంచమీ సప్తమీ తథా - త్రయోదశీ చ దశమీ
ప్రశస్తా స్థితయో వ్రతే॥ టీ॥ వ్రతే-ఉపనయన వ్రతమునందు-ద్వితీయా-వి

దియయును తృతీయా తదియయును-పంచమీ-పంచమియును సప్తమీ-సప్తమియును త్రయోదశీచ - త్రయోదశియును-దశమీ-దశమియును-తిథయః- ఈ తిథులు ప్రశస్తాః-ప్రసిద్ధంబులని తెలియవలయుననుట॥ .. ... ... .. *

శ్లో॥ పూర్వపక్షశ్శుభః ప్రోక్తః కృష్ణశ్చాంత్యత్రికం వినా-కృష్ణపక్షేపి తత్త్రింశే త్రయోదశ్యపి కేచన॥టీ॥ వ్రతే-ఉపనయనవ్రతమునందు-పూర్వపక్షః-శుక్లపక్షము-శుభః-శుభకరంబని- ప్రోక్తః - చెప్పబడినది-కృష్ణశ్చ - కృష్ణపక్షమున్ను-అంత్యత్రికం వినా- మూడవపంచకము విడిచి శుభః-శుభప్రదంబగును కేచన - కొందరు గ్రంథకర్తలు - కృష్ణపక్షే - కృష్ణపక్షమందు-తత్త్రింశేపి ఆకృష్ణపక్షపు మూడవపంచకంబునందును త్రయోదశ్యపి త్రయోదశియందును-శుభా-శుభకరంబని చెప్పుచున్నారనుట॥ .. ... .. *

శ్లో॥ ఆపంచమ్యాః తిథయః పరాస్స్యుర్గతినిందితాః త్యాజ్యానధ్యాయదివసాన్ వర్జయేదౌపనాయనే॥టీ॥ ఆపంచమ్యాః-పంచమి మొదలుకొని పరా కృష్ణపక్షసంబంధములైన తిథయః- పదిదినములున్ను అతినిందితాః-మిక్కిలి నిందింపబడినవి-స్యుః అగుచున్నవి-గనుక నాతిథులున్ను నిత్యానధ్యాయదివసాన్ నిత్యనైమిత్తికానధ్యాయదినములనున్ను-ఔపనాయనే-ఉపనయనవ్రతమునందు - వర్జయేత్ త్యజింపవలసినది అనగా నీశ్లోకమందు జెప్పబడిన తిథులను వర్జించి యితరములైన తిథులయందు నుపనయనము సేయదగినదియని తెలియవలయుననుట॥ ... ... ... ... ... ... ... .. ... ...*

అనధ్యాయాః.

శ్లో॥ నైమిత్తికాస్త్వనధ్యాయా ధృతిపాతాగ్నిమీరితాః అష్టమ్యాంచ చతుర్దశ్యాం పూర్ణిమాయాం కుహూతిథౌ - సంధ్యయోర్గర్జితే నైవ స్వాధ్యాయః ప్రతిపత్స్వపి ప్రాక్సంక్రాంతేర్యదా మేఘో-యత్ర గర్జతి వాషరే న వేదాధ్యయనం కార్యం సర్వదైవ మహానిశి॥టీ॥ ధృతిపాతాగ్నిః-ధృతి-నైధృతీనామయోగము-పాతాగ్నిమ్ పాత- వ్యతీపాత మహాపాతలు వీటితో గలసిన దినము యొక్క-అగ్నిః-సగము నైమిత్తికాః నైమిత్తికంబులనేడు - అనధ్యాయాః-అనధ్యాయంబులని - ఈరితాః-చెప్పబడినవి గనుక నైమిత్తికానధ్యాయంబులయందును- అష్టమ్యాంచ-ఉభయాష్టములయందును-చతుర్దశ్యాం ఉభయ-చతుర్దశులయందును పూర్ణిమాయామ్-పున్నమయందును కుహూతిథౌ అమవసయందున్ను సంధ్యయోః సాయం ప్రాతస్సంధ్యల

శ్లో॥ త్రిషష్ఠలాభగో భౌమశ్శశీ వాయది తుంగగః। సర్వదోషచయం హంతి పాపం పంచాక్షరీ యథా॥ టీ॥ త్రిషష్ఠలాభగోయది తృతీయషష్ఠలాభస్థానములను బొందినట్లాయనా-భౌమః-అంగారకుడున్నను గగోయది-ఉచ్చంగతుండైనట్లాయెనా-శశివా-చంద్రుండైనను-సర్వదోషచయం-సకలదోషపుంజములను పంచాక్షరీ-శివపంచాక్షరీమహామంత్రము-పాపంయథా-కిల్బిషమును వలెను-హంతి-కొట్టివేయుచున్నాడు॥ ... ... ... ...*

శ్లో॥ స్వకమిత్రగతో భౌమశ్శశీ వాయది లాభగః। హంతి దోషచయం సర్వం పినాకీ త్రిపురం యథా॥ టీ॥ స్వకమిత్రగతోయది-స్వక్షేత్రమిత్రక్షేత్రగతుండైనను-భౌమః-అంగారకుడున్న - లాభగోయది-లాభస్థానగతుండైనను-శశివా-చంద్రుండైనను-సర్వం-సమస్తంబైన-దోషచయం-దోషసంఘమును-పినాకీ-రుద్రుండు త్రిపురం యథా-త్రిపురాసురులభంగి-హంతి-నశింపజేయుచున్నాడనుట॥ .. ... ... ... ... ... ... ... .. ... *

శ్లో॥ లగ్నాత్త్రిషష్ఠగస్సూర్యస్స్వతుంగస్థో భవేద్యది-నాశయత్యఖిలాన్దోషాంస్స్వోదయాత్తిమిరం యథా॥ టీ॥ లగ్నాత్-ఉపనయనలగ్నముకంటె త్రిషష్ఠగః తృతీయషష్ఠస్థానములను బొందిన-సూర్యః- సూర్యుడు-స్వతుంగస్థః-తనయొక్క-యుచ్చయందుండినవాడు-భవేద్యది - అయినట్లాయెనా-అఖిలాన్ సమస్తములైన-దోషాన్- దోషములను-స్వోదయాత్ - తనయుదయమువల్ల-తిమిరంయథా- చీకటినివలె-నాశయతి-నశింపజేయుచుండునుట॥ *

శ్లో॥ కేంద్రత్రికోణగస్సౌమ్యో మిత్రరాశ్యంశగోయది। పాపకేంద్రకృతాన్దోషాన్హంతిభం కేసరీ యథా॥ టీ॥ కేంద్రత్రికోణగః- కేంద్రత్రికోణములయందుండిన-సౌమ్యః బుధుడు-మిత్రరాశ్యంశగోయది మిత్రక్షేత్రాంశములను బొందినవాడైతే-పాపకేంద్రకృతాన్-పాపగ్రహములు- కేంద్రములనున్నందున జనించిన-దోషము - ఇభం యథా - ఏనుగునువలెనని తెలియవలయుననుట॥ ... ... .. .. ... ... .. ... .. .. .. ...*

శ్లో॥ లగ్నాధిపోవాంశపతిర్బలిష్ఠః కేంద్రత్రికోణత్రిభవేస్థితోపి। లగ్నాస్య కేంద్రేప్యశుభస్థదోషాన్హంతి సౌమ్యైర్యుతవీక్షితో వా॥ టీ॥ లగ్నాధిపో వా - ఉపనయనలగ్నాధిపతియైనను - అంశపతిః-ఉపనయనలగ్ననవాంశాధిపతియైనను-బలిష్ఠః-బలవంతుండై - సౌమ్యైః-శుభగ్రహములతోడంగూడినను జూడంబడినట్లైనను-కేంద్రత్రికోణ కేంద్రకోణములయందు - స్థిత-ఉ

న్నవాఁడై - త్రిభవేష్టితోపి - తృతీయలాభస్థానంబులయందుండినప్పటికిని లగ్నాన్యకేంద్రేష్వశుభదోషాః - లగ్నంబుకంటె నితరంబులైన - కేంద్రంబులయందుఁ బాపగ్రహంబులుండినట్టి దోషంబులనెల్లను - నిహంతి - నశింపఁ జేయుచున్నాఁడనుట॥ ... . ... ... ... . ... ... .. ... ...*

శ్లో॥ విద్యాం పటోర్వ్యనశ్యేతాం మందభౌమౌ ద్వితీయగౌ। అన్యోన్యమ భవాష్టస్థౌ ద్వాదశస్థౌతు బంధనం॥ టీ॥ ద్వితీయగౌ - ఉపనయనలగ్నంబునకు ద్వితీయస్థానంబునవున్న - మందభౌమౌ - శన్యంగారకులు - పటోః - వటువుయొక్క - విద్యాం - విద్యను - వినశ్యేతాం - నశింపఁజేయుచుందురు గనఁ గా వచ్చిన విద్య మఱచిపోవునట్లును - నూతనవిద్య రాకయుండునట్లును జేయుచుందురనుట. తౌ - ఆశన్యంగారకులు. అన్యోన్యం - పరస్పరమున్నొకనితో నొకఁడు - అష్టస్థౌ - అష్టమస్థానగతులైనను. అథవా - అటుగాకపోయినను - ద్వాదశస్థౌతు - పదిరెండవస్థానమందు నుండినవారైనను - బంధనం వటువునకు బందీకరణము మొదలైన యశుభఫలములను జేయుచుందురనుట॥ ... .. ।... .. . *

శ్లో॥ కుజార్కజౌ బంధనదౌ వ్యయస్థౌ విద్యా ప్రదౌ వా ధనబంధుసంస్థౌ। వ్యయస్థమర్కం త్వితి జో విపశ్యన్నాచార్యమంధం కురుతే బలాఢ్యః॥ టీ॥ కుజార్కజౌ - అంగారకశనులు - వ్యయస్థౌ - పండ్రెండవయింటనున్నవారలగుచున్న - బంధనదౌ - వటువునకుఁ గారాగృహప్రవేశము మొదలగునరిష్టములనుగలుగఁజేయువారు - స్యాతాం - అగుచున్నారు - ఇచ్చట స్యాతామను క్రియాపదంబధ్యాహరించుకొనఁదగినది - ధనబంధుసంస్థౌ - ద్వితీయ చతుర్థస్థానంబులనున్నట్టి - తౌ - ఆయంగారకశనులు విద్యాప్రదౌ - వటువునకు సకలవిద్యలనిచ్చువారగుచుందురు - బలాఢ్యః - బలవంతుఁడైన - క్షితిజః - అంగారకుఁడు - వ్యయస్థం - వ్యయస్థానస్థితుండైన - అర్కం - సూర్యుని - విపశ్యన్ - చూచుచున్నవాఁడగుచున్న - ఆచార్యం - తండ్రిని - అంధం గ్రుడ్డివానినిగా - కురుతే - చేయుచున్నాఁడనుట॥ ... ... .. ... .. ... ... ... . . ... . . *

శ్లో॥ వ్యయస్థం రవిమార్కిర్వా స్వదృష్ట్యా యది పశ్యతి। శిష్యవిద్యాం బలీ హన్యాద్విబలీ కోగురుశ్శిశోః॥ టీ॥ బలీ - బలవంతుఁడైన - ఆర్కిర్వా - శనియైనను - వ్యయస్థం - పదిరెండవ యింటనున్న - రవిం - సూర్యుని - స్వదృష్ట్యా - తనతృతీయసప్తమదశమదృష్టులలోపల నేదృష్టిచేతనైన - పశ్యతియది - చూచుచుండినట్లాయెనా - శిష్యవిద్యాం - వటువుయొక్క విద్యను - హన్యాత్ - కొట్టుచుం

యత్నశ్చేనైన-ఇష్టమైనయుత్సవంబులచేత యథా-ఏప్రకారము సాగుచుండునో తథా-ఆప్రకారంబని యూహింపవలయు ననుట॥ ... ... ... *

శ్లో॥ భృగౌమీనేవృషేవాపి జీవే కేంద్రత్రికోణగే- కర్కిచాపఝషే తస్మిన్ యోగశ్శుభతరాహ్వయః॥ టీ॥ భృగౌ-శుక్రుడు-మీనే వృషేవాపి-మీనరాశియందైనను వృషభరాశియందైననుండగాను - జీవే-బృహస్పతి-కేంద్రత్రికోణగే-కేంద్రత్రికోణములయందుండగానైనను-తస్మిన్ ఆబృహస్పతి-కర్కిచాపఝషే-కటకధనుర్మీనరాసులయందుండగానైనను- శుభతరాహ్వయః- అత్యంతశుభంబనియెడు-యోగః-సుయోగము-పటువునకు బుడుచుండుననుట॥ ... ... ... ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ జీవశ్శాప్యేపినాయస్య మౌంజీబంధనలగ్నగః - తస్యవిద్యాప్రభూతాస్యాద్వివాహశ్చాచిరాద్భవేత్ ॥ టీ॥ జీవః-గురుండైనను- శాప్యేపివా-శుక్రుండైనను-యస్య ఎవనియొక్క-మౌంజీబంధనలగ్నగః- వుపనయనలగ్నమును బొందియుండునో-తస్య- వానికి-విద్యా- విద్య-ప్రభూతా-ప్రచురంబైనది-స్యాత్ -అగుననగా విశేషవిద్యలు వచ్చును - అచిరాత్ -శీఘ్రముగా-వివాహశ్చ- పెండ్లియును-భవేత్ -అతిత్వరితముగ-అగుననుట॥ ... *

శ్లో॥ దోషేబలవిహీనేచ గుణేబహుబలైర్యుతే - అపవాదబలైర్దోషప్రధ్వంసాభావకశ్శుభః॥ టీ॥ దోషే-దోషము-బలవిహీనేచ-బలముతక్కువదియగుచునుండగా- గుణేచ-గుణము బహుబలైర్యుతే- బలముగలిగినదియగుచునుండగాను-శుభః-శుభము అపవాదబలైః-విశేషశాస్త్రబలముల చేత-దోషప్రధ్వంసాభావః- దోషముయొక్క-ప్రధ్వంసాభావముగలదియనగా నాశనముగలది- ప్రాగభావంబనియు- ప్రధ్వంసాభావంబనియు నన్యోన్యాభావంబనియు నత్యంతాభావంబనియు నభావంబులు నాలుగువిధంబులు గలవని న్యాయశాస్త్రమునందు జెప్పియున్నదనుట - అనగానే ముహూర్తంబునకైనను దోషస్వల్పతయు గుణాధిక్యము గలిగియున్న పక్షంబునందు సకలదోషంబులు నశించి విశేషశుభములగునని తాత్పర్యము॥ ... ... ... ... ... *

మాతరిగర్భిణ్యాముపనయననిషేధః.

శ్లో॥ కర్తుర్భార్యా గర్భిణీచేద్వాస్తుకర్మోపనాయనం-షణ్మాసాత్పరతస్సోపి నకుర్యాదితిశౌనకః॥ టీ॥ కర్తుః-వుపనయనకర్తయొక్క-భార్యా-జాయ-గర్భిణీచేత్ గర్భవతియైనట్లాయెనా-షణ్మాసాత్పరతః- ఆరుమాసములకుపైనను

సోపి - ఆయజమానుఁడు-వాస్తుకర్మోపనాయనం- గృహానిర్మాణారంభోపనయనములను-నకుర్యాత్ -చేయఁగూడదనిశౌనకమహామునిమతము-అనఁగా వటువుయొక్క-తల్లిగర్భముతోఁడయుండినసారుమాసములకుఁబూర్వముపనయనము సేయవచ్చునుగాక-యా ఋమాసములకుపరమందుపనయనమున్ను వాస్తుకర్మారంభమున్ను సేయఁగూడదనితాత్పర్యము॥ ... ... ... .. ... *

శ్లో॥ రజస్వలే వటోర్మాతా ఇడావాచఁ తతః పురా- నైవోపనయనం కార్యమ్భగతశ్చేచ్ఛుభం జగుః॥ టీ॥ వటోః- శిశువుయొక్క-మాతా-తల్లి ఇడావాచనతః పురా-పుణ్యాహవాచనదేవతాహ్వానములకంటెఁబూర్వమందు - రజస్వలా-బహిష్టురాలైనట్టాయెనా· వుపనయనం- వుపనయనవ్రతము - న కార్యం-చేయదగినదిగాదు-పగతశ్చేత్ -స్వస్తిపుణ్యాహవాచన దేవతాహ్వానములకంటెఁబరమందైన-వుపనయనం-వుపనయనము-శుభం-మంగళప్రదంబని-జగుః- కొందరుపలికిరనుట॥ ...... ...... ...... ...... *

రజస్వలాదోషేపరంగః.

శ్లో॥ అలబ్ధే సుముహూర్తస్య రజోదోషే చ మాతరమ్। స్త్రియం సంపూజ్య తతః కుర్యాన్మౌంజీబంధనముత్తమమ్॥ టీ॥ సుముహూర్తస్య- ఉపనయనముహూర్తంబునకు-రజోదోషే చ-రజస్సంబంధమైనదోషము - అలబ్ధే సంప్రాప్తంబుగాకపోవుచుండగా-మాతరం స్త్రియమ్-తల్లిని-సంపూజ్య- పూజింపజేసి-శిశోః-శిశువునకు-ఉత్తమమ్ శ్రేష్ఠంబైన-మౌంజీబంధనం- ఉపనయనమును-కుర్యాత్ -తండ్రియగువాడు సేయువలయుననుట॥ ...... *

శ్లో॥ శాఖాధిపతివారశ్చ శాఖాధిపబలం శిశోః। శాఖాధిపతిలగ్నంచ దుర్లభం త్రితయం వ్రతే॥ టీ॥ వ్రతే-ఉపనయనవ్రతమునందు- శాఖాధిపతివారశ్చ-స్వశాఖాధిపతియొక్క -వారమును-శాఖాధిపబలం-స్వశాఖాధిపతియొక్క-బలమును- శాఖాధిపతిలగ్నంచ-స్వశాఖాధిపతి గాశియును - త్రితయం -ఈమూడును-శిశోః-శిశువునకు-దుర్లభం - సాధారణంబుగా లభింపదనుట॥

శ్లో॥ న నైధనం నైధనశుద్ధిలగ్నం న నైధనగం న చ తన్నవాంశం। న నైధనైశో న చ వాంత్యకేశో లగ్నే ప్రశస్తం ఖలు రాత్రినాథః॥ టీ॥ నైధనం-వటువుయొక్క- జన్మనక్షత్ర రాశికెనిమిదవలగ్నముగూడదు- నైధనశుద్ధిలగ్నం-వుపనయనలగ్నంబష్టమశుద్ధిగలిగియుండవలసినది- న నైధనగం - నైధనతారగూడదు-నచతన్నవాంశం - ఎనిమిదవనవాంశంబుయుక్తంబుగాదు - న నైధ

వేదారంభః,

శ్లో॥ హస్తాశ్వయుక్శ్రవణపుష్యసమీరమిత్రచిత్రాదితిత్రిపురజేతృజలాసురేషు। శస్తోత్తరామలసమ్యగ్భపౌష్ణభేషు ప్రోక్తం నవశ్రుతిసమాగమనం ద్విజానాం॥ టీ॥ హస్తాశ్వయుక్శ్రవణపుష్యసమీరమిత్రచిత్రాదితిత్రిపురజేతృజలాసురేషు - హస్తాశ్వనీశ్రవణపుష్యస్వాత్యనూరాధాచిత్రాపునర్వసుపూర్వాద్రాత్రిషాఢామూలానక్షత్రములయందును-శస్తోత్తరామలసమ్యగ్భపౌష్ణభేషు-ప్రశస్తంబులైనయుత్తరోత్తరాషాఢోత్తరాభాద్రారోహిణీరేవతులయందును-ద్విజానాం - బ్రాహ్మణులకునవశ్రుతిసమాగమనం-నూతనవేదారంభణము-ప్రోక్తం-చెప్పబడినదియనుట॥ . . *

శ్లో॥ రిక్తాష్టమీపంచదశీనిషిద్ధా త్రయోదశీ సప్తమికా చ మధ్యే। విద్యాగమే యాచితమంత్రిణాం స్యుర్వారోంశయం మధ్యమిందుభాన్వోః॥ టీ॥ యాచితమంత్రిణాం - కోరబడిన వేదమంత్రములుగల బ్రాహ్మణులకు - విద్యాగమే-వేదశాస్త్రాదివిద్యారంభమందు-రిక్తాష్టమీ-చతుర్థీనవమీచతుర్దశ్యష్టములున్ను - పంచదశీ పూర్ణిమయును - నిషిద్ధాః - నిషేధింపఁబడినవియనగానధమంబులనుట- త్రయోదశీ - త్రయోదశియును-సప్తమికాచ-సప్తమియును-మధ్యే-మధ్యమంబులు-స్యాతాం- అగుచున్నవి - ఇందుభాన్వోః - చంద్రసూర్యులయొక్క - వారోంశయాం-వారములున్ను - లగ్నములున్ను - మధ్యమం-మధ్యమంబులనుట॥... ... .. . ... .. ... . . *

శ్లో॥ వేదారంభే స్వస్వభావావశిష్టా వంధ్యాః ప్రోక్తా యే చరా రాశయశ్చ। శుద్ధే రాశౌ నైధనే చాంద్రవారే కుర్యాద్రాజ్ఞస్సర్వవిద్యాసమాప్తిం॥ టీ॥ వేదారంభే- వేదమారంభించుటయందు - స్వస్వభావావశిష్టాః - స్వస్వభావరాసులకంటె ఇతరంబులైనస్థిరరాసులున్ను - యే చరారాశయశ్చ। చరరాసులేవైనాయవియున్ను - వంధ్యాః-నిష్ఫలంబులని - ప్రోక్తా - చెప్పబడినవి-మఱియు-నైధనే రాశౌ - ఎనిమిదవరాశి-శుద్ధేసతి- గ్రహవర్జితంబగుచుండగా-చాంద్రవారే - ఇందువారమునందు-రాజ్ఞః - క్షత్రియునకు-సర్వవిద్యాసమాప్తిం-సకలవిద్యలయొక్క - పరిసమాప్తిని - కుర్యాత్ -చేయవలయుననుట॥ ... ... ... ... ... .. ... ... ... ... ... *

శ్లో॥జన్మయోగశకునాదివిస్తరే గోచరే చ శుభదే వ్రతోషితః। సాంప్రదాయసమయే శుభాన్వితే పాణిపీడనవిధిర్విధీయతే॥ టీ॥ జన్మయోగశకు

నాడీవిస్తరే- జననకాలలగ్నమునందుండు గ్రహసంపత్తియును - శకునములు మొదలైనవియును - గోచరేచ - గోచారమును - శుభదే-శుభదాయకంబగుచునుండగా - గుణాన్వితే- వర్గణసంపన్నంబైన - సాంప్రదాయసమయే సత్సంప్రదాయయుక్తంబగు సమయంబునందు-నృయోషితోః- స్త్రీపురుషులకు-పాణిపీడనవిధిః - వివాహవిధి-విధీయతే- విధింపఁబడుచున్నది॥

శ్లో॥ అర్కేఽకర్కటకన్యకాఘటధనుర్మ్యకేభృగౌమంత్రిణి స్ఫూర్జజ్యోతిషిశీతరోచిషి బలోపేతే పరత్రే తిథౌ। రోహిణ్యుత్తరరేవతీపితృమఘామైత్రేందుహస్తాసు రేష్వారార్కిగజవాసరైశ్చ రహితేష్వుద్వాహకర్మారభేత్॥టీ॥ అర్కే - సూర్యుడు - కర్కటకన్యకాఘట ధనుర్మ్యకేసతి - కటక కన్యాకుంభ ధనూరాసులయందు లేకపోవుచుండగాను - భృగౌ-శుక్రుడును-మంత్రిణిబృహస్పతియును- స్ఫూర్జజ్యోతిషిసతి - ప్రకాశమానంబైన తేజస్సుగల వాగగుచునుండగానున్ను - శీతరోచిషి-చంద్రుఁడు-బలోపేతేపతి-బలవంతుఁడైయుండగానున్ను - పరిక్తేతిథౌ -రిక్తతిథులుగాక నితరములైన-తిథులయందును- రోహిణ్యుత్తరేవతీపితృమఘామైత్రేందుహస్తాసు రేషు- రోహిణ్యుత్తరోత్తరాషాఢోత్తరాభాద్రా రేవతీ - మఘాస్వాత్యనూరాధామృగశీర్షహస్తమూలలయందున- ఆరార్కిగజవాసరైశ్చరహితేషు-అంగారకరవిశనివారాములచేత రహితములైనశుభగ్రహవారములయందును - ఉద్వాహకర్మ - వివాహకర్మము - ఆరభేత్ - ఆరంభింపవలయుననుట॥ ... ... . .. .. ... .. . . ... .*

శ్లో॥ శ్రేష్ఠాస్త్రౌళియమాంగనాఘటధనుర్గోకర్కికంఠీరవా మధ్యాస్స్యాయుతాస్తదుర్గ్వరహితాస్సర్వే వివాహే హితాః- సౌమ్యైః కేంద్రధనాయపుత్రసహితాః స్త్రీపాపవస్థాయగాః పూజ్యాశ్శుక్రగురూమృతాసను శ్చేదౌశుద్ధ్యేస్తత్సపమః॥టీ॥ వివాహే-వివాహమునందు - తౌళియమాంగనాఘటధనుర్గోకర్కికంఠీరవాః-తులామిథునకన్యాకుంభ ధనుర్వృషభకటకసింహరాసులుశ్రేష్ఠాః- ఉత్తమములు-మధ్యాః - శేషించినరాసులు - మధ్యమములు-సర్వే - సమస్తరాసులును - సౌమ్యగ్రహసహితములును - తదాద్యూనాంశహితాః పాపగ్రహవర్జితములును అయినహితా - అష్టంబులైనవి॥ కేంద్రధనాయపుత్రసహితాః-కేంద్ర కేంద్రములయందును-ధనద్వితీయమునందును- ఆయ ఏకాదశస్థానమునందును-పుత్ర-పంచమస్థానమునందును-స

సహితాః-కూడియున్న - సౌమ్యాః - గురుశుక్రబుధపూర్ణచంద్రులును-త్రిషష్ఠాయగాః-తృతీయషష్ఠలాభస్థానములను బొందిన-పాపాః రవ్యంగారకశనిరాహుకేతువులును-పూజ్యాః-పూజింపదగినవియనగా ఇష్టఫలంబుల నిచ్చుచుండుననుట- శుక్రగురూ-శుక్రబృహస్పతులు-సార్కౌ - సూర్యునితో నస్తమించినపుడు - అశుభదాః-శుభములనిచ్చువారు గారు- అనగా గురుశుక్ర మౌఢ్యము గూడదనుట - సప్తమః-వివాహముహూర్తంబున కేడవస్థానము-శుద్ధః-గ్రహవర్జితంబైనది-భవేత్-కావలయుననగా సప్తమశుద్ధియుండవలయుననుట॥

వివాహప్రశ్నః.

శ్లో॥ శుభే దినే దేవవిదం స్వదేశే తాంబూలపుష్పాక్షతపూర్ణపాణిః- కర్తా చ గత్వా ప్రణిపత్య పృచ్ఛేన్నివేద్య తస్మై వరకన్యయోర్భమ్॥ టీ॥ కర్తా చ-వివాహకర్తయగువాడు - తాంబూలపుష్పాక్షతపూర్ణపాణిః - తాంబూలపుష్పాక్షతలచేత నిండింపబడినహస్తములుగలవాడై శుభే దినే చంద్రతారాబలాన్వితంబైన పంచాంగశుద్ధదినంబునందు- అక్షిజ్ఞమ్ తెలిసినట్టి - దైవవిదం- జ్యోతిషునిగూర్చి - గత్వా - సమీపంబునకుబోయి- ప్రణిపత్య-నమస్కరించి-తస్మై- ఆజ్యోతిషికునికొరకు వరకన్యయోర్భమ్- పెండ్లికొమార్తె- పెండ్లికుమారులయొక్క-జన్మనక్షత్రములను-నివేద్య ఎఱింగించి-పృచ్ఛేత్-ఫలంబడుగవలయుననుట॥ ... ... ... ... ... ... ... ... ... ... ... *

గోత్రవర్జనమ్.

శ్లో॥ స్వగోత్రప్రవరోపేతా హీనాధికకులోద్భవా-కన్యా వయోధికా నేష్టా దుర్లక్షణగుణాన్వితా॥ టీ॥ స్వగోత్రప్రవరోపేతా-వరునియొక్క-గోత్ర ప్రవరలతోగూడినట్టియు హీనాధికకులోద్భవా - ఎక్కువతక్కువకులమునందుబుట్టినదియు దుర్లక్షణగుణాన్వితా - దుష్టలక్షణదుష్టగుణములతో గూడినట్టియు - వయోధికా - వరునికంటె నధికవయస్సుగల-కన్యా - కన్యక-నేష్టా-వివాహంబునకు విహితంబైనదిగాదని తెలియవలయుననుట॥ ... ... ... *

శ్లో॥ కులం చ శీలం చ వపుర్వయశ్చ విద్యాం చ విత్తం చ సనాథతాం చ-ఏతాన్ గుణాంత్సప్త పరీక్ష్య దేయా కన్యా బుధైః శేషమచింతనీయమ్॥ టీ॥ కులం-వంశమును-శీలం చ- స్వభావసదాచారసంపత్తిని-వపుః- శరీరసౌష్ఠవసౌందర్యమును-వయశ్చ - వయస్సును-విద్యాం చ- వేదశాస్త్రా... లనము-విత్తం చ-భాగ్యమును-సనాథతాం చ-సామర్థ్యమును- ఏతాన్- ఈ

చెప్పిన-సర్వ-ఏవైన-గుణాగుణ-లక్షణములను-పరిత్యజ్య-పరిశీలించి-బుధైః-తెలిసినవారిచేత-కన్యాః-కన్యకల-దేయాః-వరులకొఱకివ్వఁదగినవారలగుదురు-శేషమ్-కులశీలాదిసద్గుణంబులకంటె నితరంబేమియును అచింతనీయమ్-విచారింపదగినది గాదు-అనగాఁ గన్యాదాతయగువాఁడు తనకొమార్తెను వరునకిచ్చి వివాహము సేయు నెడల ముందుగా వరునియొక్క-కులశీలాదులను జక్కగా విచారించుకొనియనంతరమున దుద వివాహము చేయవలయునని యభిప్రాయము

జన్మతారానామతారాకథనము.

శ్లో॥ దంపత్యోర్జన్మతారాభ్యాం నామతారాభ్యామథాపివా స్త్రీజన్మతారాపూర్వాభ్యామ్ప్రాజ్ఞైర్జ్ఞేయశ్శుభాశుభం. టీ॥ ప్రాజ్ఞైః-తెలిసిన జ్యోతిషికులచే-స్త్రీజన్మతారాపూర్వాభ్యాం-కన్యాజన్మనక్షత్రముపూర్వముగఁగలిగిన-దంపత్యోః-కన్యావరులయొక్క-జన్మతారాభ్యామ్-జననకాలనక్షత్రములచేతనైనను-అథాపివా-అటుగాకపోయినను నామతారాభ్యాం నామనక్షత్రములచేతనైనను-శుభాశుభమ్-శుభాశుభఫలములను-బ్రూయాత్-చెప్పవలయుననుట॥ ... .. . ... ... ... . ... ...*

శ్లో॥ జన్మధిష్ణ్యభవనోద్భవమ్ఫలం కామినీపురుషయోర్విచింతయేత్-జన్మధిష్ణ్యభవనానభిజ్ఞయా నామతోఖిలమిదంవిచింతయేత్ ॥టీ॥ కామినీపురుషయోః-స్త్రీపురుషులకు జన్మధిష్ణ్యభవనోద్భవమ్-జన్మనక్షత్రజన్మరాసులవలననుత్పన్నంబైన-ఫలమ్-శుభాశుభఫలమును-విచింతయేత్-విచారింపవలయును-జన్మధిష్ణ్యభవనానభిజ్ఞయా-జన్మనక్షత్రజన్మరాసులు దెలియకపోవుటచేత నామతః నామనక్షత్రప్రకారముగా-అఖిలమ్-సమస్తంబైన-ఇదమ్-పూర్వోక్తంబగు శుభాశుభంబగు ఫలంబును-విచింతయేత్ విమర్శింపవలయుననుట॥ ... ... .. ... ... .. ... . . ...*

శ్లో॥ అజ్ఞాతజన్మనాంనౄణాంనామభమ్పరికల్పయేత్-తేనైవచింతయేత్సర్వంరాశికూటాదిజన్మవత్ ॥టీ॥ అజ్ఞాతజన్మనామ్-తెలియఁబడనిజన్మనక్షత్రముగల-నౄణామ్ మనుష్యులకు నామభమ్-నామనక్షత్రంబును పరికల్పయేత్-కల్పింపవలయు తేనైవ-ఆనామనక్షత్రముచేతనె సర్వమ్-సమస్తమైన రాశికూటాది-రాశిగ్రహకూటాదికమును-జన్మవత్-జన్మనక్షత్రమువలె-చింతయేత్ విచారింపవలయుననుట॥ .. ... ... ... *

శ్లో॥ జన్మనాజన్మనక్షత్రనామ్నా నామైవకారయేత్ . ఉభయస్యైవహీ

నంచేత్పుంజన్మ స్త్రీనామతః॥టీ॥జన్మనా-పురుషుని జన్మనక్షత్రముతోడ జన్మ-స్త్రీజన్మనక్షత్రమును-పరీక్షింప - వేయవలయును-నామ్నా - పురుషుని నామనక్షత్రంబుతోడ-నామైవ-స్త్రీనామనక్షత్రము నె-కారయేత్-చేయఁదగును - అనఁగాఁబురుషునకుఁజన్మనక్షత్రముండినతైన స్త్రీకిని జన్మనక్షత్రమునుబట్టియు పురుషునకుఁజన్మనక్షత్రములేక - నామనక్షత్రంబైన స్త్రీకిని నామనక్షత్రముఁబట్టియే విచారింపవలయునని తాత్పర్యము - ఉభయం స్త్రీపురుషులయొక్క-జన్మనామనక్షత్రములు రెండును-బలహీనంచేత్ బలములేనివియైనపక్షమునందు - పుంజన్మ స్త్రీనామతః పురుషునిజన్మనక్షత్రమును స్త్రీనామనక్షత్రమునుఁబట్టి ఫలము విచారింపదగినదియనుట॥ ... ...*

ఏకనక్షత్రవివాహః.

శ్లో॥ రోహిణ్యార్ద్రామఘైంద్రాగ్నితిష్యశ్రవణపౌష్ణభమ్ - అహిర్బుధ్న్యస్తథాష్టావనక్షత్రైక్యేశుభావహాః॥ టీ॥ రోహిణ్యార్ద్రామఘైంద్రాగ్నితిష్యశ్రవణపౌష్ణభమ్ - రోహిణ్యార్ద్రామఘావిశాఖపుష్యశ్రవణ-రేవతులును - తథా - ఆప్రకారముగానే - ఆహిర్బుధ్న్యః - ఉత్తరాభాద్రయును. అష్టౌచ - ఈయెనిమిదినక్షత్రములును-నక్షత్రైక్యే- స్త్రీపురుషులయేకనక్షత్రమునందు శుభావహాః శుభసంపాదకంబులగుచుండునను॥

శ్లో॥ అశ్వినీచయమస్వాతీపూర్వాఫాల్గునమేవచ-మైత్రవారుణమూలాఖ్యాంనక్షత్రైక్యేపిమధ్యమా॥టీ॥ అశ్వినిచ - అశ్వినియును-యమస్వాతీ-పూర్వాఫాల్గునమేవచ - భరణిస్వాత్యాశ్లేషాపూర్వఫల్గునులును - మైత్రవారుణమూలాఖ్యమ్ అనూరాధాశతభిషమూలలును - ఏతే - యీయెనిమిదినక్షత్రములునక్షత్రైక్యేపి స్త్రీపురుషులకు నక్షత్రైక్యమునందు - మధ్యమాః. మధ్యమంబులైనవియనుట॥ . .. ... ... ... .. ...*

శ్లో॥ అజైకపాచ్ఛ్రవిష్ఠాచపునర్వస్వధకృత్తికా-మృగశీర్షంచచిత్రాచసవితోత్తరఫల్గునీ-జ్యేష్ఠాచవిశ్వతోయంచనక్షత్రైక్యేవినశ్యతి - ఏకరాశౌపృథగ్ధిష్ణ్యేచోత్తమస్యాన్నాశీబీడనం॥టీ॥ అజైకపాత్-పూర్వాభాద్రయును-శ్రవిష్ఠాచ-ధనిష్ఠయును పునర్వసుఁవును-అథ-పిమ్మట- కృత్తికా-కృత్తికయును మృగశీర్షంచ-మృగశీర్షయును-చిత్రాచ- చిత్తయును-సవితా- హస్తయును-ఉత్తరఫల్గునీ-ఉత్తరయును-జ్యేష్ఠాచ-జ్యేష్ఠయును - విశ్వతోయం-పూర్వాషాఢోత్తరాషాఢలునునక్షత్రైక్యే - యీనక్షత్రములయొక్క - ఏ

కత్వమునందు-వినశ్యతి-కన్యావరులకు నాశనము సంభవించుచున్నది - ఏక
రాశౌ-ఒక రాశియందును పృథగ్ధిష్ణ్యేచ - భిన్ననక్షత్రములయందును-పా
ణిపీడనమ్-వివాహము-ఉత్తమమ్-ఉత్తమంబైనదియనుట॥ ... ... . *

శ్లో॥ రాశ్యైక్యేచేద్భిన్నమృక్షంద్వయోస్స్యాన్నక్షత్రైక్యే రాశియుగ్మంతథైవ - నాడీదోషో నోగణానాంచదోషో నక్షత్రైక్యే భిన్నపాదశ్శుభస్స్యాత్ ॥టీ॥ ద్వయోః - దంపతులకు-రాశ్యైక్యే ఏకరాశిత్వమునందు-భిన్నమృక్షమ్-నక్షత్రభేదము-స్యాచ్చేత్ - ఐనను-తథైవ- ఆ ప్రకారమైన నక్షత్రైక్యే - ఏకనక్షత్రమునందు రాశియుగ్మమ్-రాశిభేదము-స్యాచ్చేత్ - ఐనను-నాడీదోషః-నాడీదోషమును-గణానాంచదోషః-గణదోషమును-న- లేదు-నక్షత్రైక్యే - ఏకనక్షత్రంబునందు-భిన్నపాదః-పాదభేదము-శుభః - వివాహమందు శుభకరంబైనది-స్యాత్ -అగునను‌ట॥ ... .. .. .. .. *

గ్రంథాంతరే.

శ్లో॥ ఏకర్క్షేచైకపాదేషు వివాహః ప్రాణహానిదః - దంపత్యోరేకనక్షత్రే భిన్నపాదే శుభావహః॥టీ॥ ఏకర్క్షేచ - ఏకనక్షత్రమందు - ఏకపాదేషు - ఒకపాదమందైనను వివాహః ఉద్వాహము - ప్రాణహానిదః- ప్రాణనాశకరంబైనది-దంపత్యోః-వధూవరులకు-ఏకనక్షత్రే - ఒకనక్షత్రమందు-భిన్నపాదేషు పాదభేదమందైన- వివాహః- వివాహము- శుభావహః-శుభమును సంపాదించునదియనుట॥ ... . . . .. .. ... . *

గ్రంథాంతరే.

శ్లో॥వారుణాక్షేమరుద్ద్రవహ్న్యపశ్చపిథుఃపితా - ఏషు స్త్రీపూర్వపత్న్యేపి రాశ్యైక్యేన దోషభాక్॥టీ॥ వారుణాక్షే మరుద్ద్రవహ్న్యపః-శతతారా హస్తాస్వాత్యశ్వనీకృత్తికా - పూర్వాషాఢలను - విధుః- మృగశీర్షమును-పితామఖయును-ఏషు-ఈనక్షత్రములయందు స్త్రీ - చిన్నది-పూర్వపత్న్యేపి- పూర్వపాదమునం బొందియున్నను-రాశ్యైక్యే - ఏకరాశిత్వంబునందు-వివాహః-ఉద్వాహము-నదోషభాక్-దోషాకరంబైనదిగానట॥

శ్లో॥యుగ్మపాదేచధిష్ణ్యేతునరః పూర్వార్ధగోజనః - అపరార్ధోద్భవానారీచైకర్క్షేపి శుభావహా॥టీ॥ వరః-పెండ్లికుమారుండు - ధిష్ణ్యేతు-ఏకనక్షత్రమందైనను యుగ్మపాదేవ - భిన్నపాదమునందును- పూర్వార్ధగోచరడి-పూర్వార్థమును బొందినట్లాయెనా-నారీచ-స్త్రీయును - అపరార్ధో

వాయుని-ఉత్తరార్ధమునుబొందినట్లాయెనా జయః - విజయముగలుగుచు న్నగి-గనుక - ఏవమేపి- స్త్రీపురుషులకుభయులకు నొకనక్షత్రంబైనను- వివాహః-పెండ్లి శుభావహః-శుభకరంబైనదియనుట॥ ... ... ... ...*

## ఏకతారానక్షత్రమ్.

శ్లో॥ ఏకరాశౌద్విభనక్షత్రే పుంతారా ప్రథమాభవేత్ - అతీవశోభనం ప్రోక్తం స్త్రీతారాచేద్వినాశనం॥ టీ॥ ఏకరాశౌ-ఒకరాశియందు-ద్విభనక్షత్రే-రెండునక్షత్రములయందు పుంతారా-పురుషునినక్షత్రము - ప్రథమా భవేచ్చేత్ మొదటిదయాయెనా- అతీవ మిక్కిలి-శోభనమ్ శుభంబు-ప్రోక్తమ్ చెప్పంబడినది- స్త్రీతారాచేత్ - స్త్రీనక్షత్రము మొదటిదియైనను వినాశనం-అశుభఫలము సంభవించుననుట॥ ... ... ... ... ... ... ...*

## నామాంశమ్.

శ్లో॥ శుభనాంశైక్యతుద్వాహే దంపత్యోర్నామతారకే - గ్రామసంగ్రామసేనాసు సమాంశశ్శుభనిదః॥ టీ॥ ఉద్వాహే-వివాహమందును-దంపత్యోః-కన్యావరులకు నామతారకే- నామనక్షత్రమందు-అంశైక్యం అంశంబొకటియగుట - శుభం- మంగళకరంబు - గ్రామసంగ్రామసేనాసు- గ్రామ- గ్రామప్రవేశమందును-సంగ్రామయుద్ధమందును- సేనాసు-గాజసేనాకలయందును-సమాంశం-ఏకాంశమును-అశుభకరః-అశుభకరంబైనదానిగా-పెద్దలుచెప్పుచున్నారనుట॥ ... .. ... ... ... ...*

శ్లో॥ విరుద్ధే రాశినక్షత్రే భవేతామపి చేత్తదా - దంపత్యోః ప్రీతయేన్యానాం నామాంత్యైక్యమపేక్షతే॥ టీ॥ దంపత్యోః దంపతులయొక్క - రాశినక్షత్రేపి- రాశినక్షత్రములును- విరుద్ధే విరోధాక్రాంతంబులైనవి- భవేతాం చేత్-అయినట్లాయెనా-తదా-ఆసమయంబున అథ అటుతర్వాత-న్యానామ్ మనుష్యులకు- ప్రీతయే-ప్రియముకొఱకు-నామాంత్యకరమ్- వరునియొక్క నామధేయమును-అపేక్షించవలయుననుట॥ ... ... ... ... ... ... *

## గ్రంథాంతరే.

శ్లో॥ దంపత్యోరేకనక్షత్రే స్వపదైక్యే న్మృతిర్భవేత్ - త్రిపదైక్యే గవోత్పత్తిః శ్చతుష్పాదే శుభావహః॥ టీ॥ దంపత్యోః జాయాపతులకు- ఏకనక్షత్రే ఒకనక్షత్రవిషయమైనపాదైక్యే- స్వపాదైకనక్షత్రమునందు-మృతిః మరణము భవేత్-అగును- త్రిపదైక్యే-త్రిపాదనక్షత్రమునందు-గవోత్పత్తిః-గోయా

పంబైనపలంబులుకలుగును-చతుష్పాదే- నాలుగుపాదములుగల నక్షత్రమందు-
వివాహంకి- వివాహము - తంస్థాపహం-శుభమును సంపాదింగు చుండ నగును
రెండుగవలయునుటు॥

కన్యాయానామాంతర ప్రకరణం

శ్లో॥ పంచత్వక్పితసర్షపాన్వితజలంకుంభస్థితం నూతనంబియా ద్వాశ్వత్థ
దళైర్వివాహసమయేసంప్రోక్షణంకల్పయేత్ - కన్యాయాస్తదనంతరం ద్వ
జవరస్త్రపుత్ర్యాంగనాపూర్వోక్తిమ్పరిహృత్య మంగళకరంనామాం
తరప్రతిష్టాపయేత్ ॥ టీ॥వివాహసమయే-వివాహము శేయునపుడు- ద్విజవరః-
బ్రాహ్మణోత్తముండు- నూతనం- క్రొత్తదియైనట్టిన్ని- కుంభస్థితం- కలశం
బులనున్నట్టి-పంచత్వక్పితసర్షపాన్వితజలం-పంచత్వక్- పంచ్వక్కనామడి పేరే
ఱురావి జువ్వి పువ్వుల యొక - చర్మములతో టిన్ని-సితసర్షప- తెల్లనియావ
గింజలతోటిన్ని -అన్వితం- గూడినజలం - ఉదకము  దూర్వాశ్వత్థదళైః-
గరికరావిచిగుళ్ళచేత-కన్యాయాః- కన్యకకు-సంప్రోక్షణం - ప్రోక్షించుట
ను-కల్పయేత్ -కల్పింపవలసినది- తదనంతరం - జలసంప్రోక్షణానంతరంబు
న- పుత్ర్యాంగనా- ఒక బ్రాహ్మణము త్తైబువ- తస్యాశ్చ-ఆకన్యకను - పూ
ర్వోక్తం పూర్వమందుంచినసామమును-పరిహృత్య-ప త్యజించి- మంగళక
రం- శుభకరంబగు - నామాంతరం - మరియొకపేరును -ప్రతిష్టాపయేత్ - పెట్ట
వలయునుటు॥

గండతర్ణజాతవివాహం.

శ్లో॥మూలజాశ్వశురంహంతివ్యాళజాచతగంగనామ్ । జ్యేష్ఠజా భావు
కంహంతిదేవరంతుద్విశాఖజా॥టీ॥ మూలజా-మూలానక్షత్రమందుబుట్టినక
న్యక- శ్వశురం నామను-హంతి - కొట్టుచున్నది- వ్యాళజా - ఆశ్లేషానక్షత్ర
మందుజనించినపహ చు-తగంగతాం- అత్తమున్ను - జ్యేష్ఠజా-జ్యేష్ఠానక్షత్ర
మందుదయించిన న్యక భావుకం - భావనున్ను-ద్విశైవజా - విశాఖా నక్షత్ర
మందుబుట్టినస్త్రీ దేవరం - మరిదినిన్ని-హంతి - కొట్టుచున్నదియనుట॥

శ్లో॥మూలాశ్లేషావిశాఖామూహేంద్ర చోద్భవాః పుమాః । నదోషకృ
ద్వివాహేచస్త్రియశ్చేతేషునద్ధతాః॥టీ॥మూలాశ్లేషావిశాఖాను- మూలా
శ్లేషవిశాఖలయందున్ను మాహేంద్రేచ-జ్యేష్ఠానక్షత్రమందును - ఉద్భ
వాః- సుట్టిన- పుమాః-పురుషులందు-వివాహే-వివాహమందు-నదోషకృత్-

దోషమును- జేయునాఁడు గాదు- ఏతేషు- ఈచెప్పినతృతీయములయందు బుట్టిన- స్త్రియశ్చ- స్త్రీలైతే- వర్జితాః- వివాహమందు విడువఁబడుచుండును తెలియవలయుననుట॥ .. . . *

## గ్రంథాంతరే.

శ్లో॥ తులాయుక్తేద్విదైవత్యే జాతా నారీ న దోషభాక్। కార్తీయుక్తే వైశ్చికే జాతా హంతి తస్త్రైనచ॥ టీ॥ తులాయుక్తే- తులారాశియుక్తంబగు- ద్విదైవత్యే- విశాఖానక్షత్రమందు- జాతా- జనించిన నారీ- కన్యక- న దోషభాక్ దోషముఁ బొందునది గాదు- తథైవచ- ఆప్రకారమే- కార్తీయుక్తే- వృశ్చికరాశిసహితంబైన- ద్విదైవత్యే- విశాఖయందు- జాతా- పుట్టినకన్నియ- దోషం- మరిదిని- హంతి- చంపుచున్నదియనుట॥ . . ... *

## ద్వాదశకూటాః.

శ్లో॥ దినం గణంచ మాహేంద్రం స్త్రీదీర్ఘం యోనిరేవచ। రాశీరాశ్యధిపోవశ్యో రజ్జుర్వేధాస్తథాదశ। పునశ్చవర్ణకూటంచ నాడీకూటం ప్రశస్యతే ఏతే ద్వాదశకేటాఖ్యాః కూటిభేదాః ప్రకీర్తితాః॥ టీ॥ దినం- దినంబను కూటంబును- గణంచ- గణంబను కూటంబును- మాహేంద్రం- మాహేంద్రంబను కూటంబును- స్త్రీదీర్ఘం- కన్యాదూరంబను కూటంబును- యోనిరేవ- యోనియను కూటంబును- రాశిః- రాశియను కూటంబును- రాశ్యధిపః- రాశ్యధిపంబను కూటంబును- వశ్యః- వశ్యంబను కూటంబును- రజ్జుః- రజ్జువనెడు కూటంబును- వేధా- వేధయను కూటంబును- తథా- ఆప్రకారంబు- దశ- పదికూటములున్ను- పునశ్చ- మరియు- వర్ణకూటంచ- వర్ణంబను కూటంబును- నాడీకూటం- నాడీకూటంబును- ప్రశస్యతే- వేఱువేఱుగా ప్రశంసింపఁబడుచున్నది- ఏతే- ఈచెప్పినవి- ద్వాదశకూటాః- పండ్రెండు పొంతనంబులు- స్యుః- అగుచున్నవి- కూటభేదాః- మరికొన్ని పొంతనభేదములున్ను- ప్రకీర్తితాః- గ్రంథాంతరములందు చెప్పఁబడియున్నవియనుట॥ ... . ... *

శ్లో॥ రాశికూటాదికం సర్వం స్త్రీముఖాదారభ్య చింతయేత్। పుంభాత్తారావిశుద్ధిస్స్యాన్నాడీం రజ్జుం సదప్రభాత్॥ టీ॥ స్త్రీముఖాదారభ్య- స్త్రీనక్షత్రము మొదలుకొని- పుంభాత్- పురుషనక్షత్రపర్యంతమును- సర్వం- సమస్తంబైన- రాశికూటాదికం- రాశికూటంబు మొదలగు పొంతనములను- చింతయేత్- విచారింపవలసినది- నాడీ- నాడీయనుపొంతనమున్ను- రజ్జుంచ- రజ్జువనెడు

సాంతవమున్న - దస్రభాత్ - అశ్వనీనక్షత్రమువల్లనుండి - తారావిశుద్ధిః - నక్షత్రశోధనముగలది - స్యాత్ - అగుననుట॥ .. . ... *

శ్లో॥ గ్రహమైత్రం రాశికూటం తారానాడీవిశేషతః। సర్వేషామేవ వర్ణానామవశ్యం గణకూటకమ్ ॥ టీ॥ సర్వేషామేవవర్ణానాం - సకలవర్ణములవారి కిన్ని - గ్రహమైత్రం - గ్రహమైత్రియును - రాశికూటం - రాశిసాంతవమున్ను తారా - తారాబలమున్ను - నాడీ - నాడీసాంతనమున్ను - గణకూటకం - గణకూటకమున్ను - విశేషతః - విశేషంబుగా - అవశ్యం - అవశ్యకంబుగా విచారింపవలయుననుట॥ .. . . . .. *

శ్లో॥ గ్రహమైత్రం ద్విజాతీనాం తు క్షత్రియాణాం గణస్తథా। కన్యాదూరం తు వైశ్యానాం శూద్రాణాం యోనిరేవ చ॥ టీ॥ ద్విజాతీనాం - బ్రాహ్మణులకు గ్రహమైత్రం - గ్రహమైత్రియును - తథా - ఆప్రకారము - క్షత్రియాణాం క్షత్రియులకు - గణః - గణకూటమును - వైశ్యానాంతు - మూడవకులమువారికైతే - కన్యాదూరం - స్త్రీదీర్ఘమును - శూద్రాణాం - నాల్గవజాతివారికి - యోనిరేవ చ - యోనియును - సాంతనమున్ను - అవశ్యం - ముఖ్యంబుగా జూడందగినదియనుట॥ ... ... ... ... ... . *

## దినకూటమ్.

శ్లో॥ కన్యాయావరఋక్షాంతం గణయేన్నవసంఖ్యయా। సమాంత్యే తారకం శ్రేష్ఠం దినకూటం ప్రశస్యతే ॥ టీ॥ కన్యాయావరఋక్షాంతం - స్త్రీనక్షత్రము మొదలుకొని పురుషునక్షత్రపర్యంతమున్ను - నవసంఖ్యయా - తొమ్మిదింటిచేత గణయేత్ - ఎంచవలసినది - ఆప్రకారంబెంచగా దినకూటం - దినసాంతనము - సమాంత్యే తారకం - సమంబైన అంత్యంబైనవరనక్షత్రముగలిగినట్లాయెనా - అనగా - స్త్రీతారకుపురుషతార రెండునాలుగాఱు తొమ్మిదాయెనా శ్రేష్ఠం - ఉత్తమంబని - ప్రశస్యతే - ప్రశంసింపబడుచున్నదియనుట॥ *

## గణకూటమ్.

శ్లో॥ పునర్వసుద్వయం స్వాతీకరశ్రవణతారకే। పౌష్ణమైత్రేందునప్రాఖ్యాస్తారా దేవగణాస్స్మృతాః॥ టీ॥ పునర్వసుద్వయం - పునర్వసుపుష్యములున్ను - స్వాతీ - స్వాతీనక్షత్రమును - కరశ్రవణతారకే - హస్తశ్రవణనక్షత్రములున్ను - పౌష్ణమైత్రేందునప్రాఖ్యాః - రేవత్యనూరాధామృగశీర్షాశ్వినులనెడుపేరుగల తారాః - నక్షత్రములున్ను - దేవగణాః - దేవతాగణంబులని - స్మృతాః - స్మరింపబడుచున్నవనుట॥ .... ...... *

శ్లో॥ రోహిణీ త్రీణిపూర్వాణి భరణీ రౌద్రమేవచ। త్రీణ్యుత్తరాణ్యపి జ్ఞేయా మానుషాః పరికీర్తితాః॥ టీ॥ రోహిణీ- రోహిణీయును- త్రీణిపూర్వాణి- పుబ్బపూర్వాషాఢా పూర్వాభాద్రలును- భరణీ- భరణియును- రౌద్రమేవచ - ఆర్ద్రానక్షత్రమును- త్రీణ్యుత్తరాణ్యపి ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలును- మానుషాః- మానవగణంబులని- పరికీర్తితాః - చెప్పబడినవియై - విజ్ఞేయాః- తెలుసుకొనతగినవియనుట॥ .. ... *

శ్లో॥ అగ్నిసార్పమఖాచిత్రాస్వాశైవేంద్రాశ్చమూలభం। శ్రవిష్ఠావారుణంచైవ రాక్షసాఖ్యాగణాస్మృతాః॥ టీ॥ అగ్నిసార్పమఖాచిత్రాస్వాశైవేంద్రాశ్చ - కృత్తికాశ్లేషామఖాచిత్రావిశాఖాజ్యేష్ఠానక్షత్రములును - మూలభం- మూలయును- శ్రవిష్ఠా - వారుణంచైవ- ధనిష్ఠాశతభిషములును- రాక్షసాఖ్యాః- రాక్షసంబులనెడు పేరుగల- గణాః- గణంబులని స్మృతాః- స్మరింపబడినవియనుట॥ ... ... .. .. .. . *

శ్లో॥ స్వగణంచోత్తమంవిద్యాన్మధ్యమందైవమానుషమ్। అధమంరాక్షసందైవం మృత్యుర్మానవరాక్షసం। స్త్రీరాక్షసంనకర్తవ్యం కర్తవ్యంనరరాక్షసమ్॥ టీ॥ స్వగణంచ - స్త్రీపురుషనక్షత్రంబులు రెండు నొకగణమందైనట్టైతే- ఉత్తమం- శ్రేష్ఠంబైనదానినిగా- విద్యాత్ - యెరుంగవలయును - దైవమానుషం- స్త్రీపురుషనక్షత్రంబులలో నొకనక్షత్రంబు దైవగణమును - ఒకనక్షత్రం మానవగణమునైనట్లైతే మధ్యమం- మధ్యంబైనదానినిగానున్ను - రాక్షసం - రాక్షసగణమును - దైవం- దేవగణమును - అధమం- నికృష్టంబైనదానినిగానున్ను - విద్యాత్ - తెలియవలసినది- యిదియునుంగాక - మానుషరాక్షసం- మానవరాక్షసగణంబులైనను- మృత్యుః- మరణము సంభవించుననియు - స్త్రీరాక్షసం- స్త్రీనక్షత్రము రాక్షసగణంబైనను- నకర్తవ్యం- చేయదగినది గాదనియును- నరరాక్షసం- పురుషనక్షత్రము రాక్షసగణంబైనను కర్తవ్యం- చేయదగినదియనియును- విద్యాత్ - ఎరుంగవలయుననుట॥ *

మాహేంద్రకూటమ్.

శ్లో॥ వధ్వాదీనాంచతుస్సప్తదశమంచత్రయోదశం। షోడశైకోనవింశంచద్వావింశం పంచవింశతిః। ఏతేమాహేంద్రయోగాస్స్యుర్వివాహే ప్రశస్యతే॥ టీ॥ వధ్వాదీనా- స్త్రీనక్షత్రము మొదలుగాగల నక్షత్రంబులలో పది- చతుః- నాలుగవనక్షత్రమున్ను - సప్త- యేడవనక్షత్రము - దశమం- ప

గీ॥ షష్టమంగ - వివాహః-వివాహము - మధ్యమః-మధ్యమంబై-మతః-సమ్మ
తంబైనది-పుంసాం పురుషతారలకు-పుంభిశ్చ-పురుషతారలతోడ-సంయో
గః-సంబంధము-సదా- ఎప్పుడును-శత్రుత్వం- సంపత్తునైత్యమును - ఆ
పుష్ణియాత్ -పొందింపుచున్నదియనుట॥ ... ... *

శ్లో॥ గోవ్యాఘ్రంగజసింహమశ్వమహిషంశ్వైణంచబభ్రూరగం వై
రంవానరమేషకంచసుమహత్తత్స్వర్భిడాలోన్దురం - లోకానాం వ్యవహార
తోన్యదపిచజ్ఞాత్వాప్రయత్నాదిదం దంపత్యోర్నృపభృత్యయోరపివిరావ
ర్జ్యంశుభంస్యాదితి॥టీ॥గోవ్యాఘ్రములకును-గజసింహములకును- కపిమే
షములకును- మార్జాలమూషకములకును లోకవ్యవహారంబువల్లశత్రు
త్వంబులెఱింగివివాహంబునం కన్యావరులకుతత్రంబుం భృత్యతత్రయోనికూ
టములో జనిగినవానిబరిత్యజింపవలయునుట॥ ... ... ... *

రాశికూటమ్.

శ్లో॥ ద్విద్వాదశకేమృత్యుర్దాయుర్ద్వాదశకేద్విక్కే। తృతీయైకాదశే
దుఃఖంసుఖమేకాదశత్రికే-చతుర్దశకేనిస్వంధనం శచతుర్థకే అశుభం
పంచనవమేశుభంశునవపంచకే-షష్టాష్టకేపుత్రనాశఃపుత్రలాభోష్టషష్టకే
సమసప్తేశుమాంగల్యంకంపత్యోః ప్రీతివర్ధనమ్॥టీ॥ ద్విక్కే- స్త్రీరాశికిబురు
షరాశిరెండవదియైనపక్షమందును-ద్వాదశకే- పురుషరాశికిపండ్రెండవది
యైనపక్షమునం మృత్యుః- మరణముకలుగును-ద్వాదశకే-స్త్రీరాశికిబు
రుషరాశిపండ్రెండవదియును-ద్విక్కే-రెండవదియునాద్విక్కేపురుషరాశికిస్త్రీ
రాశిరెండవదియైనపక్షమందు - ఆయుః-దీర్ఘాయువుగలుగును - ఇత్తె
ఱంగుననె-మిగిలినశ్లోకంబులంతటనర్థవిచారంబు సేయవలయునుట॥

తథపవాదః.

శ్లో॥ ఒజౌలయస్త్రీనోయత్రమిత్రంషష్టాష్టమంవదేత్ యుగ్మేద్విద్వా
దశంచైవదంపత్యోశ్శుభసంభవేత్॥టీ॥యత్ర - ఎచ్చట-స్త్రియః-కన్యకకు
ఒజాలయః-ఒజరాశియగుచున్నదో-తత్ర - అచ్చటనాస్త్రీయొక్క - ఒజ
రాశికి-షష్టాష్టమమ్-ఆఱవది-ఎనిమిదవదియైనపురుషరాశిమిత్రమ్ - ఇష్ట
మైనదానినిగావచేసు-చెప్పవలయును-యుగ్మే రాశియందు- ద్విద్వాదశమ్
రెండవదిపండ్రెండవదియైనపురుషరాశి- దంపత్యోః- జాయాపతులకు శు
భదమ్-శుభప్రదంబైనది-భవేత్ -అగుచున్నది॥ ... ... .. *

తదపవాదః.

శ్లో॥ ద్విర్ద్వాదశే వా నవపంచమే వా షష్ఠాష్టకే వా తులకన్యకాయాః । ఏకాధిపత్యే ప్యథ మిత్రభావే శుభా గ్రహాణాం గణమాతనోతి ॥ టీ॥ ద్విర్ద్వాదశే వా - రెండవ - పండ్రెండవదియగు రాసులయందైనను - నవపంచమే వా - తొమ్మిది యైదవ రాసులయందైనను - షష్ఠాష్టకే - ఆఱవ యెనిమిదవ రాసులయందైనను - ఏకాధిపత్యేతు - ఏకగ్రహాధిపత్యము గలుగుచుండగా నైనను - ఉభయోః - ఇరారాశులయాధిపతులకు - మిత్రత్వే - మైత్రి గలుగుచుండగా నైనను - తులకన్యకాయాః - రాతుసగణముతోఁ జేరినకన్యకనైనను - గ్రహాః - వివాహము - మంగళం - శుభము - ఆతనోతి - విస్తరింపజేయుచున్నా రనుట॥ . .. . . . .. *

శ్లో॥ తృతీయైకాదశే యత్ర చతుర్దశమే శుభే । ఉభయోస్సప్తమ స్తత్ర గ్రహమైత్రం న శోధయేత్ ॥టీ॥ యత్ర - ఎచ్చటనైనను తృతీయైకాదశౌ - దంపతులకు పరస్పరము మూడవ పదునొకొండవ రాసులగుచున్నవో - చతుర్దశమౌ వా - నాలుగవ పదియవ రాసులగుచున్నవో - ఉభయోః - దంపతులకు సప్తమః - సమసప్తకంబగుచున్నదో - తత్ర - అచ్చటచ్చట - గ్రహమైత్రం - గ్రహమైత్రమును పొంతనము - న శోధయేత్ - శోధింపవలసిననిమిత్తము లేదనుట

వర్ణకూటః.

శ్లో॥ ఝషాళికర్కటా విప్రాః క్షత్రాస్సింహధనుస్తులాః । మేషయుగ్మఘటా వైశ్యాః శూద్రా వృషభమృగాంగనాః ॥టీ॥ ఝషాళికర్కటాః - మీనవృశ్చికకటకములు - విప్రాః - బ్రాహ్మణరాసులు - సింహధనుస్తులాః - సింహధనుస్తులలు - క్షత్రాః - క్షత్రియరాసులు - మేషయుగ్మఘటాః - మేషమిధునకుంభములు - వైశ్యాః - వైశ్యరాసులు - వృషభమృగాంగనాః - వృషభమకరకన్యలు - శూద్రాః - శూద్రరాసులని యెఱుంగవలయుననుట॥ . .. *

శ్లో॥ వర్ణశ్రేష్ఠాపవర్ణ హీనవివాహం నైవ కారయేత్ । యది కుర్యాత్తు మోహేన సద్యో భర్తా వినశ్యతి ॥టీ॥ వర్ణశ్రేష్ఠాపవర్ణహీనవివాహం - ఎక్కువజాతి రాశియందుఁ బుట్టిన స్త్రీకిని - తక్కువజాతి రాశియందుఁ బుట్టిన - పురుషునకును వివాహము - నైవకారయేత్ - చేయగూడదు - మోహేన - అజ్ఞానముచేత - కుర్యాద్యది - చేసినట్లైతే - సద్యః - తత్క్షణంబున - భర్తా - పెనిమిటి - వినశ్యతి - నశించుచున్నాడనుట॥ . ... .. . .. . ... *

## వశ్యకూటః.

శ్లో॥ సింహాళీకర్కివణిజౌకన్యావృశ్చికకౌ గ్రుమ్కకౌ । తులామీనయు హాన క్రకన్యేకర్కటకస్తిమిః । మేషకుంభావజోనక్ర శ్మేషాదేర్వశ్యరాశయః॥టీ॥ సింహాళీ- మేషరాశికిసింహవృశ్చికములున్ను - కర్కివణిజౌ - వృషభరాశికి కటక తులలున్ను కన్యమిథునరాశికికన్యయును - వృశ్చికకౌ గ్రుమ్కకౌకటకరాశికివృశ్చికధనుస్సులున్ను - తులా - సింహమునకు - తులయును - మీనయుహా- కన్యకుమీనమిథునములున్ను - నక్రకన్యే - తులకునుకరకన్యారాసులున్ను - కర్కటకః- వృశ్చికమునకుగటక రాశియును తిమిః -ధనుస్సనకుమీనమున్ను - మేషకుంభౌ - మకరమునకు మేషకుంభములున్ను - అజః కుంభమునకు మేషమున్ను - నక్రః - మీనమునకు మకరమున్ను - వశ్యంబులు- అనగా స్వాధీనంబులు-ఏవం- ఈ ప్రకారముగా- మేషాదేః- మేషము మొదలగు ద్వాదశ రాసులకును-వశ్యరాసులని తెలియవలయునను॥ ...... .. ... *

శ్లో॥ వశ్యయోగాచ్ఛుభంప్రోక్తంస్త్రీరాశేః పురుషస్య చ।కన్యకావరయోర్నిత్యంశోధయేన్నృపభృత్యయోః॥టీ॥ స్త్రీరాశేః- స్త్రీరాశికిని- పురుషస్య-పురుషరాశికిని-వశ్యయోగాత్ - వశ్యయోగముగలుగుటవల- శుభం- శుభము- ప్రోక్తం - చెప్పబడియున్నది- యీచెప్పినవశ్యయోగమును-కన్యకా వరయోః- కన్యావరులయందును-నృపభృత్యయోః-రాజభృత్యులయందును-నిత్యం-నిత్యముగా- శోధయేత్ - శోధింపదగినదయనగా- వివాహమందు స్త్రీపురుషరాసులకు - వశ్యయోగంబును పొంతనమును విచారింపవలయునను॥ ...... ...... ...... ...... ...... .... *

## గ్రహమైత్రమ్.

శ్లో॥ శత్రూ మందసితౌసమశ్చశిసుతో మిత్రాణిశేషారవేస్తీక్ష్ణాంశుహిమరశ్మిజశ్చసుహృదౌశేషాస్సమాశ్శీతగోః । జీవేందూష్ణకరాఃకుజస్యసుహృదో జ్ఞోరిస్సితార్కి- సమామిత్రేసూర్యసితౌబుధస్యహిమగుశ్శత్రుస్సమాశ్చపరేసూతేస్సౌమ్యసితావరీరవిసుతోమధ్యః పరేత్వన్యథా । సౌమ్యార్కీ-సుహృదౌసమా కుజగురూశుక్రస్య శేషావరీశుక్రజ్ఞౌసుహృదౌసమస్సురగురుస్సౌరస్యచాన్యేరయః। యే ప్రోక్తాస్సుహృదస్త్రికోణభవనాత్తేమీమయాకీర్తితాః॥టీ॥ రవేః- సూర్యునికి - మందసితౌ - శనిశుక్రులు- శత్రూ శత్రువులు-శశిసుతః-బుధుడు- సమః- సముడు- శేషాః- మిగిలినచంద్రాంగార

కగురులు- మిత్రాణి మిత్రులని- సంజ్ఞాప్రకరణంబునందు జెప్పబడినశత్రు మిత్రసమభావముల నెఱుంగదగినది తెలిసికొనజూడవలయుననుట॥ . . . .. *

శ్లో॥ ఉత్తమోమిత్రవర్గస్స్యాత్సమమిత్రస్తుమధ్యమః కనిష్ఠస్సమవర్గస్తు వైరివర్గస్తుమారకః॥ టీ॥ మిత్రవర్గః వివాహంబునందు వధూవరులకుమిత్రగ్రహావర్గంబు- ఉత్తమః శ్రేష్ఠంబు-స్యాత్ - అగును-సమమిత్రస్తుసమమిత్రంబైనగ్రహావర్గంబైతే మధ్యమః-మధ్యమంబైనది-సమవర్గస్తు - సమగ్రహావర్గంబైతే-కనిష్ఠః-నికృష్ఠంబైనది-వైరివర్గస్తు-శత్రుగ్రహావర్గంబైతేమారకః-మృత్యుకరంబనుట॥ .. . . . ... .. . .. .. .. .. *

శ్లో॥ కలహశ్శత్రుమిత్రత్వే వియోగస్సమశత్రుకే। అంశనాయకయోః ప్రీతౌ పుత్తమస్పాణిపీడనం॥ టీ॥ శత్రుమిత్రత్వే - శత్రుమిత్రగ్రహావర్గంబునందు-కలహః-దంపతులకుకలతసంభవించును- సమశత్రుకే-సమశత్రుగ్రహావర్గంబునందు వియోగః-జాయాపతులకువియోగముసంభవించును-అంశనాయకయోః ప్రీతౌ-స్త్రీపురుషులయొక్క-రాశ్యాధిపతులకుబరస్పరము మిత్రత్వము లేకపోయినప్పటికిని-తద్రాశ్యంశాధిపతులకైనను మిత్రత్వంబుగలిగినపక్షమునందు-పాణిపీడనం-వివాహము పుత్తమం-శ్రేష్ఠంబైనదియనుట॥

రజ్జుకూటమి,

శ్లో॥ విధుబింబత్రయంచైవతిర్యగ్రేఖాచతుష్టయం। అశ్విన్యాదీనిధిష్ణ్యాని వామపార్శ్వాదివిన్యసేత్॥ టీ॥ విధుబింబత్రయంచైవ-చంద్రబింబాకారంబుగామూడు రేఖలను నిడువుగానున్న- తిర్యగ్రేఖాచతుష్టయం-నాలుగురేఖలనడ్డముగానున్న - లిఖిత్వా- లిఖించి- అందలి- అశ్విన్యాదీనిధిష్ణ్యాని- అశ్విని మొదలగు నక్షత్రములను- వామపార్శ్వాది-చక్రంబునకెడమపార్శ్వంబు మొదలుకొని విన్యసేతు- న్యసింపవలయుననుట॥ ... . *

శ్లో॥ శిరఃకంఠోదరకటీపాదరేఖాదిభేదతః - ఏకరేఖాభవేన్నాశో భిన్నరేఖాశుభావహః॥ టీ॥ శిరఃకంఠోదరకటీపాదరేఖాదిభేదతః- శిరః- శిరోరేఖయనియుకంఠ-కంఠరేఖయనియు - ఉదర - ఉదరరేఖయనియు-కటి-కటిరేఖయనియు-పాదరేఖా-పాదరేఖయనియు-అదిభేదతః ఇట్టి రేఖాభేదమువల్ల నక్షత్రంబులను వ్రాయవలయును- ఏకరేఖా-వధూవరులిద్దరినక్షత్రంబులుగలది యొకరేఖయైనట్లాయెనా- నాశః- నాశనము- భవేత్ - అగును-భిన్నరేఖాశ్శుభావహః నక్షత్రంబులలోపల యొకనక్షత్రంబుగలది యొకరేఖయు

నొక నక్షత్రంబుగలిగి మఱియొక రేఖయునైనను - వివాహాః - ఉద్వాహము - శుభావహాః - శుభసంపాదకంబైనదియనుట॥ ... .. ... ... ... . *

శ్లో॥ అశ్విపార్శ్వముఖా జ్యేష్ఠామూలాంత్యం పాదరజ్జవః। యామ్యార్యభాగ్యమైత్రాప్యమహిర్బుధ్న్యాః కటీరితాః॥ అగ్న్యాదిత్యార్యమాపూర్వవిశ్వప్రోష్ఠపదోదరే। బ్రహ్మరుద్రకరస్వాతిశ్రవణం వారుణం తథా॥ కంఠరజ్జుర్విజానీయాద్వసుచిత్రేందుమస్తకే॥ టీ॥ అశ్విపార్శ్వముఖా జ్యేష్ఠా మూలాంత్యం అశ్విన్యాశ్లేషామఖా జ్యేష్ఠామూలా రేవతులారునక్షత్రములు - పాదరజ్జవః - పాదరజ్జువులనియు - యమార్యభాగ్యమైత్రాప్యం - భరణీపుష్యపుబ్బనూరాధాపూర్వాషాఢలు - అహిర్బుధ్న్యః - ఉత్తరాభాద్రయునీయాఱునక్షత్రములు - కటీరితాః - కటిరజ్జువులనియు - అగ్న్యాదిత్యార్యమా। కృత్తికాపునర్వసూత్తరఫల్గునులును - పూర్వవిశ్వప్రోష్ఠపదాః - విశాఖోత్తరాషాఢాపూర్వాభాద్రలునీయాఱునక్షత్రములు - ఉదరం ఉదరరజ్జువులనియు - తథా - ఆప్రకారమే - బ్రహ్మరుద్రకరస్వాతిశ్రవణం - రోహిణ్యార్ద్రాహస్తస్వాతిశ్రవణములును - వారుణం - శతభిషమునీయాఱునక్షత్రములు - కంఠరజ్జుః - కంఠరజ్జువులనియును - వసుచిత్రేందు - ధనిష్ఠాచిత్తామృగశిరలుమూడునక్షత్రములు - మస్తకం - శిరోరజ్జువులనియునీప్రకారము। విజానీయాత్ - తెలియవలయుననుట॥ ... ... ... . . ... ... ... ... ... *

ఏకరేఖారజ్జుఫలం.

శ్లో॥ ముఖే పతిం గళే కన్యాం కుక్షౌ స్వస్యాత్మజాన్ హరేత్ - దరిద్రతా భవేత్కట్యాం పాదే వా భ్రమణం తథా॥ టీ॥ ముఖే - శిరోరేఖయందుండిన స్త్రీపురుషనక్షత్రము పతిం భర్తను గళే - కంఠరేఖయందుండిన స్త్రీపురుషనక్షత్రము - కన్యాం - కన్యకను - కుక్షౌ - ఉదరరేఖయందుండిన స్త్రీపురుషనక్షత్రము - స్వస్యాత్మజాన్ - దంపతులయొక్క కుమారులను - హరేత్ - హరించుచున్నది కట్యాం - కటిరేఖయందు స్త్రీపురుషనక్షత్రములుండిన - దరిద్రతా - దారిద్ర్యమును - తథా - ఆప్రకారము - పాదేవా - పాదరేఖయందుండిన - భ్రమణం తిరుగుటయును - భవేత్ - అగుచున్నదియనుట॥ ... ... ... ... ... *

వేధాకూటం.

శ్లో॥ అశ్వ్యాదిమూలాది మఖాదిభానాం క్రమాచ్చతుర్ణామపి వేధితాః స్యుః పురాణగాజానునభానుసంఖ్యా యథాక్రమాన్యోన్య వేధా వసామమిత్రాః॥

టీ॥ అశ్వ్యాదిమూలాదిమఖాదిభానాం-అశ్వ్యాది-అశ్విని మొదలైనట్టియు-మూలాది-మూల మొదలుకొనినట్టి-మఖాది-మఖ మొదలుకొనినట్టిభానాం-నక్షత్రములలోపల-చతుర్ణామపి-నాలుగు నాలుగు నక్షత్రములకుమక్రమాత్-యీ చెప్పినయశ్విన్యాదిక్రమముగాను పురాణరాజామనుఖానుసంఖ్యయా-పదునెనిమిది-పదియారు-పన్నెండు పండ్రెండవసంఖ్యలచేత-వేధితాః-వేధలు-స్యుః-అగుచున్నవి-వసుసోమచిత్రాశ్చధనిష్ఠాహ్యగశీర్షచిత్తలును అన్యోన్యవేధాః పరస్పరము వేధగలిగినవి - అనగానశ్వినికి - బదునెనిమిదవనక్షత్రమున-భరణికిబదియారవనక్షత్రమున-కృత్తికకు-బదునాలుగవనక్షత్రమును-రోహిణికిబండ్రెండవనక్షత్రమునువేధానక్షత్రంబుల నిట్లెరింగియట్టినక్షత్రములయందువివాహము సేయగూడదీప్రకారమేమూలాదినక్షత్రములయందునూహింపవలయునని తాత్పర్యము॥ ... ... *

శ్లో॥ విద్ధాశ్చైవపరస్పరంయదిభవేత్తారావివాహేతదాప్యబ్దైః క్రమం యమరాజపుణ్యలలనా సంగాంగభోగోపరః॥ టీ॥ వివాహే-ఉద్వాహమునందు-తారా-స్త్రీనక్షత్రముపురుషనక్షత్రమును-పరస్పరమ్ అన్యోన్యము-విద్ధాశ్చైవభవేద్యది వేధింపబడినదియైనట్లాయెనా-తదా-అప్పుడు-శీఘ్రం-శీఘ్రముగా-వర్షః-సెంవత్సరమాగు(డు-యమరాజపుణ్యలలనాసంగాంగభోగః-యమధర్మరాజుయొక్క-భార్యతోడసాంగత్యముచేత శరీరసౌఖ్యముగలవాడు-స్యాత్-అగుననుట॥ ...... ...... ...... *

నాడికూటమ్

శ్లో॥ చతుర్నాడీతుబాహ్లీకేపాంచాలేపంచపర్వభిః-అన్యదేశేత్రినాడీస్యాన్నాడీముఖ్యాకరగ్రహే॥ టీ॥ బాహ్లీకే-బాహ్లీకదేశమందు-చతుర్నాడీ నాలుగుపర్వముల చేత నాడిపొంతనము విచారింపవలసినది-పాంచాలే-పాంచాలదేశమునందు-పంచపర్వభిః-అయిదుపర్వములచేతనాడిపొంతనము చూడవలసినది-అన్యదేశే-ఇతరదేశములయందు-త్రినాడీ-మూడుపర్వములచేతనాడియను పొంతనము-ముఖ్యా-అవశ్యకంబైనది-స్యాత్-అగుననుట॥ *

శ్లో॥ నాడ్యస్తిస్రస్త్ర్యక్షసఙ్ఖ్యావధిష్ణ్యాస్త్రిభ్యోశ్విన్యాదిభ్య ఏవప్రశస్తాః సర్వాకారాతత్రనాడీసమాయాంనక్షత్రాణామేకనాడీమృతిస్స్యాత్ టీ॥ తిస్రః-మూడైననాడ్యః-నాడులు-త్రిభ్యః-మూడైన-అశ్విన్యాదిభ్య ఏవ-అశ్విని మొదలగునక్షత్రములవల్ల-త్ర్యక్షసఙ్ఖ్యావధిష్ణ్యాః, విధింపబడిన

సమస్తనక్షత్రములుగలనైనను ప్రశస్తాః-ప్రసిద్ధంబులను చున్నవి-తత్ర-ఆనక్షత్రములను లెక్క బెట్టెడు పర్వములయందు నాడీనాడి-సర్వాకారా గాన సర్వాకారములు గలదియగుచున్నది నక్షత్రాణాం-స్త్రీపురుషనక్షత్రములకు - ఏకనాడీ ఒకనాడియైన నక్షత్రమందు పమాయాం- సంవత్సరములోపల - మృతిః-వధూవరులకు మరణము - స్యాత్ - అగుచున్నది-యనగా - అశ్వని మొదలుకొనిన నక్షత్రములను మూడుపర్వములయొక్క నారోహణావరోహణక్రమముగా లెక్క బెట్టగా నందు మూడు నాడులలో నొకనాడియందైన వధూవరనక్షత్రంబులుండినట్లైతేనా నక్షత్రములను విసర్జించవలసినది-వధూనక్షత్రంబొకనాడియందును-వరనక్షత్రంబొకనాడియందును నుండిన పక్షమునందు నట్టినక్షత్రములయందు వివాహము సేయదగినదియని యెఱుంగవలయుననుట॥..... *

శ్లో॥ బ్రహ్మక్షత్ర విశాం నాడ్యో మధ్యదక్షిణవామతః। బ్రాహ్మణాదేర్విశేషేణ మధ్యనాడ్యాదినిందితమ్॥ టీ॥ బ్రహ్మక్షత్రవిశాం బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకు-నాడ్యః - నాడులు - మధ్యదక్షిణవామతః - మధ్యదక్షిణవామభాగములవల్లఁ దెలియవలయుననగా మధ్యనాడి బ్రాహ్మణనాడియనియు-దక్షిణనాడి-క్షత్రియనాడియనియు-వామనాడి - వైశ్యనాడియనియు నెఱుంగదగినవి-బ్రాహ్మణాదేః - బ్రాహ్మణులు మొదలగువారికి-విశేషేణ - అతిశయముగా-మధ్యనాడ్యాది- మధ్యనాడి మొదలైనవి - నిందితం నిందింపబడినవియనుట॥ . .. .. ... .. ... ... ... ... ... ... *

శ్లో॥ సా మధ్యనాడీ పురుషం నిహంతి తత్పార్శ్వనాడీ ఖలు కన్యకాంచ। ఆసన్నపర్యాయగతా సమా చేద్వర్షేణ వాచ్యం క్రమశస్త్రివర్షైః॥ టీ॥ సా మధ్యనాడీ- పూర్వోక్తమైన మధ్యనాడీ - పురుషమ్ - పురుషుని నిహంతి - కొట్టుచున్నది-తత్పార్శ్వనాడీ - ఆపార్శ్వనాడీ-కన్యకాంచ- కన్యకను - హంతిఖలు-కొట్టుచున్నదిగదా-సమా-సమనాడి-ఆసన్నపర్యాయగతాచేత్ - మొదటిపర్యాయమునుఁ బొందినట్టాయెనా-వర్షేణ-ఒకసంవత్సరము చేత- మరణం మరణము-వాచ్యం - చెప్పఁదగినది- సమా- సమనాడి- రెండవమూడవపర్యాయములనుఁ బొందినట్లాయెనా-క్రమశః-వరుసగాను-త్రివర్షైః-రెండు మూడవ సంవత్సరముల చేత-మరణము చెప్పఁదగినదియనుట॥ . ... ... .. *

రజ్జుకూటాపవాదః.

శ్లో॥ రజ్జోరభావో యస్య స్థిరాశిశ్చ గ్రహమైత్రకమ్। దినమాహేంద్ర

యుక్తోపి రజ్జుదోషో న విద్యతే॥ టీ॥ రజ్జోః-రజ్జుపొంతనము యొక్క - అభావః- లేకపోవుట- అస్తేపి- కలిగియు ఎప్పటికైన్ని - దినమాహేంద్రయోర్యుక్తః- దినమాహేంద్ర కూటములతోఁగూడిన- రాశిశ్చ - రాశిపొంతనమున్ను- గ్రహమైత్రకశ్చ- గ్రహమైత్రియనుపొంతనమున్ను - అస్తియది- ఉండినట్లైతే- రజ్జుదోషః- రజ్జుపొంతనము లేనిదోషము నవిద్యతే- లేకపోవుచున్నదియనుట॥ *

శ్లో॥ అహిర్బుధ్న్యద్వయే చైవ ప్రాజాపత్య త్రయే తథా। శ్రుతిపుష్య విశాఖాసు నాడిదోషో న విద్యతే॥ టీ॥ అహిర్బుధ్న్యద్వయే చైవ - ఉత్తరాభాద్ర రేవతులయందున్ను- తథా- ఆప్రకారము- ప్రాజాపత్యత్రయే- రోహిణీమృగశీరార్ద్రలయందును - శ్రుతిపుష్యవిశాఖాసు- శ్రవణపుష్యవిశాఖలయందున్ను - నాడిదోషః- స్త్రీపురుష నక్షత్రంబు లేక నాడియైనందున సంభవించెడు దోషంబు- నవిద్యతే- లేకపోవుచున్నదియనుట॥ ... ... ... ... *

అంశనాడీ ప్రకారః.

శ్లో॥ నక్షత్రాదంశతో నాడికూటం సామాన్యముచ్యతే। నక్షత్రపాదభేదేన నాడీముఖ్యా కరగ్రహే॥ టీ॥ నక్షత్రాతు- నక్షత్రమువల్లనైన నాడికూటముకంటె- అంశతః- నక్షత్రపాదభేదమువల్లనైన- నాడికూట - నాడిపొంతనము- సామాన్యం- సాధారణంబని- ఉచ్యతే- చెప్పఁబడుచున్నది- కరగ్రహే- వివాహమునందు - నాడి - నాడియనుపొంతనము - నక్షత్రపాదభేదేన - నక్షత్రాంశభేదముచేత- ముఖ్యా- అవశ్యకంబైనదియనుట॥ ... .. ... ... *

శ్లో॥ దస్రాద్యంశాస్తు విజ్ఞేయా అష్టోత్తరశతం క్రమాత్తు। పూర్వం నక్షత్రసంఖ్యావద్గణయేదంశనాడికాః॥ టీ॥ దస్రాద్యంశాస్తు- అశ్విని మొదలగు నిరువదియేడు నక్షత్రముల యొక్క- యంశములైనట్టి- అష్టోత్తరశతం- నూటయెనిమిదియని- విజ్ఞేయాః తెలుసుకొనవలసినవి- పూర్వం- పూర్వమందు నక్షత్రసంఖ్యావత్తు- నక్షత్రముల నెంచడమునందువలె- క్రమాత్తు- అశ్విన్యాది క్రమముగాను - అంశనాడికాః - అంశనాడులను- గణయేత్తు - ఎంచవలయుననుట॥ ... ... ... ... ... ... .. ... ... ... ... ... .. *

నారదీయే.

శ్లో॥ చతుస్త్రిద్వ్యంఘ్రిభోద్భూతాః కన్యాయాః క్రమశోఽశ్విభాద్- వహ్నిభాదింద్రభాన్నాడీ త్రిచతుః పంచపర్వసు॥ టీ॥ చతుస్త్రిద్వ్యంఘ్రిభోద్భూతాః- చతుష్పాత్త్రిపాద్ద్విపాన్నక్షత్రములయందుఁ బుట్టిన - కన్యా

యాః- కన్యకయొ-నాడీ నాడి-త్రిచతుఃపంచపర్వసు- మూడునాలుగైదుపర్వములయందు- క్రమశః- చతుష్పాదాజనక్షత్రక్రమముగా- అశ్వీభాక్-చతుష్పాన్నక్షత్రంబైనయశ్విని బొందినదియును- వహ్నిభాక్ త్రిపాన్నక్షత్రంబైనకృత్తికను బొందినదియును- భవతి- అగుచున్నది- అనగా-చతుష్పాన్నక్షత్రంబు మూడుపర్వములమీదనున్న- త్రిపాన్నక్షత్రంబు నాలుగు పర్వములమీదనున్న-ద్విపాన్నక్షత్రంబు ఐదు పర్వములమీదనున్న లెక్కపెట్టవలసినది॥

మాతులసుతోద్వాహః.

శ్లో॥ రాశీశశత్రుత్వముదైకనాడీషష్ఠాష్టమంవానవపంచమంవా। గరగ్రహేమాతులకన్యకాయాశ్శుభో యదిస్యాచ్ఛుభనంత్యభీష్టమ్॥ టీ॥ అథ-అనంతరమువంటి-రాశీశశత్రుత్వం-స్త్రీపురుషరాశ్యధిపతులకు శత్రుత్వంబైనను- ఏకనాడీ-స్త్రీపురుషనక్షత్రంబులేకనాడియందుండెనను- షష్ఠాష్టమం వా- స్త్రీపురుషరాసులు- పరస్పరము షష్ఠాష్టమములైనను- నవపంచమం వా- నవపంచమంబులైనవైనను మాతులకన్యకాయాః- మేనమామకొమార్తెయొక్క- కరగ్రహే-పాణిగ్రహణమునందు- అభీష్టం శకునం యది-మంచి శకునంబైనట్లాయెనా- శుభః- శుభఫలము-స్యాత్- అగుచున్నదియనుట॥ .. .... *

శ్లో॥ గౌతమ్యాయామ్యదిగ్భాగే కావేర్యాశ్చోత్తరేతటే - మాతులస్యసుతోద్వాహం ప్రశంసంతిమనీషిణః॥ టీ॥ గౌతమ్యాః-గౌతమీ నదియొక్క- యామ్యదిగ్భాగే- దక్షిణపుదిక్కునను కావేర్యాః- కావేరియొక్క - ఉత్తరతటే చ- ఉత్తరభాగమందును- మాతులస్యసుతోద్వాహం - మేనమామకొమార్తెను పెండ్లిచేసికొనుటను- మనీషిణః- విద్వాంసులు- ప్రశంసంతి- ప్రశంసింపుచున్నారు॥ .... ..... ... .... . ... . . . . .... *

శ్లో॥ పితృష్వస్సుతాయాశ్చ సుతాయామాతులస్యచ। వివాహేహ్యాదినక్షత్రాదీనవిచార్య ప్రవర్తతే॥ టీ॥ పితృష్వస్సుతాయాశ్చ - మేనయత్తకొమార్తెయొక్కయు మాతులస్యసుతాయాశ్చ- మేనమామకొమార్తెయొక్కయు- వివాహే- వివాహము- దినకూటాదీన్- దినకూటము మొదలైనపొంతనములను- అవిచార్య- విచారింపక - ప్రవర్తతే- ప్రవర్తించుచున్నది - యనగా మేనత్తకొమార్తెను - మేనమామకొమార్తెను - వివాహముచేసుకొను వేళల పొంతనములు మొదలైనవాటిని విచారింపవలసిననిమిత్తము లేదనుట॥ ..... *

వివాహాంతరవిషయః.

శ్లో॥ భార్యాంతరవివాహస్స్యాద్యదియుగ్మేవత్సరేశుభః। యుగ్మేత్వవి

నాశాయ గార్గ్యస్య వచనం యథా॥ టీ॥ గార్గ్యస్య - గార్గ్యమహామునియొ
క్క - వచనం - వచనము - యథా - ఏప్రకారంబుగానున్నదో - ఆప్రకారము
గా - భార్యాంతరవివాహః - ద్వితీయవివాహము - అయుగ్మేవత్సరే - విషమ
సంవత్సరమునందు - శుభః - మంగళకరంబైనది - స్యాత్ - అగుచున్నదియనుట॥

గ్రంథాంతరే.

శ్లో॥ పత్నీవియోగే ప్రథమేచ వర్షే నోచేద్ద్వివర్షే పునరుద్వహేత్సః। అ
యుగ్మవర్షేషు శుభం వదంతి వశిష్ఠగార్గ్యాదిమునిప్రవర్యాః॥ టీ॥ పత్నీ
వియోగే - జ్యేష్ఠభార్యావియోగము గలుగుచుండగా - ప్రథమవర్షేచ - మొద
టిసంవత్సరమునందు - నోచేత్ - ద్వితీయవివాహము గాకపోయినదైన - సః -
ఆ ద్వితీయవివాహేచ్ఛగలపురుషుఁడు - ద్వివర్షే - పునః రెండవసంవత్సరము
నందైన - అయుగ్మవర్షేషు - బేసిమాసములయందు - ఉద్వహేత్ - ద్వితీయ
వివాహము చేసుకొనవలసినది - ఆప్రకారము చేసుకొన్న వివాహమును - వసి
ష్ఠగార్గ్యాదిమునిప్రవర్యాః - వసిష్ఠగార్గ్యులు మొదలైన మునిసత్తము
లు - శుభం - శుభకరమైనదానిగా - వదంతి - చెప్పుచున్నారనుట॥ ... . ... *

నారదీయే.

శ్లో॥ యుగ్మేబ్దేజన్మతః స్త్రీణాం ప్రీతిదం పాణిపీడనమ్। సంపత్ప్రదం పుంసా
మయుగ్మేబ్దే వ్యత్యయే నాశనంతయోః॥ టీ॥ జన్మతః - జన్మము మొదలుకొని - యుగ్మే
బ్దే - సమసంవత్సరమునందు - స్త్రీణాం - స్త్రీలకు - పాణిపీడనం - వివాహము - ప్రీ
తిదం - ఇష్టప్రదంబైనది - పుంసాం - పురుషులకు - అయుగ్మేబ్దే - జననము మొద
లుకొని - విషమసంవత్సరమునందు పాణిపీడనం - వివాహము - సంపత్ - సంప
త్కరంబైనది - వ్యత్యయే - ఈ చెప్పిన ప్రకారమునకు విపర్యయము గలుగుచుం
డగా - తయోః - ఆదంపతులకు - నాశనం - అరిష్టము సంభవించుననుట॥ . *

శ్లో॥ నకదాచిద్వింశత్యృక్షే భానోరార్ద్రాప్రవేశనాత్। వివాహో
దేవతానాంచ ప్రతిష్ఠాచోపనాయనమ్॥ నాస్తగదేసితేజీవే నతయోర్బాలవృ
ద్ధయోః నగురౌ సింహరాశిస్థే సింహాంశకగతేపివా॥ టీ॥ భానోః - సూర్యునియొ
క్క - ఆర్ద్రాప్రవేశనాత్ - ఆర్ద్రానక్షత్రప్రవేశము మొదలుకొని - వింశ
త్యృక్షే - ఇరువదినక్షత్రములయందు - కదాచిత్ - ఒకానొకప్పుడును - వివా
హః - వివాహమును - దేవతానాంప్రతిష్ఠాచ - దేవతాప్రతిష్ఠయును - ఉపనయ
నం - ఉపనయనమును - న - చేయగూడదు - తథా - ఆప్రకారము - సితే - శుక్రుఁడును

జీవే-బృహస్పతియును-అస్తంగతేసతి అస్తసమయమునుఁ బొందియుండగా-న
కూడదు-తయోః - ఆగురుశుక్రులు-బాలవృద్ధయోః-బాల్యము వృద్ధత్వము
ను బొందినవారగలగుచుండగానును-న- కూడదు- గురౌ-బృహస్పతి-సింహరా
శిస్థేసతి-సింహరాశిని బొందుచుండగానైనను-సింహాంశకగతేపివా-సింహ
రాశినవాంశమునుఁ బొందుచుండగానైనను-వివాహదేవతాప్రతిష్ఠోపనయ
నంబులు సేయఁదగినవిగావని తెలియవలయుననుట॥ ... ... ... ... *

అపవాదవాసిష్ఠే.

శ్లో॥ సింహాంగతే దేవగురౌ వివాహం నేచ్ఛంతి యాత్రాం యమునాత
టాన్తే। కళింగవంగేష్వథమాగధేషు దోషః ప్రయుక్తో నమహాన్యదేశే॥ టీ॥ దే
వగురౌ బృహస్పతి - సింహంగతేసతి - సింహరాశిని బొందినవాఁడగుచుం
డగా-యమునాతటాన్తే-యమునానదీతీరదేశమందును కళింగవంగేషు కళిం
గవంగదేశములయందు- అథ-తర్వాత మాగధేషు-మగధదేశములయందు
ను వివాహం - ఉద్వాహమును-యాత్రాం దేశాంతరయానమును సున్ను- నే
చ్ఛంతి- పెద్దలిచ్ఛయింపరు-తథా - ఆప్రకారముగా - అన్యదేశే- వెనుకఁజె
ప్పిన దేశములకంటె నితరదేశములయందు-దోషః ఆసింహగురుదోషము-
న ప్రయుక్తః-సంప్రాప్తంబైనది గాదనుట॥ ... ... .. ... ... ...*

గురుశుక్రయోర్వృద్ధత్వబాల్యదోషౌ.

శ్లో॥ పశ్చాత్ప్రాగుదితశ్శుక్రో దశత్రిదివసం శిశుః। వృద్ధః పంచదినం ప
క్షం గురోః పక్షం తు సర్వదా॥ టీ॥ పశ్చాత్ప్రాగుదితః- పడమటతూరుపు దెస
లయందుదయించిన శుక్రః-శుక్రుఁడు దశత్రిదివసం-క్రమముగా పదిదినములు
మూడుదినములును-శిశుః-బాలుండగుచున్నాఁడు -అప్రకారమే-పంచదినం-
అయిదుదినములును పక్షం-పదియేనుదినములును-వృద్ధః - వృద్ధుండగుచున్నాఁ
డు-గురోః-బృహస్పతికైనను-సర్వదా ప్రాక్పశ్చిమదిక్కులయందుదయిం
చినప్పుడు నస్తమించినపుడును పక్షం పదియేనుదినములు వృద్ధత్వబాల్యములుగ
లుగుచున్నవియని యెఱుంగవలయు॥ .. ... ... . ... ... ...*

శ్లో॥ శుక్రో గురుః ప్రాక్పరతశ్చ కాలే వింధ్యేఽశాంతిషు సప్తరాత్రం
వంగేషు హూణేషు చ షట్చ పంచ శేషేషు దేశే త్రిదినం చ వర్జ్యమ్॥ టీ॥ శుక్రః-
శుక్రుఁడును-గురుః-బృహస్పతియును- ప్రాక్పరతశ్చ కాలే పూర్వపశ్చిమది
క్కులయందయాస్తమయములనుఁ బొందినకాలమునందు - వింధ్యే - వింధ్య

దేశమునందు- దశ- పదిదినములు వర్జింపదగినది - అవంతిషు - అవంతిదేశములయందు-సప్తరాత్రం - ఏడుదినములు విడువదగినవి - వంగేషు - వంగదేశములయందు షట్చ-ఆరుదినములున్ను - హూణేషుచ-హూణదేశములయందు-పంచ . అయిదుదినములున్ను - పరిత్యజింపదగినది- శేషదేశేషు-మిగిలిన దేశములయందైతే - త్రిదినం- మూడుదివసములు - వర్జ్యం-విడువదగినవి యనుట॥ ...... ...... ...... ..... .... ...... *

శ్లో॥ వింధ్యస్య దక్షిణే దేశే వృద్ధబాల్యేపి తేజ్యయోః। త్రిదినం వర్జయిత్వా తు తతస్తస్యాం చ శోభనమ్॥ టీ॥ సితేజ్యయోః- శుక్రబృహస్పతులకు వృద్ధబాల్యేపి-వృద్ధత్వ బాలత్వములు గలుగుచుండగా-వింధ్యస్య- వింధ్యపర్వతము యొక్క- దక్షిణేదేశే-దక్షిణదేశమునందు - త్రిదినం-మూడుదినములున్నూ-వర్జయిత్వా విడిచిపెట్టి- తతఃపిమ్మట-తస్యాం ఆవింధ్యపర్వతదక్షిణభూమియందు-శోభనం శుభకార్యము సేయదగినదియనుట॥ ... ... .. .. .. *

మౌఢ్యనిషిద్ధాని.

శ్లో॥ వాపీకూపతటాకయాగగమనక్షౌరప్రతిష్ఠావ్రతం విద్యామందిరకర్ణవేధనమహాదానం వనస్థాపనమ్। తీర్థోద్వాహజపాభిషేకమఖిలాన్దోషప్రయుక్తేతరాన్ దూరేణైవ జిజీవిషుః పరిహరేదాస్తంగతే వా సితే॥ టీ॥ అస్తే-గురుండైనను-సితేవా-శుక్రుడైనను- అస్తంగతే- అస్తమించినవాడగుచుండగా-జిజీవిషుః- జీవితాశగలపురుషుడు - వాపీకూపతటాకయాగగమనక్షౌరప్రతిష్ఠావ్రతం-కొలను-బావి-చెరువు జన్నము యాగము[illegible] - దేవతాప్రతిష్ఠాపనములున్ను-విద్యామందిరకర్ణవేధనమహాదానం-విద్యాగ్రంథస్థాపనగృహారంభకర్ణవేధన మహాదానములున్ను - వనస్థాపనం-తోటలువేయించుటయున్ను-తీర్థోద్వాహజపాభిషేకం- పుణ్యతీర్థసేవా వివాహ నూతన మంత్రానుష్ఠానపట్టాభిషేకములున్ను - ఏతాన్ - వీటినిన్ని దోషప్రయుక్తేతరాన్ - దోషయుక్తములైనకర్మలకంటె నితరంబులైన అఖిలాన్ - సమస్తములైన-యితరకర్మలనున్ను-దూరేణైవ దూరముగానే యత్నపరిహరేత్ పరిత్యజింపవలసినది- యనగా గురుశుక్ర మూఢములయందు నీశ్లోకములో జెప్పిన వివాహాది శుభకార్యములను జేయకూడదనుట॥ ... ... ... *

మూఢేకర్తవ్యాని.

శ్లో॥ భుజంగమూల గ్రహరోగశాంతిః వ్వలక్ష్యయోగే గ్రహాభిషేకే।

దోషప్రయుక్తేష్వఖిలవ్రతేషు చోత్పాతశాంతౌ నచమౌఢ్యదోషః॥ టీ॥ భుజం
గమూలగ్రహరో, శాంతిషు భుజంగమూల ఆశ్లేషామూలాదిగండనక్షత్రము
లయొక్క శాంతులయందును - గ్రహ - గ్రహాచారసంబంధమైన శాంతి యందును
మరోగశాంతిషు - వ్యాధివిషయములైన జపహోమదానాదిశాంతులయం
దును - అలబ్ధయోగేహరాజ్ఞాబ్ధైనగ్రహణాభిషేకే - గ్రహణసంబంధమై
నశాంతియందును - అభిషేక - అభిషేకమునందును - దోషప్రయుక్తేషు దోష
సహితకార్యములయందును - అఖిలవ్రతేషుచ - సమస్తవ్రతములయందును -
ఉత్పాతశాంతౌ అతివిపాతములైనమహోత్పాతములయొక్క శాంతి
యందును - మౌఢ్యదోషః - మూఢదోషము - న - లేదనుట. ... ... *

## మౌఢ్యదోషాపవాదః.

### కాలప్రకాశికాయామ్.

శ్లో॥ ఏకో మూఢోపి వేదన్యోస్వోచ్చమిత్రాంశగో యది। స్వరాశిమూ
ర్తిగశ్చైవ మౌఢ్యదోషో న విద్యతే॥ టీ॥ ఏకో మూఢః - గురుశుక్రులలో నొకం
డస్తమించియుండగా - అన్యః - మరియొకండు స్వోచ్చమిత్రాంశగః - తన
యొక్క - ఉచ్చమిత్రాంశములనుఁ బొందినవాఁడైనను - స్వరాశిమూర్తి
గశ్చైవ - స్వక్షేత్రమునుఁబొందినవాఁడైనను - భవేద్యది - అయినట్లాయె
నా మౌఢ్యదోషః - మూఢదోషము - నవిద్యతే - లేకపోవుచున్నదియనుట॥ *

శ్లో॥ జీవే లగ్నే బలోపేతే పాపాస్త్రిషడాయరాశిషు। స్థితాశ్చేదస్తశు
క్రస్య దోషో నాస్తీతి భార్గవః॥ టీ॥ జీవే - బృహస్పతి - లగ్నేషు - లగ్నస్థానం
దు - బలోపేతే - బలసహితుఁడై యుండగా - పాపాః - కుజాది - పాపగ్ర
హములు త్రిషడాయరాశిషు - తృతీయలాభషష్ఠస్థానములయందు - స్థితా
శ్చేత్ - ఉండిరట్లాయెనా - అస్తశుక్రస్య - అస్తమించినశుక్రునియొక్క -
దోషః - దోషము - నాస్తీతి - లేదని భార్గవః - భార్గవమహామునియొక్క -
మతంబనుట॥ . ... ... ... .. .. .. *

శ్లో॥ గురోరస్తంగతో దోషో నాస్తి శుక్రోదయో యది - ద్వయోరస్తమ
యస్త్వేచ్చేదపవాదైర్నభిద్యతే॥ టీ॥ శుక్రోదయోయది - శుక్రోదయం
బైనట్లాయెనా - గురోః బృహస్పతియొక్క - అస్తంగతోదోషః అస్తమిం
చినందువల్లనైన - దోషము నాస్తి లేదు - ద్వయోః - గురుశుక్రులకిద్దరికి - అస్త
మయః - అస్తమించుట స్యాచ్చేత్ అయినట్లాయెనా - అపవాదైః విశేషన

చనముల చేత - నభిద్యోతే భేదింపఁబడదు అనఁగా మూఢదోషము గలదని తాత్పర్యము॥ .. ... ... ... .. ... ... ...*

అథాబ్దమాసషష్ట్యంతవర్జ్యాణి.

శ్లో॥ వర్షాంతేవర్జయేత్పక్షం మాసాంతేచదినత్రయమ్ । ఋత్వంతే ఘటికేద్వేచ గ్రహణేదినసప్తకమ్॥ టీ॥ వర్షాంతే- సంవత్సరాంతమునందు పక్షం-పదియేనుదినములను- మాసాంతే- మాసాంతమునందు - దినత్రయం- మూడుదినములను ఋత్వంతే-ఋత్వంతమునందు- ఘటికేద్వేచ- రెండు గడియలనున్ను- గ్రహణే గ్రహణమునందు-దినసప్తకం- యేడు దినములను వర్జయేత్ -పరిత్యజింపవలయుననుట॥ ... ... ... ... ...*

కశ్యపః.

శ్లో॥ మాసాంతేత్రిదినంనేష్టంవర్షాంతేదినపంచకమ్। షష్ట్యంతేవత్సరస్త్యాజ్యోషణ్మాసాన్వావిసర్జయేత్॥ టీ॥ మాసాంతే మాసాంతమునందు-త్రిదినం- మూడుదినములు - నేష్టం- శుభకరములైనవిగావు- వర్షాంతే- సంవత్సరాంతమునందు-దినపంచకం - ఐదుదినములున్ను- షష్ట్యంతే- ప్రభవాదిషష్టిసంవత్సరాంతమునందు - వత్సరం ఒకసంవత్సరమున్ను - త్యాజ్యః - విడిచిపెట్టదగినవి-షణ్మాసాన్వా-షష్ట్యంతమునందునాఱుమాసములైనను విసర్జయేత్ -త్యజించవలయుననుట॥ ... ... ... ... *

శ్లో॥ ప్రాకృతాబ్దోగురోరబ్దోసౌరాబ్దస్త్రివిధస్స్మృతః - తేషామాదౌ తథాంతేచవర్జయేచ్చదినత్రయం॥ టీ॥ ప్రాకృతాబ్దః - చాంద్రమానాబ్దంబనియు- గురోరబ్దః- బార్హస్పత్యాబ్దంబనియు- సౌరాబ్దః- సౌరాబ్దంబనియు- త్రివిధః మూడువిధంబులు గలదని- స్మృతః-స్మరింపఁబడినది- తేషామ్ - ఆచాంద్రమానబార్హస్పత్యమానసౌరమానాబ్దంబులలోపల- ఆదౌ- మొదటిదియైనచాంద్రమానాబ్దమునందును-తథా-ఆప్రకారముగా-అంతేచ-సౌరమానాబ్దంబునందు-దినత్రయమ్- మూడుదినములను - వర్జయేత్ - విడిచిపెట్టవలయుననుట॥ ... ... .. ... . . ... ..*

శ్లో॥ అంగవంగకళింగేషుమాసషట్కంవిసర్జయేత్ ఆంధ్రదేశేషు సర్వత్ర త్రిమాసంవర్జయేద్బుధః॥ టీ॥ అంగవంగకళింగ దేశములయందు- మాసషట్కం-షష్ట్యంతమునందు ఆఱుమాసములను - విసర్జయేత్ - విడువవలయును - ఆంధ్రదేశేషు-సర్వత్ర - తెనుఁగుదేశములయందంతటను- త్రిమా

షమ్ - మూడుమాసములను - బుధః- తెలిసినవాఁడు-వర్జయేత్-త్యజింపవలయుననుట॥ ... ... ... ... ... ... ... ... *

జన్మమాసాదివర్జ్యం.

శ్లో॥ జన్మోదయేజన్మరాశౌజన్మర్క్షేజన్మవాసరేజన్మమాసేచదంపత్యోర్వివాహోత్యంతదుఃఖదః॥ టీ॥ జన్మోదయే-జననకాలలగ్నమునందును- జన్మరాశౌ-జన్మనక్షత్రరాశియందును- జన్మర్క్షే-పుట్టిననక్షత్రమందును-జన్మవాసరే-పుట్టినదినమునందును-జన్మమాసే-పుట్టిననెలయందును-దంపత్యోః జాయాపతులకు-వివాహః - ఉద్వాహము - అత్యంతదుఃఖదః-మిక్కిలిదుఃఖకరంబనుట॥ ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ సాంఘాతికేజన్మనిసాముదాయే వైనాశికేకర్మణిమానసర్క్షేచౌలవ్రతేహోమవిధిర్న కార్యః కృతఃక్రియానష్టకరీభవేత్॥ టీ॥ సాంఘాతికే-సాంఘాతికనక్షత్రమందును-జన్మని-జన్మతారయందును-సాముదాయే-సాముదాయనక్షత్రమునందును - వైనాశికే-వైనాశికనక్షత్రమందును కర్మణి-కర్మనక్షత్రమునందును-మానసర్క్షే మానసాఖ్యనక్షత్రమునందును చౌలవ్రతే-చూడాకర్మోపనయనములును- హోమవిధిః-వివాహమును-నకార్యః - చేయఁదగినవిగావు కృతః చేసినవానికి-సా క్రియా- ఆచూడాకర్మాదివిధానము-నష్టకరీనాశకరంబైనది-భవేత్-అగుననుట॥ ... .. ... .. *

వివాహయోగ్యాయోగ్యమాసాః.

శ్లో॥ మాఘఫాల్గునవైశాఖజ్యేష్ఠమాసాశ్శుభప్రదాఃమధ్యమాకార్తికోమార్గశీర్షోవైనిందితాఃపరే॥ టీ॥ మాఘఫాల్గునవైశాఖజ్యేష్ఠమాసాః - మాఘఫాల్గునవైశాఖజ్యేష్ఠమాసములు-శుభప్రదాః-శుభకరములయినవి - అనఁగానుత్తమంబులు-కార్తికః కార్తికమాసమును మార్గశీర్షోవై-మార్గశీర్షమును-మధ్యమా-మధ్యమములయినవి - పరే శేషించినమాసములు నిందితాః- నిందింపబడినవి-అనఁగానధమములనుట॥ .. .. .. ... .. ... ... *

శ్లో॥ అజగోయుగ్మకుంభాళిమృగరాశిగతేరవౌముఖ్యః కర్కగ్రహోన్యరాశిగేనకదాచన॥ టీ॥ రవౌ-సూర్యుఁడు అజగోయుగ్మకుంభాళిమృగరాశిగతేసతి - మేషవృషభమిథునకుంభవృశ్చికమకరరాసులఁబొందియుండఁగా కరగ్రహః వివాహము- ముఖ్యః- శ్రేష్ఠంబైనది-అన్యరాశిగే-ఇతరరాసులయందుండైతే-కదాచన ఒకానొకప్పుడున వివాహముచేయఁగూడదనుట॥

శూన్యమాసాః.

శ్లో॥ ఉత్తరాయణగే సూర్యే మీనచైత్రం తు వర్జయేత్ - మీనచైత్రో ధనుఃపౌష్యో మిధునాషాఢకోపి చ - కన్యాభాద్రపదో మాసః శూన్యమాసాః ప్రకీర్తితాః॥ టీ॥ సూర్యే సూర్యుడు ఉత్తరాయణగేసతి - ఉత్తరాయణమును జెందియుండగా - మీనచైత్రంతు మీనచైత్రమాసమునైన - వర్జయేత్తు విడిచిపెట్టవలయును మీనచైత్రః - మీనచైత్రము ధనుఃపుష్యః ధనూరాశియుక్తంబైనపుష్యమాసమును - మిధునాషాఢకోపిచ మిధునరాశి - సమేతంబైనయాషాఢమాసమును - కన్యాభాద్రపదః కన్యారాశితోగూడిన భాద్రపదమాసమును శూన్యమాసాః - శూన్యమాసంబులని ప్రకీర్తితాః - చెప్పబడెనవి - యనగా - నిట్టిమాసములయందు - వివాహము - సేయదగదనుట॥ ... ... ... *

శ్లో॥ పౌష్యేనమాష్యే మకరేణయుక్తశ్చైత్రస్తథా మేషసమన్వితశ్చ - శుచిశ్చ కేచిన్మిధునేనయుక్తో వివాహకార్యం శుభదం వదంతి॥ టీ॥ మకరేణయుక్తః మకరరాశిసహితంబైన పౌష్యః - పుష్యమాసమును - తథా - ఆప్రకారము - మేషసమన్వితః - మేషరాశితోఁగూడిన - చైత్రశ్చ - చైత్రమాసమును - మిధునేనయుక్తః - మిధునయుక్తంబైన శుచిశ్చ - ఆషాఢమాసమును - నెటూప్యః - నిగదింపడగినదిగాదు యేతేషు - ఈమాసములయందు - కేచిత్ - కొందఱు - వివాహకార్యం - ఉద్వాహకార్యమును - శుభం - శుభప్రదంబైనదానినిగా - వదంతి - చెప్పుచున్నారనుట॥ ... ... ... ... .. .. .. *

శ్లో॥ ముండనం మీనచైత్రే చ ముంజనం మేషచైత్రకే। ముండనం మండనం చైవ మేషచైత్రే విధీయతే॥ టీ॥ మీనచైత్రేతు - మీనచైత్రమునందైన - ముండనం ఉపనయనవ్రతమును - మేషచైత్రకే - మేషసహితంబగు చైత్రమాసమునందు - ముండనం - వివాహకార్యమును - చేయవచ్చును - మేషచైత్రే తు మేషచైత్రమునందైన - ముండనం - ఉపనయనమును - మండనం - వివాహమును విధీయతే - విధింపబడుచున్నదియనుట॥ ...... .. .. ..... ...... .. *

సూర్యస్యార్ద్రాప్రవేశే శుభకర్మవర్జనమ్.

గార్గః.

శ్లో॥ ఆర్ద్రాదికే స్వాతివిరామకాలే తు త్రయ్యం దేదశకే లద్ధైవ - వివాహచౌలవ్రతబంధనాఖ్యం సురప్రతిష్ఠాచనకార్యమేవ॥ టీ॥ ఆర్ద్రాదికే - ఆర్ద్రానక్షత్రము మొదలుగాగలిగినట్టియు స్వాతి విరామకాలే - స్వాతీనక్ష

త్రంబంతయుగా గలిగినట్టి కళ కేవలమైనను త్రిభ్రువిలి దేవతల సమూహము నంద
డు-తథైవ అట్లనె-వివాహచౌలవ్రతబంధసాఖ్యం-వివాహచూడాకర్మో
పనయనములున్ను-సురప్రతిష్ఠాచ-దేవతాప్రతిష్ఠయును-న కార్యమేవ చే
యంపఁగవి గాదనుట॥ ... . .. ... .. ... *

కాశ్యపే.

శ్లో॥ జ్యేష్ఠమాసే యదా మార్త్యో రుద్రర్క్షే చార్ధభోగవాన్ । వివాహాదిశు
భం కార్యం కేచిదాహుస్త్రియోంశకాః॥ టీ॥ జ్యేష్ఠమాసే-జ్యేష్ఠమాసమునం
దు-యదా ఎప్పుడు-మార్త్యః-సూర్యుండు-రుద్రర్క్షేచ-ఆర్ద్రానక్షత్ర
మందున్ను-అర్ధభోగవాన్-సగము భుజించుచున్నాడో-తదా-అప్పుడు-వి
వాహాదిశుభం-వివాహము మొదలైన శుభకార్యములు-కార్యం-చేయవచ్చు
ను-కేచిత్-కొందరు మునులు-త్రయోంశకాః-ఆర్ద్రానక్షత్రములో మూ
డు పాదములు-యోగ్యాః-వివాహాదియోగ్యంబులని-వదంతి చెప్పుచు
న్నారనుట॥ . ... ... .. .. ... . .. *

ఆషాఢమాసవర్జ్యమ్.

శ్లో॥ శుచిమాసే నవోఢాయాః ప్రవేశం శ్వశురమందిరమ్ । వర్జయేన్మతి
మాన్ తత్ర మునయోపి వదంతి హి॥ టీ॥ మతిమాన్-బుద్ధిమంతుఁడైనవాఁడు-శుచి
మాసే-ఆషాఢమాసమునందు-శ్వశురమందిరం-అత్తవారింటిని గూర్చి-నవ
వోఢాయాః ప్రవేశం-నూతనవధూప్రవేశమును-వర్జయేత్-విడిపింపవలసి
నది-తథా-అట్లే కారణముగా-తత్ర-ఆయాషాఢమాసమునందు-మునయోపి-
ఇతరమునీశ్వరులున్ను-వదంతిహి-చెప్పుచున్నారు-అనగా నాషాఢమాస
మునందు నూతనవధూగృహప్రవేశము చేయఁగూడదని తాత్పర్యము॥ .. *

శ్లో॥ చాతుర్మాస్యే న దూష్యస్స్యాద్గంధర్వాఖ్యః కరగ్రహః మాసప్రా
ధాన్యకర్మాణి కర్తవ్యాని మనీషిభిః॥ టీ॥ చాతుర్మాస్యే-ఆషాఢమాసము మొ
దలుకొని నాలుగు మాసములయందు-గంధర్వాఖ్యకరగ్రహః-అష్టవిధవివా
హంబులలోపల గాంధర్వంబనియెడు పాణిగ్రహణము-దూష్యః-దూషిం
పఁదగినది-న స్యాత్-కాకపోవుచున్నది-తత్-ఆనాలుగు మాసములయందున్ను
మనీషిభిః-విద్వాంసులచేత-మాసప్రాధాన్యకర్మాణి-మాసప్రధానమ్ము
గా చేయఁదగిన వ్రతాదికార్యములు-కర్తవ్యాని-చేయఁదగినదియనుట॥ *

స్త్రీధర్మమ్.

శ్లో॥ కుర్యాచ్ఛ్వశురయోః పాదవందనం భర్తృతత్పరా-ద్వారోపస్థిత

నంతత్యంగవాటూ వేతణంతథా॥టీ॥ స్త్రీ. స్త్రీశ్వశురయోః-అత్తమామలకు
నిత్యమ్-నిరంతరమును-పాదవందనమ్-పాదములకుఁగూర్చినమస్కారమును
ను-తథా-ఆప్రకారముభర్తృతత్పరా - పతియందత్యంతాసక్తిగలిగినదియై-
ద్వారోపసేవనం పెనిమిటివచ్చువర్యంతమువాకిటగాచియుండుటనును-గవా
టూవేతణంగవాక్షనిరీక్షణమునను-కుర్యాతు-చేయవలయుననుట॥ ... *

శ్లో॥ వివాహేబలమావశ్యం-దంపత్యోర్గురుసూర్యయోః చేత్పూజాం
యత్నతఃకుర్యాద్దుర్బలప్రదయోస్తయోః॥టీ॥ వివాహే-వివాహమునందు-
దంపత్యోః - జాయాపతులకు/గురుసూర్యయోః- గురుసూర్యులయొక్క - బ
లం బలము-ఆవశ్యం-ముఖ్యంబైనది-దుర్బలప్రదయోశ్చేత్తు-దౌర్బల్యమని
చ్చువారైనట్లాయెనా-తయోః- ఆగురుసూర్యులకు-యత్నతః - ప్రయత్న
పూర్వకముగా-పూజాం-పూజను-కుర్యాతు-చేయవలయుననుట॥ . . *

శ్లో॥ శుభేక్షితయుతాశ్శస్తా ఉద్వాహేఖిలరాశయః - శుభషడ్వర్గగేల
గ్నేమహాదోషవివర్జితేజామిత్రశుద్ధిసంయుక్తే వివాహశ్శుభదోమతః॥టీ॥
ఉద్వాహే-వివాహమునందు - అఖిలరాశయః-సమస్తరాసులును శుభేక్షి
తయుతాః శుభగ్రములచేత వీక్షితంబులును సంయుక్తంబులనునై-శస్తాః-
ప్రసిద్ధంబులగుచున్నవి-శుభషడ్వర్గగే-శుభగ్రహషడ్వర్గమునుఁ బొందినట్టి
యు మహాదోషవివర్జితే - యేకవింశతిమహాదోషంబులచేతవర్జితంబైన
ట్టియు-జామిత్రశుద్ధిసంయుక్తేసప్తమశ్శుద్ధితోఁగూడినట్టి లగ్నే-ముహూర్త
మునందు-వివాహః-వివాహము-శుభదః - శుభప్రదంబై-మతః-సమ్మతంబై
నది యనుట॥ ...... ...... ..... ...... ...... ..... *

## పుష్కరాంశాః.

శ్లో॥ యేకవింశోమనుశ్చైవజనాశ్చమునయః క్రమాత్ - మేషాదిమీన
పర్యంతంపుష్కరాంశాఃప్రకీర్తితాః॥టీ॥ యేకవింశః - ఇరువదియొకటవభా
గమును-మనుశ్చైవ-పదునాలుగవభాగమును- జనాశ్చ-ఇరువదినాలుగవభా
గమును-మునయః-యేడవభాగమును - క్రమాతు-మేషాక్రమముగాను- మే
షాదిమీనపర్యంతం-మేషము మొదలుకొని మీనపర్యంతమును-పుష్కరాంశాః
పుష్కరాంశములు-ప్రకీర్తితాః-చెప్పంబడినవియనుట॥ ... .. ... ...*

శ్లో॥ శ్వశురోర్కస్సితశ్శ్వశ్రూః స్త్రీణామస్తపతిఃపతిః - తేషాంచా
స్థితేష్వేషుశుభంనీచారిగేష్వసతు॥టీ॥ స్త్రీణాం-స్త్రీలకుఅర్కః-సూర్యుడు

యగుచుండగా- శేషం-మిగిలినసంఖ్య- పంచకం - పంచకమనంబడుననగా మూడు అయిదు ఏడుతొమ్మిదిమిగిలినట్లైతే- పంచకరహితంబైనదియని తెలియవలయుననుట॥ ... ... ... ... .. .. ... *

శ్లో॥ ఏకోమృత్యుర్ద్వయంవహ్నిశ్చత్వారోరాజపంచకంషట్చోర అష్టరోగస్స్యాదితేతత్పంచకంస్మృతమ్॥టీ॥ ఏకః- ఒకటిమిగిలితే- మృత్యుః- మృత్యుపంచకము-ద్వయం- రెండు-వహ్నిః - అగ్నిపంచకము-చత్వారః-నాలుగు-రాజపంచకం-రాజపంచకము షట్ - ఆరు-చోరః-చోరపంచకము - అష్ట-ఎనిమిది-రోగః-రోగపంచకము-స్యాత్ -అగుచున్నది ఇతి- ఈప్రకారము- యేతత్ - ఈ చెప్పినది-పంచక-పంచకంబని-స్మృతం-స్మరింపఁబడినదయనగా ఇచ్చటఁజెప్పినపంచకములు మంచివిగాదనుట॥ ... ... ... ... ...*

శ్లో॥ సేవాయాంరాజకంమార్గేచోరంరాజాగ్నిమాలయే। మౌంజీబంధనఉద్వాహేరోగంమృత్యుంచవర్జయేత్ ॥టీ॥ సేవాయాం- రాజును సేవింపఁబోవునప్పుడు-రాజకం-రాజపంచకమును-మార్గే-ప్రయాణమునందు-చోరం-చోరపంచకమును - ఆలయే - నూతనగృహారంభమునందు - రాజాగ్నిం- రాజపంచకమును అగ్నిపంచకమునున్ను-మౌంజీబంధనే- ఉపనయనమునందు ఉద్వాహే వివాహమునందును- రోగం-రోగపంచకమును - మృత్యుంచ మృత్యుపంచకమునున్ను - వర్జయేత్ -విడిచిపెట్టవలయుననుట॥ .. ... *

శ్లో॥త్యజేద్భానువారేతురోగంశనౌమృత్యుకంభూమిపుత్రేతు వహ్నిమ్।గురౌసోమవారేచరాజానమేవంబుధేభార్గవేతస్కరాఖ్యమ్॥టీ॥ భానువారేతు- ఆదివారమునాఁడైతే-రోగం-రోగపంచకమును-శనౌ-శనివారమునందు-మృత్యుకం-మృత్యుపంచకమును-భూమిపుత్రేతు - అంగారకవారమునండైతే-వహ్నిం-అగ్నిపంచకమును-గురౌ- గురువారమందును- సోమవారేచ- ఇందువారమునందును- రాజానం-రాజపంచకమును-యేవం- ఈప్రకారముగాఁబుధే- సౌమ్యవాసరమునందును- భార్గవే- శుక్రవారమునందును-తస్కరాఖ్యం- చోరపంచకమును- త్యజేత్ -పరిత్యజించవలయుననుట॥ ... ...*

శ్లో॥చోరంరోగంత్యజేద్రాత్రౌదినారాజాగ్నిమేవచ। అర్ధరాత్రేత్యజేన్మృత్యుంపంచకంయత్రదృశ్యతే॥టీ॥ రాత్రౌ-రాత్రికాలమునందు-చోరం రోగం -చోరరోగపంచకములను-దివా- పగటియందు- రాజాగ్నిమేవచ- రాజవహ్నిపంచకములను - అర్ధరాత్రే - నిశీధకాలమునందు-మృత్యుం-మృ

త్స్యపంచకముసా-త్యజేత్ - విడిచిపెట్టవలసినది - యత్ర - యేఃవాహమునందు-పంచకం - చోరరోగరాజాగ్నిమృత్యుపంచకములలో నేదియైనను-దృశ్యతే-గనుపడుచున్నదో యత్త్యజింపదగినదియని పదూాంతరంబనుట॥ ... *

స్వల్పదోషాః.

శ్లో॥ఉపగ్రహాఖ్యందూష్యంచభగ్రహం యుద్ధదూషితమ్। విరుద్ధయోగనాద్యశ్చపంగ్వంధగ్రహజన్మభమ్॥టీ॥దూష్యం-దూషింపబడిన- ఉపగ్రహాఖ్యం - ఉపగ్రహంబను పేరుగలదోషమున్ను - యుద్ధదూషితం యుద్ధమునందుదూషింపబడిన-భగ్రహం-భగ్రహంబనుదోషమున్ను-విరుద్ధయోగనాద్యాశ్చ - విరుద్ధంబులైనమరణయోగనాశయోగాదులయొక్క గడియలున్ను - పంగ్వంధగ్రహజన్మభం-కుంటిరాసులుగుడ్డిరాసులు-జన్మనక్షత్రమున్ను ఈ చెప్పినవిస్వల్పదోషంబులని తెలియవలసినదియనుట॥ ... ... .. .. *

ఏతద్దోషాణాందేశవ్యవస్థా,

శ్లో॥ఉపగ్రహర్క్షంకురుబాహ్లీకేషుకళింగవంగేషుచలత్తసంభవమ్।సౌరాష్ట్రగూర్జరేషుచపాతజన్యం శేషేతుదేశేనవిరుద్ధదోషః॥టీ॥కురుబాహ్లీకేషు-కురుదేశబాహ్లీకదేశములయందు-ఉపగ్రహర్క్షం- ఉపగ్రహనక్షత్రదోషమున్ను - కళింగవంగేషుచ- కళింగవంగదేశములయందు - లత్తసంభవం-లత్తవలనంబుట్టినదోషమున్ను - సౌరాష్ట్రగూర్జరేషుచ- సౌరాష్ట్రగూర్జరదేశములయందు-పాతజన్యం-పాతమువల్లబుట్టినదోషమున్ను అవుచున్నది-శేషేతుదేశే-మిగిలినదేశములయందైతే-విరుద్ధదోషః- ఈ చెప్పినవిరుద్ధషంబులు లేవని తెలియవలయుననుట॥ ... ... ... .. *

శ్లో॥యేమానదగ్ధాదయఏవదోషాఃవర్జనీయాఃఖలుమధ్యదేశే॥ దుస్స్వప్నదుర్గ్రహదుర్నిమిత్తదుశ్శకునాద్యాఅపియత్రతత్ర॥టీ॥మానదగ్ధాదయః - శర్మనక్షత్రదగ్ధనక్షత్రములు మొదలైనవి-యే- ఎవ్వి-తేదోషాః - ఆదోషంబులన్నియు-మధ్యదేశే - మధ్యమదేశంబునందు-వివర్జనీయాఃఖలు-విడువందగినవిగదా-దుస్స్వప్నదుర్గ్రహదుర్నిమిత్తదుశ్శకునాద్యా అపి-కీడుకలలుదుష్టవస్త్రవలోకనముఃఖ అశనిపాతము మొదలగుదుర్నిమిత్తములు దుష్టశకునములు మొదలైనవియన్నియును-యత్ర యేదేశమునందుం గనుపడుచున్నవో తత్ర - ఆదేశమునందెల్లపరిత్యజించవలసినదియనుట॥ ... ... ... *

శ్లో॥ త్రిషుఘటికాషట్కంజ్వాలాఖ్యే ఘటికాష్టకమ్। త్రిపంచో

త్పాతమృత్యోర్గ్నసహ్యకర్కమకంటకే॥టీ॥వజ్రే - వజ్రనామయోగమునందు - ఘటికాత్రయం - మూఁడుగడియలున్ను - జ్వాలాయాం - జ్వాలాముఖినామయోగమునందు - ఘటికాష్టకం - ఎనిమిదిగడియలున్ను - ఉత్పాతమృత్యోః - ఉత్పాతమృత్యునామయోగములయందు - తిస్రఃపంచ - క్రమముగా మూఁడు ఐదు గడియలున్ను - యమకంటకే యమకంటకయోగమునందు - నవ - తొమ్మిది ఘటికలున్ను - వర్జ్యాః వర్జింపఁదగినవి - స్యుః - అగుచున్నవియనుట॥ *

దోషభంగము,

శ్లో॥ శుక్రఃపంచసహస్రాణిబుధఃపంచశతానిచ।లక్షమేకంతుదోషాణాంగురుఃకేంద్రేవ్యపోహతి॥టీ॥ కేంద్రే - కేంద్రమునందుండిన - శుక్రః - శుక్రుండు - పంచసహస్రాణి - ఐదువేలదోషములను బుధః - కేంద్రమునందున్న బుధుఁడు - పంచశతానిచ - ఐదునూర్లదోషంబులనున్ను - కేంద్రగురుః - కేంద్రస్థుండైనబృహస్పతి - దోషాణాం - దోషములయొక్క - ఏకంలక్షం ఒకలక్షమున్ను - వ్యపోహతి - నశింపఁజేయుచున్నాఁడనుట॥ ... ... ... ... .. *

శ్లో॥ యేలగ్నదోషాఃకునవాంశదోషాః పాపగ్రహోద్దృష్టినిపాతదోషాః లగ్నేగురుస్తాన్విమలీకరోతి బీజంయథాంభఃకతకద్రుమస్య॥టీ॥లగ్నేగురుః - వివాహలగ్నస్థితుండైనగురుఁడు - లగ్నదోషాః - లగ్నదోషములున్ను - కునవాంశదోషాః - కునవాంశదోషములున్ను - పాపగ్రహోద్దృష్టినిపాతదోషాః - పాపగ్రహములు లగ్నముఁజూచినందువలనఁగలిగినదోషములున్ను - యే - ఏవికలవో - ఆదోషంబులనన్నిటిని - విమలీకరోతి - పరిశుద్ధములనుగాఁజేయుచున్నాఁడు - అందుకు దృష్టాంతంబెట్లంటే - కతకద్రుమస్య - చిల్లచెట్టుయొక్క బీజం - విత్తనము - అంభోయథా - ఉదకముఁబలెననిర్మలంబుగఁజేయుననుట॥

శ్లో॥ గురుస్సుదీప్తస్తనుకేంద్రసంస్థితస్స్వవర్గసంస్థోభృగుజోబుధోవా। బలాధికోలగ్నగతోపి శేషతోనిహంతిదోషాన్సకలాంస్తథావిధాః॥గురుః - బృహస్పతి - సుదీప్తః - అస్తంగతత్వంబునొందకమిక్కిలిప్రకాశమానుండై - తనుకేంద్రసంస్థితః - లగ్నకేంద్రముపొందినవాఁడై - స్వవర్గసంస్థః - స్వకీయశుభషడ్వర్గమునందున్నవాఁడైన - భృగుజః - శుక్రుండైనను - బుధోవా - సౌమ్యుండైనను - బలాధికః - షడ్బలాధిక్యుండై - లగ్నగతః - లగ్నంబునంబొందియుండినట్లైతే - తథావిధాః - పూర్వోక్తంబులైన - సకలాన్దోషాన్ - సమస్తదోషంబులను - నిశేషతః - నిశ్శేషముగా - నిహంతి - కొట్టుచున్నాఁడనుట॥*

నను-చంద్రనందనో వా-బుధుండైనను-లగ్నస్థో యది-లగ్నమునందుండినట్లాయెనా-అఖిలాన్-సమస్తంబులైన-దోషాన్-దోషంబులను - అనలః - అగ్ని తూలసంఘమివ-దూదిరాశినిగాల్చెడునట్లు - నాశయతి-నశింపఁజేయుచున్నాడనుట॥ ... .. ... ... ... .. ... ...*

శ్లో॥ కాణాంధబధిరోద్భ్రాంతా దగ్ధలగ్నాదికోద్భవాః- తే దోషా నాశమాయాంతి కేంద్రసంస్థైశ్శుభగ్రహైః॥ టీ॥ కాణాంధబధిరోద్భ్రాంతాః-ఒంటికను గ్రుడ్డి చెవిటి రాహులవల్లనుత్పన్నంబులైనట్టివి-దగ్ధలగ్నాదికోద్భవాః-దగ్ధలగ్నము మొదలైనవాటివలననుద్భవించినట్టివి - దోషాః - దోషంబులు-యే యే - తే-ఆదోషంబులు-శుభగ్రహైః-శుభగ్రహంబులు-కేంద్రసంస్థాః-కేంద్రములయందుండుచుండగా-నాశమ్-వినాశనమును - ఆయాంతి-పొందుచున్నవియనుట॥ .. .. ... .. .. .. *

శ్లో॥ ఉచ్చగశ్శుభ యేకోపి లగ్నగో దోషసంచయమ్-హంతి పాపాని హరితిథౌచోపవాసవ్రతంయథా॥ టీ॥ శుభః-శుభగ్రహము యేకోపి-ఒకటియైనప్పటికి - ఉచ్చగః - ఉచ్చనుబొందినదియైనను-లగ్నగః-లగ్నమును బొందినదియైనను-దోషసంచయమ్-దోషపుంజమును-హంతి-కొట్టుచున్నది-యెట్లన్నను-హరితిథౌచ యేకాదశియందును-ఉపవాసవ్రతమ్-ఉపవాసవ్రతము పాపంయథా-కిల్బిషంబులంబలెనని తెలియవలయుననుట॥ ... ... *

శ్లో॥ యేకోపి మిత్రరాశిస్థశ్శుభో యది విలగ్నగః-హంతి దోషాన్మహాదోషాన్ శివరాత్రివ్రతంయథా॥ టీ॥ శుభః శుభగ్రహము-యేకోపి- ఒకటియైనప్పటికిని-మిత్రరాశిస్థః - మిత్రరాశియందున్నదియైనను - విలగ్నగః లగ్నమును బొందినదియై-స్యాద్యది- అయినట్లాయెనా శివరాత్రి వ్రతం మహాశివరాత్రి వ్రతము-మహాదోషాన్ యథా-మహాపాతకాదిదోషంబులంబలెదోషాన్-దోషంబుల-హంతి-కొట్టుచున్నదియనుట॥ ... ... ... *

శ్లో॥ విపది ప్రత్యరే చైవ చరమం త్యాజ్యం వినా స్వోచ్చస్వర్క్షగతశ్చంద్రశ్శుభదస్సర్వకర్మసు॥ టీ॥ చరమం-పరమమైన తారను - ఆద్యకంచ జన్మతారనున్న- వినా విడిచిపెట్టి-విపది-విపత్తారయందును- ప్రత్యరే చైవ-ప్రత్యక్తారయందును-స్వోచ్చస్వర్క్షగతః-స్వోచ్చక్షేత్రములయందుండిన-చంద్రః-చంద్రుడు సర్వకర్మసు-సమస్తశుభకర్మములయందు-శుభదః-శుభదాయకుండనియెరుంగవలయుననుట॥ ... ... ... ... ... *

శ్లో॥ జన్మర్క్షలగ్నయోర్వాపి చంద్రస్సత్శుభేక్షితః - కేంద్రే శుభే స్వ
వర్గేవా లగ్నాదుపచయేపివా॥ టీ॥ జన్మర్క్షలగ్నయోర్వాపి - జన్మతారాల
గ్నములయందుండినప్పటికిని - చంద్రః - చంద్రుడు - శుభేక్షితః - శుభగ్రహవీ
క్షితుండై - కేంద్రే - కేంద్రమునందైనను - శుభే శుభకరంబైన - స్వవర్గేవా - స్వో
చ్చమిత్రకూలత్రికోణములయందైనను - లగ్నాదుపచయేపివా - లగ్నముకం
టెను పచయస్థానంబులగు తృతీయషష్ఠదశమైకాదశ స్థానంబులయందైన
ను - స్థితశ్చేత్ - ఉన్నట్లాయెనా - శస్తః - శుభప్రదుండగుచున్నాడనుట॥ .. *

శ్లో॥ జీవేసితే కంటకస్థే పాపేవా త్రిషడాయగే వారర్క్షతిథియోగా
నాందోషమాశు వ్యపోహతి॥ టీ॥ జీవే - గురుండైనను - సితే శుక్రుండైనను - కం
టకస్థేసతి - కేంద్రములయందుండగాను - పాపే - పాపగ్రహమున్ను - త్రి
షడాయగేసతి - తృతీయషష్ఠలాభస్థానములను బొందియుండగాను - వార
ర్క్షతిథియోగానాం - వారనక్షత్రతిథియోగముల యొక్క - దోషం - దోష
ము - ఆశు - శీఘ్రముగా - వ్యపోహతి - నశించుచున్నదియనుట॥ ... ... ... *

శ్లో॥ యేవంగుణాగుణాన్వీక్ష్య లగ్నం నిశ్చిత్య యత్నతః - సిద్ధాంతోక్తేన
మార్గేణ లగ్నకాలం సమానయేత్॥ టీ॥ యేవం - ఈప్రకారముగా - గుణాగు
ణాన్ - గుణదోషములను - వీక్ష్య - లెస్సగా విమర్శించి - యత్నతః - ప్రయత్న
మువల్ల - లగ్నం - ముహూర్తమును - నిశ్చిత్య - నిశ్చయించి - సిద్ధాంతోక్తేన -
మార్గేణ - సిద్ధాంతమునందు జెప్పఁబడిన మార్గముచేత - లగ్నకాలం లగ్నసమయ
మును - సమానయేత్ - పొందింపవలయుననుట - అనగా సిద్ధాంతోక్తప్రకారము
గా ముహూర్తనిశ్చయము సేయవలయుననుట॥ ... .. ... . . .. *

శ్లో॥ వైధవ్యం తరణిస్తనోతి హిమగుస్తామేవ హంత్యాదరాద్భౌమో
దంపతిహా శశాంకతనయస్సౌభాగ్యమాయచ్ఛతి - ఆయుర్ద్రాగ్గురుభార్గవౌ మృ
తుగతిర్ద్రాక్ శ్రీకరస్సర్వదారాహుశ్చాస్య నపత్యకృన్నిజగుణైర్లగ్నే వి
వాహేష్టభిః॥ టీ॥ వివాహలగ్నే - వివాహముహూర్తమునందుండినట్లై
తే - అష్టభిః ఎనిమిదియైన - నిజగుణైః - తమతమయందుండునై జగుణవిశేష
ముల చేత - తరణిః - సూర్యుడు - వైధవ్యం - విధవత్వమును - తనోతి - విస్తరింపజేయు
చున్నాడు - హిమగుః - చంద్రుడు - తామేవ - ఆకన్యకనె - ఆదరాత్ - ఆద
రణమువల్ల - హంతి - కొట్టుచున్నాడు - భౌమః - అంగారకుడు - దంపతిహా - ఆజాయాప
తులనుహరింపుచున్నాడు - శశాంకతనయః - బుధుడు - సౌభాగ్యం - ఐశ్వర్యము

మయే బహుపుత్ర దాతా॥టీ॥శోభనైకః-శుభగ్రహం బోకండుస్వోచ్చస్వ వర్గసహితః-స్వోచ్చమూలత్రికోణస్వకీయ్యషడ్వర్గయుక్తంబై-బలవాన్-స్థానాదిషడ్బలయుతంబై-కేంద్రత్రికోణః వనే-కేంద్ర-కేంద్రములయందైనను త్రికోణచవనే-త్రికోణస్థానములయందైనను-ప్రవిష్టాయది-ప్రవేశించియుండెనేనియు-పాపైః పాపగ్రహములు-తథావిధగుణైః- అట్టిస్వోచ్చస్వవర్గసహితత్వాదిగుణసంపన్నంబులై-త్రిషడాయగైస్సద్భిశ్చ-తృతీయషష్ఠలాభస్థానములయందు బొందియుండగానున్న - వివాహసమయే-వివాహముహూర్తసమయమునందు-బహుపుత్రదాతా-దీర్ఘాయుష్మంతులైనయనేకపుత్రులనిచ్చెడు- యోగః- శుభయోగమువధూవరులకుc గలుగుచుండునని తెలియవలయు॥ ... ... . ... ... ... ... . *

శ్లో॥ లాభస్థేసూర్యపుత్రే భవష్ఠేసూర్యేచతిష్ఠతి। విలగ్నేతుసితేజీవే తృతీయేధరణీసుతే। చంద్రేచదశమస్థేతు శుక్రేరంధ్రేవ్యవస్థితే। ఏకస్తుస్యాత్సమాయోగోదంపత్యోఃపుత్రపౌత్రదః॥టీ॥ సూర్యపుత్రే - శనైశ్చరుండు-లాభస్థే- పదనకొండవయింటనుండగా - సూర్యేచ-సూర్యుండును-షష్ఠే-ఆఱవస్థానమందు-తిష్ఠతిసతి - ఉండగాను- జీవే బృహస్పతి-విలగ్నే - వివాహలగ్నమునందు - స్థితేసతి-వర్తించుచుండగాను- ధరణీసుతే-అంగారకుండు-తృతీయే-మూడింటనొప్పుచుండగాను- చంద్రేచ-చంద్రుడున్న - దశమస్థేచ-దశమస్థానమునందు నొనరియుండగాను-శుక్రే- భార్గవుండు-రంధ్రేచ - ఎనిమిదింట-సంస్థితే - ప్రవర్తించుచుండగానున్న - ఏకః-ముఖ్యమైన-సమాయోగః-శుభయోగము-దంపత్యోః-దంపతులకుపుత్రపౌత్రకః-పుత్రపౌత్రప్రదంబైనది-స్యాత్ -అగుచున్నదియనుట॥ ... .. *

శ్లో॥ లగ్నేగురుఃకుజోలాభేదశమేభాస్కరోభవేత్। ఉమాశంకరవత్ప్రీత్యాహ్యుద్దంపత్యోస్సుఖావహం॥టీ॥లగ్నే - వివాహలగ్నమునందు-గురుః బృహస్పతియు-లాభే-పదనకొండవయింట-కుజః-భౌముండును - దశమే-పదియవస్థానమందు-భాస్కరః - సూర్యుండును-భవేచ్చేత్ - అయినట్లాయెనా-అనఁగా నాయాస్థానంబులనుయాగ్రహంబులుండెనేనియు - ఉమాశంకరవత్-పార్వతీపరమేశ్వరయోగంబనియు - నట్టియోగంబును-దంపత్యోః - వధూవరులకు-సుఖావహం-సుఖసంపాదకంబగుదానినిగా - ఆహుః- పెద్దలు చెప్పుచున్నారనుట॥ ... ... ... ... .. ... ... *

శ్లో॥ కుజార్కి శుక్రజీవాస్స్యుర్యాపోక్లీబగతాయది। రమావిష్ణురితిఖ్యాతౌ దంపత్యోశ్చ సుఖావహాః॥ టీ॥ కుజార్కి శుక్రజీవాః-కుజరవిశుక్రగురులు-ఆపోక్లీబగతాః-లగ్నంబునకుతృతీయషష్ఠనవమవ్యయస్థానంబులనుండువారు-స్యుర్యది-ఐరేనియు-రమావిష్ణురితి-లక్ష్మీనారాయణంబనుయోగంబు-ఖ్యాతః ప్రసిద్ధంబై-దంపత్యోశ్చ-జాయాపతులకుభయులకును-సుఖావహాః-సుఖకరంబైనదియైయుండుననుట॥ ... . ... .. ... ... *

రాహుకేతుదోషః.

శ్లో॥ లగ్నాస్తసంస్థౌయదిరాహుకేతూనదోషదౌవేతివదంతికేచిత్। త్రిస్కంధశాస్త్రార్థవిదస్తులగ్నాస్తగౌతౌచహివర్జయంతి॥ టీ॥ రాహుకేతూ-ఛాయాగ్రహంబులైన-రాహుకేతువులు-లగ్నాస్తసంస్థౌయది వివాహలగ్నజామిత్రస్థానంబులనుండినప్పటికిన్ని-నదోషదౌవేతి-దోషము సేయువారుగారని - కేచిత్ - కొందరుమునులు - వదంతి-పలుకుచున్నారు - త్రిస్కంధశాస్త్రార్థవేదినస్తు-త్రిస్కంధశాస్త్రార్థవేత్తలైతే-లగ్నాస్తగౌ-లగ్న - సప్తమస్థానంబులంబొందిన-తౌచ - ఆరాహుకేతువులను - వర్జయంతిహిః పరిత్యజించుచున్నారు - అనంగావివాహముహూర్తవిషయమై లగ్నాస్తగతరాహుకేతుదోషంబులుగొందరిచేతనవలంబింపబడినదనియు గొందరిచేతనంగీకరింపబడలేదనియునీరెండుదెఱంగులనెఱుంగవలయుననుట

లగ్నాస్తగతరాహుకేతుదోషభంగః.

శ్లో॥ వివాహేషుచదేవానాం ప్రతిష్ఠాసూపనాయనే। ఛాయాగ్రహావుభౌ విజ్ఞేయౌ రాహుకేతూనదోషదౌ॥ టీ॥ వివాహేషుచ - వివాహకార్యములయందును-దేవానాంప్రతిష్ఠాసుచ- దేవతాప్రతిష్ఠలయందును - ఉపనాయనే- ఉపనయనవ్రతమునందును- ఛాయాగ్రహౌ-ఛాయాగ్రహంబులైన-రాహుకేతూ-లగ్నాస్తగతులైనరాహుకేతువులు - నదోషదౌ- దోషప్రదులుగారని-విజ్ఞేయౌ - తెలియదగినవారనుట॥ ... ... ... .. *

చంద్రస్యాస్తవృద్ధబాలతా.

శ్లో॥ వృద్ధత్వమిందోస్త్రిదినందినార్ధం బాలత్వమస్తత్వమహర్ద్వయంచ। అస్తేనిధత్తే మృత్యుముపైతికన్యా బాలేన్నసక్తావిధవాచవృద్ధే॥ టీ॥ ఇందోః చంద్రునికి-వృద్ధత్వం - ముసలితనము-త్రిదినం- మూడుదినములు-బాలత్వం - బాల్యము-దినార్ధం - దినమునర్ధము - అస్తత్వం - అస్తంగతత్వము-అహర్ద్వ

